చతుర



సంపుటి:4
మే 1981
సంచిక:4

## ఈ నెల సమగ్ర నవల

"మీరు కొన్నాళ్ళపాటు మా యింట్లో వుండి మా ఆవిడ ప్రతి కదలికని పరిశీలించండి... ఏమంటారు?"
సంఘంలో పలుకుబడిగల ఖరీదైన ఆ పెద్దమనిషి తన నలా అడిగేసరికి ఉలిక్కిపడి ఆశ్చర్యపోయాడతను. తనవంటి కొత్త వ్యక్తిని స్వయంగా ఇంట్లోకి ఆహ్వానిస్తూ తన భార్యతో సన్నిహితంగా గడపమంటున్నాడీ పెద్ద మనిషి. అందులో దాగివున్న రహస్యమేమిటి ?
ఎన్నో సంశయాల్తో కలవరపడి చివరికి ఆ వ్యక్తి కోరికని మన్నించి అతని యింట్లో ప్రవేశించి అతని భార్యతో పరిచయాన్ని పెంచుకున్నాక జరిగిందేమిటి ?
ఆ మనుషుల మనసుల్లోని మర్మాల్ని, రహస్యాల్ని ఛేదించలేక, అర్థం చేసుకోలేక చివరికి ఏమైపోయాడా యువకుడు ?
తొలి నుండి తనని చుట్టుముట్టి ఉక్కిరి బిక్కిరి చేసిన ప్రశ్నల వలయంలోంచి అతను బయటపడగలిగాడా? ఆ దంపతుల...

# మనసు

లలోని మర్మాల్ని ఛేదించి, వాటిలో చెలరేగిన భావ పరంపరల ఫలితాన్ని తట్టుకోగలిగాడా ?
మనిషి మస్తిష్కపు పొరలలో దాగి వున్న విజ్ఞానాన్ని, అజ్ఞానాన్ని, అది చేయించగల ఘనకార్యాల్ని అత్యంత సహజంగా వివరించిన

## సంధ్యారాణి

మనో విశ్లేషణాత్మక రచన 'మనసు' ఈ నెల చతుర సమగ్ర నవల

*ముఖచిత్రం : గీతాదత్త*

*రెండవ, మూడవ కవర్లు : సూరజ్ ఎస్. శర్మ*

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*



శుభ్రమైన తాజా శ్వాస...
ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు
కోల్గేట్
డెంటల్ క్రీమ్ ఫలితం
ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.
మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.
అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.
కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:
మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.
కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.
ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.
కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.
నోటి దుర్వాసనను ఆపండి...
కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
దంతక్షయాన్ని ఎదుర్కోండి!
Colgate DENTAL CREAM
Colgate
పరిపూర్ణమైన దంతరక్షణ కోసం
కోల్గేట్ పైగార్డ్ టూత్‌బ్రష్‌లనే వాడండి.
మూడింతలు మేలైనవి
1 పళ్ళ ఎనామెల్‌కి రక్షణ
2 పళ్ళ పొరలారినుండి
3 చిగుళ్ళకు రక్షణ
DC.G.74 TL

# నేచురాలిటీ



అప్పారావుకి నిర్మాతగా సినీ ఫీల్డులో మంచి పేరుంది. అంతకుముందు తను తీసిన "మగవాడూ-మాంగళ్యం" అన్న సినిమా విజయవంత మవడంతో రెట్టింపు ఉత్సాహంతో మరో సినిమా నిర్మించాలని నిశ్చయించాడు. పైగా ప్రయోజనాత్మక చిత్రాలు తీస్తాడన్న పేరు కూడా వుంద తనికి. అందుకని తను తీసే చిత్రం ప్రభోదాత్మకంగా వుండాలని నిశ్చయించి ఫీల్డులో బాగా పేరున్న దర్శకుడు ధాం ధాం గారికి చిత్ర దర్శకత్వ బాధ్యత అప్పగించాడు.

షూటింగు నల్లేరు మీద బండిలా సాగిపోతోంది. ఆ సినిమాలో కొన్ని జైలు సీన్లు వున్నాయి. అప్పారావు "మన సినిమా చాలా సహజంగా వుండాలి కనక ఏకంగా జైల్లోనే తీద్దాం" అన్నాడు దర్శకుడితో. సరే జైలు అధికారిని సంప్రదించి అనుమతి సంపాదించారు. అనుకున్నది అనుకున్నట్లు షూటింగు జరిగింది. సీన్లన్నీ అత్యంత సహజంగా బ్రహ్మాండంగా వచ్చాయని మురిసిపోయారు దర్శక, నిర్మాతలు. అన్నీ సర్దుకుని వెళ్ళబోయే ముందు జైలు అధికారికి కృతజ్ఞతలు తెలీజేయడం మర్యాద గనక అప్పారావు, ధాం ధాం దర్శకుడు జైలు అధికారి దగ్గిర కెళ్ళారు.

చతుర

"మీకు చాలా కృతజ్ఞతలు చెప్పుకోవాలండీ! మాకు అనుమతి ఇచ్చి చిత్ర నిర్మాణానికి చాలా సాయపడ్డారు. మాకింత సహకారం అందించినందుకు చాలా సంతోషంగా వుంది మాకు. మీ మేలు మర్చిపోలేం" అన్నాడు దర్శకుడు ధాం ధాం ముఖం వెలిగిపోతుండగా.

సినిమా షూటింగ్స్ చూసిన సరదాలో జైలు సూపర్నెంటు చాలా కులాసా మూడ్‌లో వున్నాడు. అతను వా మాటలకు ఒకింత మొహమాటపడి ఫారిన్ ఇంగ్లీషులో మర్యాదగా "అబ్బే... దాందేంవుంది లెండి. అయినా మీకు సహాయంచేయగలిగినందుకు చాలా సంతోషంగా వుంది నాకు. ఈ జైలు తలుపులు

మీ కోసం ఎప్పుడూ తెరుచుకొనే వుంటాయి. మీరేం మొహమాటపడ నవసరం లేదు" అన్నాడు నమ్రతగా. ఇంగ్లీషు సరిగారాని అప్పారావు, థాం థాం జైలు అధికారి మర్యాదకు పొంగి పోయారు. "ఎంత మాట! తప్పకుండా త్వరలో వస్తాం" అన్నాడు ఏకగ్రీవంగా.

# బద్ధకస్తుడు

“ఓరేయ్ బాబీ... ఏం చేస్తున్నావురా? రిక్షా వచ్చేసింది తొందరగా నడు" అన్న అమ్మ పిలుపుతో పుస్తకాల సంచీ తీసుకొని ఇవతలికొచ్చాడు బాబిగాడు.

కథలు

చివరి ప్రయత్నం అన్నట్లుగా "అమ్మా ఇవ్వాళ స్కూలుకెళ్ళనే.. గోపీవాళ్ళతో ఆడుకుంటాను..." అని గునిశాడు.

"స్కూలు నుంచి వచ్చాక ఆడుకో వచ్చులే. అత్తయ్యా, గోపీ వాళ్ళు ఇంకో పది రోజులుంటారు. పద పద టైమయి పోతోందని గోల పెడుతున్నాడు రిక్షా వాడు" అనడంతో బాబి అయిష్టంగా రిక్షా ఎక్కాడు.

బాబి స్కూలు దగ్గిర దిగి తన క్లాసులోకెళ్ళాడు. కూచ్చున్నాడన్నమాటే గాని వాడి మనసంతా ఇంటి దగ్గిరే వుంది. ఇంట్లో వుంటే ఎన్నిరకాల ఆటలు ఆడుతూ వుండేవాళ్ళో తనూ, గోపి. ఇంకా..

ఇంతలో క్లాసులో గోల తగ్గి అంతా నిశ్శబ్దం అయిపోగానే బాబిగాడు ఆలోచనల్లోంచి తేరుకొని పుస్తకాలు ముందేసుకున్నాడు. టీచర్ అటెండెన్స్ తీసుకొని పాఠం ప్రారంభించింది. ఆ రోజు పాఠం బద్ధకస్తుల గురించి. లేడీ టీచర్ పనీ పాటా చేయడానికి ఇష్టపడని బద్ధకస్తులు ఎలా వుంటారో, చివరికి వాళ్లు ఏమవుతారో చక్కగా వివరించి, పిల్లల మనసుకు పాఠం బాగా హత్తుకోడానికని బోర్డు మీద ఓ బొమ్మ కూడా గీసింది. ఆ



బొమ్మలో మనిషి లావుగా, అసహ్యంగా పెద్ద బాన పొట్టతో వున్నాడు. కాని బాబి మనసు మాత్రం ఆ పాఠం మీద

తెలుగు సినీ పత్రికారంగంలో సంచలనం!

వారం వారం 7,00,000 మందిని తన్మయుల్ని

చేస్తున్న జ్యోతిచిత్ర

అనన్య ప్రచారం కలిగిన సినీ వారపత్రిక

ఉత్తమాభిరుచులకు-
తాజా వార్తలకు-

'ఆంధ్రజ్యోతి' వారు

అందిస్తున్న
రంగు రంగుల
రసమయ
రాగమాలిక



లేదు. ఇంటి దగ్గిర మధ్యలో మానేసిన జేమ్స్‌బాండ్ ఆట మీదా, గోపీ మీదా ఉంది.

టీచర్ పాఠం చెప్పడం పూర్తి చేసి ప్రశ్నలు వేస్తోంది. "బద్ధకస్తుడికో ఉదాహరణ చెప్పు" అని అడిగింది బాబీని లేపి. బాబిగాడు ఒక్కసారి ఊహల్లోంచి బయటపడ్డాడు. టీచర్ చెప్పిన పాఠం తలకెక్కితేగా వాడికి. చెప్పకపోతే తిట్లు తినాలి. ఉన్నట్లుండి వాడి బుర్రలో ట్యూబ్‌లైటు వెలిగింది ఠక్కున "మా తమ్ముడండీ" అన్నాడు. టీచర్ "అదేమిటి బద్ధకస్తుడికి ఉదాహరణ ఇవ్వమంటే మీ తమ్ముడని చెపుతావ్" అంది.

"అవును టీచర్! మా తమ్ముడు కూడా పాలు తాగుతాడు, అన్నం తింటాడు, బట్టలు వేసుకుంటాడు. కాని ఒక్కపని కూడా చేయడండీ ఊరికే పడుకుంటాడు ఇరవై నాలుగు గంటలూనూ" అన్నాడు.

## కీలెరిగిన వాత

రామలింగేశ్వరరావుగారికి ఆ ఊర్లో చాలా పేరుంది. సాధారణంగా సభలు సమావేశాలకు గౌరవాధ్యక్షుడిగా ఆహ్వానిస్తుంటారాయన్ని ఆయన మంచి వాక్చాతుర్యం వున్న వక్త. పైగా కొద్దోగొప్పో కళలు, సాహిత్యం పరిచయం కూడా వున్నవాడు. అందుకని ఆయన చాలా మందికి చిరపరిచితుడు. ఎప్పుడూ ఏవో పనుల మీదా, మీటింగులు, సభలు, సమావేశాలకూ తిరుగుతూ హడావిడిగా వుంటాడు.

ఆ వూర్లో ఒక అగ్రికల్చర్ కాలేజీ వుంది. ఆ కాలేజీలో చాలా రోజులకి కొత్తగా ఎలక్షన్స్ జరిగి స్టూడెంట్ యూనియన్ ఏర్పడింది. కొత్త యూనియన్ ప్రెసిడెంట్ తదితరులు తమ యూనియన్ ప్రారంభోత్సవం చాలా బాగా చెయ్యాలని పట్టుబట్టారు. అంతా విని ప్రిన్సిపాల్ ఆ ప్రారంభోత్సవానికి గౌరవాధ్యక్షుడిగా రామలింగేశ్వరరావు గారిని పిలవమని చెప్పాడు. యూనియన్ సభ్యులు కొంత అయిష్టంగానే అంగీకరించారు. అన్ని ఏర్పాట్లూ చకచకా జరిగిపోయాయి.

రామలింగేశ్వరరావు గారు వేదికనలంకరించారు. స్టూడెంట్లందరూ కుర్చీల్లో కూర్చొని వున్నారు. ప్రిన్సిపాల్, విద్యార్థి యూనియన్ ప్రెసిడెంట్, సెక్రటరీలు మాట్లాడాక రామలింగేశ్వరరావుగారి వంతు వచ్చింది. ఆయన లేచి జరీ కండువా సద్దుకుంటూ మైకు ముందుకొచ్చి నిల్చున్నాడు. ఓ క్షణం సభికులందరినీ కలియజూసి గొంతు సవరించుకున్నారు




నిబ్బరంగా ఉండాలనుకుంటే...
అందుకు సహాయపడే సంస్థ
మీకు తోడుగానే ఉంది.
మార్గదర్శి దానికొక మార్గం చూపిస్తుంది. డబ్బు అవసరమయినప్పుడు ఆదుకొనే ఆప్తమిత్రం మార్గదర్శి. పొదుపుచేసే అలవాటు రానంతటి అదే మీకు అలవడ చేస్తుంది. మార్గదర్శిలో మీ కష్టార్జితం లాభాలు కూడా ఆర్జించి, మీ కష్ట సమయాల్లో సుఖాల తీరం చేరుస్తుంది. ఆంధ్రప్రదేశ్ అరవై వేల మందికి పైగా ఖాతాదారుల తమ భద్రతకూ, భావి సౌభాగ్యానికి 'మార్గదర్శి' నే ఎంచుకోవడానికి అదే కారణం.
మార్గదర్శి
చిట్‌ఫండ్ ప్రైవేటు లిమిటెడ్
మార్గదర్శి హౌస్,
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్-500 001
డబ్బు లోపమేమో మీ చింత - మార్గదర్శి పుష్టి మీ చెంత
శాఖలు: ●ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ ●లక్డీకాపూల్, హైదరాబాద్ ●చిక్కడపల్లి, హైదరాబాద్ ●అమీర్‌పేట, హైదరాబాద్ ●చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ●ప్రసెంట్ రోడ్, విజయవాడ ●బందరు రోడ్, విజయవాడ ●మెయిన్ రోడ్, గుంటూరు ●మెయిన్ రోడ్, కాకినాడ ●ఇన్నీసుపేట, రాజమండ్రి ●నెహ్రూ రోడ్, కర్నూలు ●మెయిన్ రోడ్, విశాఖపట్నం ●జె. పి. ఎన్. రోడ్, వరంగల్

వెంటనే స్టూడెంట్లు పిల్లికూతలు, కేకలు మొదలెట్టారు. ప్రిన్సిపాల్ ముఖం కోపంతో కంపగడ్డలాగయింది. ఆయన మైకు ముందుకు వచ్చి విద్యార్థులను మందలించాడు. కొంత నిశ్శబ్దం ఆవరించింది. దానితో, రామలింగేశ్వరరావు మైకు ముందునుంచొని చిరునవ్వుతో "ఈరోజు మీముందు మాట్లాడటం నాకు సంతోషంగా వుంది. అందులోనూ మీ అగ్లికల్చర్ కాలేజీ స్టూడెంట్స్ యూనియన్‌కు ప్రారంభోత్సవం చేయడం మరింత ముదావహమైన విషయం" అంటూ ఉపన్యాసం ప్రారంభించారు. అంతవరకూ గోలచేసిన ఈయనంటే గిట్టనివాళ్ళు, ఏడిపించి తమ తడాఖా చూపిద్దామని కాచుకూర్చునవాళ్ళు దిమ్మదిరిగిపోయారు. వారి చిరునవ్వులు కాస్తా 'అగ్లి కల్చర్' మాట వినగానే ఎగిరిపోయాయి.



# బహుమతి

మా బ్యాంకువారు 'డిపాజిట్ మొబిలైజేషన్ వారం' పాటించాలని నిర్ణయించారు. కొత్తగా డబ్బులు డిపాజిట్ చేసేవారికి ప్రోత్సాహకారకంగా బాల్‌పాయింట్ పెన్నులు, పెన్ టార్చ్‌లు, ఫౌంటెన్ పెన్నులు ఇవ్వాలని నిశ్చయించారు. ఆ ప్రకారమే వారానికి సరిపడా బాల్ పాయింట్ పెన్నులు, పెన్‌టార్చ్‌లు హోల్‌సేల్‌లో కొనుక్కొచ్చారు. డిపాజిట్ మొబిలైజేషన్ వారం చాలా బిజీగా ప్రారంభమైంది. కొత్త డిపాజిటర్లందరికీ ఏదో ఒక వస్తువు బహుమతిగా ఇస్తున్నాము. మూడో రోజుకి బహుమతుల సంగతి అందరికీ తెలిసిపోయి డిపాజిట్ల మీద డిపాజిట్లు వచ్చి పడసాగాయి. మేం కొన్న బాల్ పాయింట్ పెన్నులు, పెన్ టార్చ్‌లు తరిగిపోసాగాయి. ఆరోజు డిపాజిట్ మొబిలైజేషన్ వారంలో చివరి రోజు. పని ఎంత గ్రాండ్‌గా ఉందంటే ఇంచుమించు మా కందరికీ నీరసం వచ్చేసింది.

ఆ రోజు పని ప్రారంభించిన కొద్దిసేపటికే ఎవరో ఇద్దరు వచ్చారు డిపాజిట్ చేయడానికి. అంతా అయి బహుమతి ఇద్దామని చూస్తే ఒక్కటీ లేదు. స్టాకంతా అయిపోయింది. ఏం చేయడమా అని తర్జనభర్జనలాడి చివరికి వచ్చిన వారినే కొంత మొత్తం మించకుండా ఏదన్నా బహుమతి కొనుక్కొమ్మని చెప్పి ఆ రసీదు తీసుకొని డబ్బులిద్దామని నిశ్చయించాము. వచ్చినవారందరికీ ఆ విషయం చెప్పి శ్రమ అనుకోకుండా ఏదన్నా వస్తువు కొనుక్కొని బిల్లుతెచ్చిస్తే డబ్బులిస్తామని చెపుతూ వచ్చాం. వాళ్ళు విసుక్కొంటూనే మేం చెప్పినట్లు చేశారు. మాకు అందరికీ ఎప్పుడీ గొడవ వదులుతుందా అని వుంది. ఇంతలో ఎవరో ఒక

తను హడావిడిగా డబ్బు తెచ్చాడు డిపాజిట్ చేయడానికి. నేను పనిపూర్తిచేసి అలవాటుగా అసలు విషయం చెప్పి ఏదన్నా వస్తువు కొని బిల్లు పట్టండి డబ్బులిస్తా అన్నాను. అతను చిరాగ్గా "దానికోసం ఎక్కడతిరగనండీ బాబూ!నాకేమీ అక్కర్లేదు" అన్నాడు. "అయ్యో భలేవారే బహుమతి తీసుకోకపోతే ఎలాగండీ! శ్రమ అనుకోక దయచేసి ఏదన్నా కొని బిల్లు పట్టండి" అన్నాను వినయంగా. అతను విసుక్కుంటూ వెళ్ళి ఓ అర గంటలో బిల్లుతెచ్చి చేతికిచ్చాడు త్వరగా డబ్బులివ్వండంటూ. బిల్లు చూసి డబ్బులివ్వబోతూ అతను కొన్న వస్తువు పేరు చూశాను. అందులో బలవర్ధకటానిక్కు, తలనెప్పి మాత్రలు కొన్నట్లుంది. నేను నోరు తెరచి ఏదో అనబోయేంతలోనే అతను నా చేతిలో డబ్బులు లాగేసుకొని వడివడిగా వెళ్ళిపోయాడు. టానిక్కు, తల నొప్పి మాత్రల బిల్లు నా చేతిలో రెపరెపలాడుతోంది.

# మంత్రి పదవి

కుక్కుటేశ్వరరావుకి అక్షర జ్ఞానం లేకపోయినా లోకజ్ఞానం మాత్రం బాగా వుంది. అందుకే ఫ్యాక్టరీలో కూలీగా పని చేస్తూనే కొంచెం కొంచెంగా పలుకుబడి సంపాదించి యూనియన్ లీడరయ్యాడు. అంతే! అక్కడ నుంచి తిరిగి పార్లమెంటు మెంబరయ్యేవరకూ వెనుదిరిగి చూసుకొనే తీరిక దొరకలేదతనికి. పార్లమెంటు మెంబరుగా కొద్దోగొప్పో పలుకుబడిగల పదవులే నిర్వహించాడు. ఇంతలో అతని పార్టీ ఓడిపోయింది.

అయితే అనుభవజ్ఞుడు గనుక తమ పార్టీ అధికారం కోల్పోయినా చిన్న చిన్న ప్రజా ఉద్యమాలు నడిపి తన పేరు పూర్తిగా తెరమరుగవకుండా జాగ్రత్త పడ్డాడు. చిట్టచివరికి వాళ్ళ పార్టీకి పట్టిన గ్రహణం తొలగిపోయి మళ్ళీ అధికారంలోకి వచ్చారు. సుగ్రీవరావుని ఆ పార్టీ వారు ఏకగ్రీవంగా ప్రధానమంత్రిగా ఎన్నుకున్నారు. మంత్రివర్గం ఏర్పాట్లు చాలా చురుగ్గా జరిగిపోతున్నాయి. పార్లమెంటు మెంబర్లందరికీ బి.పీ.లు పెరిగిపోయి డాక్టర్ల పర్యవేక్షణలో వుండాల్సి వస్తోంది. కుక్కుటేశ్వరరావు కూడా కేబినెట్ హోదా కోసం తెగతంటాలు పడసాగాడు.

వాళ్ళనీ వీళ్ళనీ అడిగితే లాభం లేదని ఓ రోజు ఏకంగా ప్రధానమంత్రి నివాసానికే వెళ్ళాడు - బతిమాలో బామాలో పదవి సంపాదిద్దామని. ప్రధాని లౌక్యం



తెలిసిన పెద్దమనిషి. వీలయినంత వరకూ ఎవరికీ కోపం తెప్పించకుండా తన పని పూర్తి చేయాలని నిశ్చయించుకుని ఉన్నాడు. అనవసరంగా గొడవ పెట్టుకొని వాళ్ళ మద్దతు పోగొట్టుకోవడం ఇష్టంలేదు. అందుకని అతనితో చాలా ఆదరంగా, సౌమ్యంగా మాట్లాడాడు. చివరికి కుక్కుటేశ్వరరావు చల్లకొచ్చి ముంత ఎంతని దాస్తాములే అని అసలు సంగతి బయట పెట్టాడు– మంత్రి వర్గంలో తనను కూడా చేర్చుకోమని.

ప్రధానమంత్రి కర్ర విరక్కుండా పాము చావకుండా "మంత్రి పదవేం ఖర్మ అంతకన్నా మంచి సాయమే చేస్తా నీకు" అన్నాడు.

"చిత్తం... చిత్తం... మీ దయ వుండాలేగాని నాకేం లోటండి" అన్నాడు

ప్రధానమంత్రి చిరునవ్వులు చిందించి "ఓ పని చేయండి. మీరు మీ మిత్రులకీ, అడిగిన వాళ్ళందరికీ నేను మీకు మంత్రి పదవి ఇచ్చాననీ, కాని మీరు నిరాకరించారని చెప్పండి. అప్పుడు అందరిలోనూ మీ పేరు ప్రతిష్టలు మరింత పెరుగుతాయి. ఏమంటారు?" అన్నాడు.

కుక్కుటేశ్వరరావు తెల్లముఖం వేశాడు.

—శాంతి

# విలన్

శేఖరం దిగులుగా కూర్చున్నాడు పబ్లిక్ గార్డెన్స్‌లో. రాధ ఇంకా రాలేదు.

బస్సుల్లో, ఆటోల్లో ఎందరెందరో.... ఎన్నెన్నో...జంటలు వస్తున్నాయి. తన ముందు నుంచే సరాగాలాడుకుంటూ వెళ్తున్నాయి.

కానీ రాధ రాలేదు.

శేఖరం మనసు మూలిగింది.

బహుశా రాధ డాడీ ఇంట్లోనే వుండి వుంటాడు ముసలి నక్కలా కాపలా కాస్తూ.

రాధ తండ్రి గుర్తొచ్చేడు.

మిలిటరీ మనిషి...భారీ విగ్రహం... మానెక్‌షా మీసాలు .

ఒళ్ళంతా జలదరించింది శేఖరానికి.

"హాయ్ ! డాళింగ్ !"

చివ్వున వెనక్కి తిరిగేడు.

రాధ !

"రాధా!"

"ఆలస్యమైందని కోపం వచ్చిందా?"

"ఏం చెయ్యను? ఇంట్లో డాడీ ఉన్నారు. తమ్ముడు వస్తానన్నాడు. ఆ ఇద్దరికీ ఏదో సాకుచెప్పి వచ్చేసరికి నా తల ప్రాణం తోకకొచ్చింది"

"రాధా!"గారంగా పిలిచాడు శేఖరం. పెదవులు రెండూ సున్నాలా చుట్టి ఓ ముద్దిమ్మని సైగ చేసేడు.

"ఏయ్! ఏమిటది? మా తమ్ముడ్ని పిలుస్తానుండు'' బెదిరించింది రాధ.

శేఖరం మొహం మాడిపోయింది. కళ్ళ ముందు చిన్న కర్నల్‌లా రాధ తమ్ముడు క్లోజప్‌లో భయంకరంగా కనిపించేడు.

ఒళ్ళంతా చెమటలు పట్టేయి.

రాధ ముసిముసిగా నవ్వుతోంది.

"అవునుగానీ రాధా! నీ తమ్ముడు ఏం చేసుంటాడు. అతన్ని గురించి చెప్పనేలేదే!" బెరుగ్గా అడిగేడు.

రాధ బిగ్గరగా నవ్వింది. "మూడో తరగతి చదువుతుంటాడు" అంది నిర్లిప్తంగా.

—కాంత్

రామారావు కుర్చీలో జేరగిలబడి కూర్చొని నింపాదిగా "మీరు కొన్నాళ్ళ పాటు మా ఇంట్లోనే ఉండి ఆవిడ ప్రతి కదలికనూ నిశితంగా పరిశీలించండి." అన్నాడు.

ప్రభాకర్ ఉలిక్కిపడ్డాడు. తన కంగారు కప్పిపుచ్చుకుంటూ "నేనా?" అన్నాడు.

"ఏం? అవునూ మీరే. మీరే ఇందుకు తగినవారు. ఇన్నాళ్ళ పరిచయంలో నేను మిమ్మల్ని బాగానే అర్థం చేసుకున్నానను కుంటాను. మీరు చేయవలసినదల్లా ఆమెను మౌనంగా పరిశీలించి అర్థం చేసుకోవడం. అంతే! లలితను మీరు బాగా అర్థం చేసుకోగలరని, నా సమస్యను పరిష్కరించ గలరనే నమ్ముతున్నాను"

ప్రభాకర్ తటపటాయించాడు ఏ సమాధానం చెప్పడానికి. అతడికి ఓ క్షణ కాలంపాటు తాను వింటున్నదేమిటో కూడా అర్థం కాలేదు.

అతడికి రామారావు చాలాధనవంతుడని తెలుసు. అతడి బంగళానే కొన్ని లక్షల ఖరీదు చేస్తుందని చంద్రమోహన్ ఒకసారి చెప్పాడు కూడా! రామారావు సంఘంలో చాలా పలుకుబడిగల ప్రముఖులలో ముఖ్యుడు. అతడు ఎక్కువ రోజులు వ్యాపారం పనుల మీద కలకత్తాకు వెళ్ళి వస్తూ ఉంటాడు.

"నా అభ్యర్థనను కాదనకండి" ప్రాధేయ పడుతున్నట్లుగా అన్నాడు రామారావు.

ప్రభాకర్‌కి అంతా అయోమయంగా ఉంది. సమయానికి చంద్రమోహనన్నా లేడు ఈ క్లిష్ట పరిస్థితిని తేలిక బర్చ డానికి. ప్రభాకర్ అన్ని విషయాల్లో అతడి సలహా తీసుకుంటాడు. అతడు ఇప్పుడే వస్తానని బయటకు వెళ్ళాడు. గంట దాటుతున్నా వస్తున్న జాడలేదు.

ప్రభాకర్ మౌనంగా లేచి కిటికీ దగ్గర నిలబడ్డాడు. ఊరికి దూరంగా ఇళ్ళ మధ్య నుండి, ఎత్తుగా పెరిగిన కొబ్బరి చెట్ల మధ్య నుండి నీలంగా శ్రీముఖి నది కనిపిస్తోంది.

శ్రీముఖి కృష్ణ, గోదావరీలంత పెద్ద నది కాకపోయినా దాని జలాలు స్వచ్ఛంగా మెరుస్తూ నిర్మలత్వానికి ప్రతీకగా ఉంటాయి. దాని గలగలలు అమర గానమే. ఇది కృష్ణకు ఉప పాయ. దీని ఒడ్డునే బౌద్ధ మతం ఒకప్పుడు మూడు పూవులు ఆరు కాయలుగా వెల్లి విరిసింది. శ్రీశిఖరంలో పుట్టి కొంతదూరం అంత ర్వాహినియై శ్రీపురంకు కొన్ని మైళ్ళలో భూమి మీద కన్పించి కృష్ణలో చేరడానికి పరుగులిడుతుంది. శ్రీపురం ఒకప్పుడు ఇక్ష్వాకుల రాజధాని అంటారు. ఇక్కడ చుట్టుప్రక్కల వారు బౌద్ధారామాలు నిర్మించడానికి భూరి విరాళాలిచ్చినట్లు శాసనాలు చెపుతున్నాయి. విజయనగర రాజులు ఇక్కడ కొన్ని దేవాలయాలు కట్టారు. తర్వాత ఇది మహమ్మదీయ పాలనలో చాలా మార్పులకి గురయింది. ఈ నదీ జలాలు ఊరికే పోతున్నాయని ఇటీవలే ఆనకట్ట కట్టారు. అప్పటి నుండి శ్రీపురం మళ్ళీ ప్రముఖం అయింది.

శ్రీపురం నాలుగు రోడ్ల కూడలిలో గాంధీ విగ్రహం ఉంది. దానికి కుడి వైపున ప్రభుత్వ వైద్యశాల, ఉమెన్స్ కాలేజీ, దానికి ఎదురుగా వ్యవసాయసంస్థ వారి వరి పరిశోధనా శాల, రైల్వే స్టేషన్, ఆపైన బస్ డిపో ఉన్నాయి. విగ్రహానికి వెనుక వైపు షాపింగ్ కాంప్లెక్స్ ఉంది.

కింది ఫ్లోర్‌లో కార్లు, స్కూటర్లు, సైకిళ్ళు పార్కు చేయడానికి వీలుంది. మొదటి అంతస్తులో మెడికల్ షాపులు, నర్సింగ్ హోమ్, ఆప్టికల్ షాపులు, ఎక్స్‌రే లాబొరేటరీలు ఉన్నాయి. రెండో అంతస్తు షాపింగ్ సెంటర్. మరెక్కడా దొరకని వస్తువు కూడా అక్కడ దొరుకుతుంది. ఫ్యాషన్ పారడైజ్, టాయిస్ ఎంపోరియమ్, లేడీస్ కార్నర్, ఫొటో స్టూడియో, హోటల్ బార్ అండ్ రెస్టారెంట్, బేకరీ, లైబ్రరీ అన్నీ ఆ చుట్టు పక్కలనే ఉన్నాయి. మూడో అంతస్తులోని ఒక గదిలో ఉన్నాడు ప్రభాకర్. అది అసలు చంద్రమోహన్‌ది. ఆ గది బయట 'ఎన్. చంద్రమోహన్ బి.ఎ. బి.ఎల్., అడ్వొకేట్' అని రాసి ఉన్న బోర్డు ఉంది. గది లోపల సీలింగ్ ఫాన్ తిరుగుతోంది. గది మధ్యలో టేబిలుంది. దాని చుట్టూ క్లయింట్సు కొరకు కుర్చీలు వేయబడి ఉన్నాయి. టేబిల్ మీద నీటుగా సర్దిన ఫైళ్ళు, న్యూస్ పేపరు, ఆ పక్కగా ఫోనుఉన్నాయి. "శాస్త్రిగారు రమ్మనిఫోన్ చేశారు. వెళ్ళి వస్తాను. కూర్చో" అని చెప్పి వెళ్ళాడు చంద్రమోహన్ అరగంట క్రితం. ప్రభాకర్ ఐ.ఎ.ఎస్.కి ప్రిపేరవుతున్నాడు. రోజూ చంద్రమోహన్ దగ్గరకు వచ్చి ఓ గంట కూర్చుని తర్వాత దగ్గర్లోనే ఉన్న లైబ్రరీకెళ్ళి చదువుకుంటుంటాడు.

అలాంటి సమయంలో–

"ఏమిటిచాలాదీక్షగాచదువుతున్నావ్! చంద్రమోహన్ లేరా?" అంటూ వచ్చి పలకరించాడు రామారావు.

ప్రభాకర్ చిరునవ్వు నవ్వి "లేదండీ! శాస్త్రిగారు పిలిస్తే వెళ్ళాడు. ఈ మధ్య మీరు కన్పించడం మానేశారేమిటి?" అని అడిగాడు.

రామారావు వయస్సు ముప్పయి అయిదు ఉంటుంది. చంద్రమోహన్ అతడికి లీగల్ఎడ్వైజర్. అతడికి ప్రభాకర్‌తో సన్నిహిత పరిచయం లేదు కాని కన్పించినప్పుడల్లా ఆత్మీయంగా పలుకరిస్తాడు. అతనో కంట్రాక్టర్. కాటన్ మిల్లు యజమాని.

"ఎలా ఉన్నాయి మీ స్టడీస్?" రామారావు అడిగాడు.

"చదువుతున్నాను"

"చాలా సీరియస్‌గా చదువుతున్నారట్లుంది. ఈమధ్య మీరు మోహన్‌తో క్లబ్‌కి కూడా రావడం లేదు".

"అలా అని ఏమీ లేదండి. సాయంకాలం పూట మా అన్నయ్యగారబ్బాయికి ట్యూషన్ చెపుతున్నాను. వాడికి చదువు మీద శ్రద్ధ బొత్తిగా లేకుండాపోయింది".

"మీ అన్నయ్యగారా? మీరు ఒంటరిగానే ఉంటున్నారనుకుంటున్నాను..."

"అన్నయ్యంటే కజిన్..."

"ఆయన ఎక్కడ ఉంటున్నారు?"

"కృష్ణనగర్‌లో"

"చాలా దూరం కదూ! రోజూ అంత దూరం వెళ్ళి వస్తున్నారా?"

"స్కూటర్ ఉంది కదా. షైర్‌కి వెళ్ళినట్లుంటుంది."

"తీరిక సమయాలలో ఏమి చేస్తుంటారు?"

"తీరిక సమయాలా ?" నవ్వాడు ప్రభాకర్. "మామూలుగా వీలు దొరికినప్పుడల్లా ఏవో పుస్తకాలు చదువుతూ ఉంటాను. కాని ప్రస్తుతానికి తీరిక సమయాలనేవే కరువైపోయాయండి ఈ చదువుతో."


"నేనేం మామూలు
మామిడికాయను కాను ...
'ప్రియ' రుచుల
పెన్నిధిని !"
priya
"ప్రియ దృష్టిలో పడాలంటే ఏ మామిడీకాయ
అయినా నిగనిగలాడుతూ నాలా కండ కలిగి ఉండాలి.
అప్పుడే మేలయిన మసాలాలు, స్వచ్ఛమయిన
నూనెల పొందు లభిస్తుంది. చక్కని ఆరోగ్య
సూత్రాంతో. ఆధునాతన ఫాక్టరీలో రుచులెన్నో
నింపుకొని మీ విందుకు వస్తాను. అందమయిన
సీసాల్లో కళకళ లాడ్తూ మిమ్మల్ని ఆకర్షిస్తాను.
అదుగో.... అప్పుడే మీ నోరూరుతోంది.
మరింక మాటలెందుకు ?"
వెల్లుల్లితోనూ; వెల్లుల్లి లేకుండానూ "ప్రియ" పచ్చళ్లు
300, 850 గ్రాముల సీసాల్లో లభిస్తాయి
మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో
• అల్లం • గోంగూర
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad. 500 004
ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

"మా లలితకు అంతా తీరికే. పట్టి పుస్తకాల పురుగు. మా మామగారింట్లో పెద్ద లైబ్రరీ ఉండేదండి. ఆయనపోయిన తర్వాత ఆ లైబ్రరీలో కొన్ని ముఖ్యమైన పుస్తకాలను తను ఉంచుకొని మిగిలిన వాటిని కాలేజీ లైబ్రరీకి ఇచ్చేసింది."

"ఎక్కడదండి?"

"కలకత్తాలో మా మామగారు డాక్టరు. వాళ్ళుబెంగాలీలు. వారికి చాలా కాలంవరకు పిల్లలులేరు. చివరిరోజుల్లో వారి నిరాశల్ని చెరిపేస్తూ ఉద్భవించింది మా లలిత. అందుకని చాలా అపురూపంగా పెరిగింది. లలితకు ఆరేళ్ళ వయస్సులో మా అత్తగారూ, లలిత కారులో వెళుతుంటే యాక్సిడెంటయి, విండో గ్లాసు పగిలి తలలో గుచ్చుకొని మా అత్తగారు మరణించారు. తల్లిలేని పిల్లని లలితను చాలా గారాబంగా పెంచారు మామగారు. లలిత పెళ్ళయి ఇటువచ్చేటంతవరకూ కలకత్తాను వదలి ఎక్కడకూ కదిలింది కాదు..."



"మీరు కలకత్తా ఎలా వెళ్ళారు?" ప్రభాకర్ అతడు చెప్పే విషయంలో ఆసక్తి చూపాడు.

"నా చదువు ఆంధ్రాలోనే అయింది. ఒక కంట్రాక్టర్ దగ్గర అకౌంటెంట్‌గా చేస్తున్నపుడు అతని పనిమీద కలకత్తాలో చాలా కాలం ఉండాల్సి వచ్చింది. లలిత అప్పుడే పరిచయమయింది. మా ఇల్లుగల వారి అమ్మాయి లలిత స్నేహితురాలు. అక్కడుండగానే ఆ ఉద్యోగాన్ని మానేసి వేరొకదానిలో చేరాను. లలితది చాలా జాలి మనస్సు. ఎవరన్నా బాధపడుతుంటే చూడలేదు. వీలయితే వారి బాధ సంతా తానే భరిస్తానంటుంది.

"మా పెళ్లి మా మామగారికి ఇష్టం లేదు. ఎక్కడి ఆంధ్రా, ఎక్కడి బెంగాల్! లలిత ఐదేళ్ళు వాళ్ళ నాన్నతో హోరాహోరీగా పోరాడి మా పెళ్ళికి ఒప్పించింది. ఆయన హాఫ్ హార్టెడ్‌గానే ఒప్పుకున్నారు. కాని చనిపోయేటంత వరకు ఆయన తన మనస్సు మార్చుకోలేకపోయారు'' రామారావు చాలా విచారంగా చెప్పాడు.

ప్రభాకర్ ఎమ్. ఎ. పొలిటికల్ సైన్స్‌తో చేశాడు. అతడు సంపాదించాల్సిన అవసరం లేకుండా అతడి తండ్రి చాలా సంపాదించి ఉంచాడు. ఇంకా సంపాదిస్తూనే ఉన్నాడు హైదరాబాద్‌లో.

ప్రభాకర్ ఎమ్. ఎ. అయిన తర్వాత తన కజిన్‌ను చూడటానికి ఇక్కడికి వచ్చాడు. శ్రీపురం అతడిని ఎంతగానో ఆకర్షించింది. కొన్నాళ్ళపాటు శ్రీపురంలోనే గడపదలచుకుని ఉండిపోయాడు.

కజిన్‌ద్వారా అయినపరిచయం చంద్ర మోహన్, ప్రభాకర్ల మధ్య పెరిగి, వృద్ధి పొంది ఆత్మీయతను పెంచింది. చూపరి అయిన ప్రభాకర్‌కి డబ్బు ఇచ్చిన మెరుగు మరింత ఆకర్షణ ఇచ్చింది. కొన్నాళ్ళిలా సరదాగా గడిపిన తర్వాత ప్రభాకర్‌కి ఐ.ఎ.ఎస్.కి కూర్చోవాలనే బుద్ధి పుట్టింది. ఇప్పుడు దానికే చదువుతున్నాడు.

"మిమ్మల్ని ఏమయినా డిస్టర్బ్ చేస్తున్నానా?" అడిగాడు రామారావు.

"లేదు. లేదు. చెప్పండి" చిర్నవ్వుతో అన్నాడు ప్రభాకర్.

"మా మామగారు మరణించినప్పటి నుండి లలితలో మార్పు వచ్చింది. మొదట్లో అది తండ్రి మీద దిగులనుకున్నాను. రానురాను ఆ మార్పు ఆమెలో శాశ్వతమవుతుందేమోనని భయంవేసే స్థితికి చేరింది"

"ఏమిటంటారు ఆ మార్పు?"

"ఆహారం తీసుకోదు. నానాటికి కృంగిపోతోంది. మతిమరుపు జాస్తి అయింది. అర్ధరాత్రుళ్ళు హఠాత్తుగా లేచి 'మమ్మీ' అంటూ నిద్రలో నడుస్తూ వెళ్ళిపోతుంది తలుపులు తీసుకొని. ఒక్కోసారి పగటి పూటే శ్రీముఖి తీరానికి అలా వెళ్ళిపోతుంది. ఆమె మామూలుగా ఉన్నపుడు 'ఎందుకలా వెళ్ళావు' అంటే 'నాకేమీతెలియదు' అని ఏడుస్తుంది. ప్రతి బుధవారం మధ్యాహ్నం పన్నెండు గంటలకు కారేసుకొని శ్రీముఖి తీరాని కెళుతుంది. అందుకని నేను బుధవారం మటుకు ఆమెను వదిలి ఎక్కడకూ వెళ్ళను. సాధ్యమైనంతవరకు ఎక్కువ సమయం ఆమెతో గడపడానికే ప్రయత్నిస్తాను. ఆమెను వదిలి బయటకు వెళ్ళాలంటే మనస్సు గిజగిజలాడిపోతుంది. వెళ్ళినా అరగంటకోసారి ఇంటికి ఫోన్ చేస్తాను. ఒకవేళ ఫోన్‌కి రెస్పాన్స్

లేకపోతే వెంటనే ఇంటికి వస్తాను. ఇంత అప్రమత్తతతో ఉన్నా ఎప్పుడో ఒకసారి నన్ను ఏమార్చి శ్రీముఖి తీరానికి వెళ్ళిపోతుంది......ఏమిటోనండి! కొన్ని జీవితాలు ఇలా ఉంటాయి. అన్నీ ఉండీ అల్లుడి నోట్లో శని అన్నట్లు అన్నీ అదృష్టాలు ఉన్న మమ్మల్ని ఈ విపత్తు మరీ కృంగదీస్తోంది."

"ఎన్నాళ్ళనుండి జరుగుతోందండీ ఇలా?"

"సుమారు ఆర్నెల్లు అవుతుంది. కలకత్తాలో మా మామగారి జూట్‌మిల్స్ ఉన్నాయి. నెలకోసారన్నా అటు వెళ్ళి అకౌంట్స్ అవీ చూసిరావాలి. ఇక్కడ ఈ బిజినెస్ ఉంది. లలిత ఆరోగ్య పరిస్థితేమో ఇలా ఉంది. ఏం చేయాలో అర్థం కాకుండా ఉంది"

"డాక్టర్లెవ్వరికీ చూపించలేదా ?"

"అన్నీ అయిపోయాయండి. బాబాల దగ్గర నుండి భూతవైద్యుల వరకు అందరినీ చూశాము. డబ్బు కుప్పతెప్పలుగా ఖర్చయిందేగాని లలిత ఆరోగ్యంలో మార్పు శూన్యం.''

"డాక్టర్ రిపోర్టు ఏమని ఉంది?"

''కొంచెం నెర్వస్ వీక్‌నెస్ ఉంది. అంతే! బికాంప్లెక్స్‌తో సరిపోతుందన్నారు.''

"ఇలా నిద్రలో నడిచిపోవడాన్ని సోమ్నాంబులిజమ్ అంటారు. అది హిస్టీరియాలో ఒకరకం" అన్నాడు ప్రభాకర్ అతడు చెప్పినదానిని గూర్చి జాగ్రత్తగా ఆలోచించి.

''ఆ మాట నేనూ విన్నాను. నేను డాక్టర్లకు లలిత పరిస్థితిని గూర్చి వివరించినపుడు వాళ్ళు కూడా ఇదేమాట అన్నారు. కాని అన్ని పరీక్షలయిన తర్వాత అటువంటిదేమీ లేదన్నారు. ఆమె నడిచేది నిద్రపోతూకాదు మెలుకువతోనే అని వారు అభిప్రాయ పడ్డారు. సోమ్నాంబులిజం అంటే నిద్రలో నడవడం అని తెలుసు. మీకు ఈ విషయం గూర్చి వివరంగా తెలుసుననుకుంటాను. నాకు కొంచెం తెలియజెప్పండి. లలితను ఇంకొంచెం బాగా అర్థం చేసుకోవడానికి నాకు వీలుపడుతుంది" రామారావు అభ్యర్థించాడు.

పుస్తకాల్లో, పేపర్లలో అలాంటి విషయాలను చదివి తెలుసుకోవడం తప్ప ప్రభాకర్‌కి మానసిక శాస్త్రం గూర్చి అంతగా తెలియదు. ఆవిషయమే చెప్పాడు "నాకు తెలిసింది తక్కువ. అయినా చెపుతాను. హిస్టీరియా ఉన్న కొందరిలో ఇది ఉంటుందట. ఈ వ్యక్తులలో ద్వంద ప్రకృతి ఉంటుంది. అంటే వారు మామూలుగా ఉన్నపుడు ప్రవర్తించే తీరు వారు నిద్రలో లేచి ప్రవర్తించే తీరుకు భిన్నంగా ఉంటుంది. వారికి తామలా నిద్రలో లేచి నడుస్తున్నామని తెలియదు. మామూలుగా ఊహించలేని పనులు కూడా వారాస్థితిలో నిర్వహిస్తారు. ఒక తొమ్మిదేళ్ళమ్మాయి ఈ జబ్బుతో బాధపడుతున్న రోజుల్లో పెద్ద పాత్రల నిండా నీళ్ళు నింపుకొని ఇంట్లో నుండి బయటకు మోసేది తన నిద్రలో. మరో పిల్లవాడు అలా నిద్రలోనే లేచి అద్భుతమైన కవిత్వం వ్రాసేవాడు. వారిలా నిద్రమధ్యలో లేచి ఈ పనులన్నీ చేసి మరలా నిద్రపోతారు. తెల్లవారిన తర్వాత ఈ విషయాలు వారికేమీ గుర్తుండవట. ఈ సోమ్నాంబులిస్టులు తమ సహజ వ్యక్తిత్వంలో అసహజ భావాలుంచటం వల్లనే



ఇలా ప్రవర్తిస్తారట."

రామారావు ఆలోచిస్తూ తల పంకించాడు.

"లలితగారూ ఇలాగే విచిత్రంగా ఏమయినా ప్రవర్తిస్తున్నారా?"

"అలా నిద్రలో లేచి 'మమ్మీ! వస్తున్నా; మమ్మీ! వెళ్ళిపోకు...' అని ఏమేమో మాట్లాడుతూ తలుపులు తీసుకుని



వెళ్ళిపోతుంది. మొదటిసారి ఏం చేయాలో తెలియక ఆమె వెంటే వెళ్ళాను. తర్వాత నుండి తలుపు లన్నిటికి తాళాలు వేసి తాళం చేతులు ఆమెకు తెలియకుండా దాచిపెడుతున్నాను..." కొంచెం సేపు ఆగి అన్నాడు "ప్రభాకర్‌గారూ! మీరు నాకో సహాయం చేసిపెడతారా?"

ఆయనకు తను చేయగల సహాయ మేమిటో ప్రభాకర్‌కి అర్థంకాలేదు.

"లలితకిక్కడ స్నేహితులెవ్వరూ లేరు! ఆమె రిజర్వ్‌డ్ టైప్. ఎప్పుడయినా నాతో పార్టీలకు వచ్చినా గంభీరంగా ఉండిపోతుందిగాని అందరితో కలిసి పోదు. అంటే మాట్లాడటం చేతకాదని కాదు. లలిత చాలా చక్కగా మాట్లాడు తుంది. ఆమెలో ఆ వాక్చాతుర్యమే ఓ ప్రత్యేకమైన ఆకర్షణ. మరి లలిత ఈనాటి పరిస్థితికి తప్పకుండా ఏదో కారణముండి తీరుతుందని నా అనుమానం. అతి పరిచయం వలన, చనువు వలన నిజం మరుగున పడుతుందంటారు. నా విష యంలో కూడా అంతే జరుగుతోందేమో! ఎంత తల బద్దలు కొట్టుకున్నా లలితలో



ఈ మార్పు ఎందుకు వచ్చిందో అర్థం కావడంలేదు. బహుశా తండ్రి మరణం దీనికి ప్రోదిచేసి ఉంటుంది. ఒక్కోసారి దగ్గరివాళ్ళకు కన్పించని నిజాలు దూరంగా ఉండేవాళ్ళకు అర్థమవుతాయి. నేను ఇవన్నీ ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. మీరు కొన్నాళ్ళపాటు మా లలితను అబ్జర్వ్ చేయాలి..."

''అబ్జర్వ్ చేయడమా? నాకిటువంటి విషయాలను గూర్చి ఏమీ తెలియదండీ''

"ఇదేమంత కష్టమైన పనికాదు. మీరు స్నేహితుడిగా లలితకు పరిచయమవండి. తర్వాత మీరు లలిత ప్రవర్తనను మౌనంగా పరిశీలించండి. ఆ అనారోగ్యానికి కారణాలు మీరు తప్పకుండా తెలుసుకోగలరని నా నమ్మకం.''

''ఎవరన్నా సైకాలజిస్టులకు ఈ పని అప్పగించండి. వారు చక్కగా సైకో ఎనలైజ్ చేసి ఈ కార్యాన్ని సక్రమంగా నిర్వహించగలరు."

రామారావు నవ్వాడు. ''మీ మీద నాకు నమ్మకం ఉంది. మీ విచక్షణలో నాకు విశ్వాసముంది. ఈ స్థితిలో అస్వస్థులకు నిజంగా కావల్సినది స్నేహితులు. ఆమెకు మీరు ఓ మంచి స్నేహితుడుగా మారి..."

"భర్తకు మించిన మంచి స్నేహితుడెవ్వరండీ భార్యకు?"

"అది నిజమే! లలితకు ఈ లోకంలో సర్వస్వం నేనే. కాని భర్త వేరు ఫ్రెండ్ వేరు. లలితకు ఉన్న పుస్తకాల అభిలాష గాని, లలితకళలలో ఆసక్తిగాని నాకులేదు. ఆమెకేదన్నా జ్వరం వస్తే రేయింబవళ్ళు మేలుకొని ఉపచారాలు చేయగలను కాని ఆమె 'ఫలానా కథలో ఫలానా పాత్ర ఎలా పోషించబడింది?' అని అడిగితే చెప్పలేను. నాకూ సాహిత్యానికీ చాలా దూరం. మీకు దానితో పరిచయముంది కదా! లలిత మనసును కొంచెం ఆ విషయాలమీదకు మరల్చాలని నా కోరిక. అప్పుడేమయినా తండ్రి మరణాన్ని మర్చిపోగలదు. ఏమంటారు?"

"నాకు సాహిత్యంతో మీరనుకుంటున్నంత పరిచయం లేదు. ఏదో చదువుతాను. అంతే!''

''అంతే చాలండి. మీరు పెద్దగా శ్రమపడాల్సిన పనిలేదు. మీకు తెలుసో లేదో లలితతో పరిచయమైనవారికి మాట్లాడాల్సిన అవసరం ఉండదు. వినడమే వారి పని" నవ్వాడు రామారావు. "ఇటు లలితతో, అటు బిజినెస్ పనుల వొత్తిడితో నాకు ఊపిరి సలపకుండా ఉంది. కొన్నాళ్ళపాటు మీరు మా లలిత మనస్సుని మరో విషయం వైపుకు కేంద్రీకరించగలిగితే నన్ను ఆదుకున్నవారవుతారు''

"నాకు... నాకు అంతగా అనుభవం లేదండీ ఇటువంటి విషయాల్లో...!"

"అనుభవించేదాకా ఎవరికీ అనుభవం రాదండీ! లలితను ఎవరికి పరిచయం చేయాలా అని నాలుగైదు నెలలుగా ఆలోచిస్తున్నాను. మీ మనస్తత్వం లలితకు సరిపోగలదనీ, మీరు లలితకు సరైన కంపెనీ ఇవ్వగలరనీ నాకు తోచింది. లలితకీ స్థితిలో మందులకన్నా స్నేహం ఎక్కువ అవసరం. అన్యథా భావించక మీ సహకారాన్నందించండి. మా ఇంటికి ఓసారి రండి. ఎప్పుడు వస్తారు?. రేపు మంగళవారం కదూ? రేపు సాయంకాలమోసారి రాగలరా? ఇదిగో నా విజిటింగ్ కార్డు. మా ఇల్లు కమ్యూనిటీ హాలు ఎదురుగా ఉంటుంది. ఎల్లుండి బుధవారం. లలిత మైకంలో శ్రీముఖి తీరానికెళ్ళే రోజు.

మిమ్మల్ని గనుక ముందుగానే లలితకు పరిచయం చేస్తే మీరు బుధవారం నాడు లలితను గమనించవచ్చు. ఏమంటారు? రేపొకసారి వస్తారు కదూ?" అడిగాడు రామారావు.

"చూస్తానులెండి"

"చూడటం కాదు తప్పక రావాలి" అని టైం చూసుకొని "మరి వస్తానండి" అని లేచి వెళ్ళిపోయాడు. ప్రభాకర్ అతడు వెళ్ళిన దిక్కుకే చూస్తూ వుండి పోయాడు.

స్నేహం అనేది చెప్పి కలిసేది కాదు. అది అకస్మాత్తుగా కలుస్తుంది. పరిచయాలన్నీ స్నేహాలుగా మారవు. అయితే స్నేహానికి మూలం పరిచయమే. ప్రభాకర్‌కి రామారావు తననడిగిన సహాయం చాలా ఆశ్చర్యంగా ఉంది.

అదే మాట చంద్రమోహన్‌తో అన్నాడు రాగానే.

"నాకు తెలిసినంతవరకు రామారావు మంచివాడు. కాని భర్త అనే పదార్థం ఉంది చూశావూ అది ఈర్ష్యతో తయారు చేయబడింది. ఏ భర్త తనంతట తాను తన భార్యకు కంపెనీ ఇమ్మని విశాల హృదయంతో మరే మగపురుగునూ కోరడు. కాని రామారావు మంచితనం, అతడి పరిస్థితీ ఆలోచిస్తే అతడు నిష్కల్మషంగానే నిన్ను సహాయాన్ని అర్థించి ఉంటాడనిపిస్తోంది. అయినా భార్యాభర్తల విషయాల మధ్య తల దూర్చడమంత వెర్రి పని మరోటి లేదు" అన్నాడు.

ప్రభాకర్ ఆలోచనలో పడ్డాడు. "అయితే రేపు వెళ్ళడం మానేయమంటావా?"

చంద్రమోహన్ అతడి వైపు ఆశ్చర్యంగా చూశాడు. "నీవు వెళ్ళాలనే నిర్ణయించుకున్నావన్న మాట. అయితే వెళ్ళిరా. రామారావు పెద్దమనిషి. స్నేహితులను చాలా మర్యాదనిస్తాడు. అతడు ఒక నిర్ణయానికి రావడానికి ముందు ఎంతో ఆలోచిస్తాడు. ఈ విషయం గూర్చి కూడా చాలా ఆలోచించే నీ సహాయాన్ని కోరి ఉంటాడు. సరే, ఒకసారి వెళ్ళిరా. మిగతా విషయాలు అక్కడి పరిస్థితులను బట్టి ఆలోచించుకుందువుగాని. లలితగారు కూడా చాలా మంచి మర్యాద ఉన్న ఇల్లాలు."

"అంతేలే" అన్నాడు ప్రభాకర్ లైబ్రరీ కెళ్ళడానికి లేస్తూ.



## 2

మంగళవారం సాయంకాలం రామారావు ఇల్లు కనుక్కోవడం పెద్ద కష్టమేమి కాలేదు. కమ్యూనిటీ హాల్ ఎదురుగా అధునాతనంగా ఉన్న ఆ ఇల్లు అతడి ఐశ్వర్యాన్ని చాటుతోంది. ఆ ఇంటిని కట్టిన తీరు చూస్తూంటే యజమానుల కళాదృష్టి తెలుస్తోంది. కాని అంత కళాత్మక సృష్టిలోనూ ఏదో కొంచెం మెకానికల్ టచ్ కనిపించింది ప్రభాకర్‌కి. రామారావు ప్రభాకర్‌ని సాదరంగా ఆహ్వానించాడు.

"ఇల్లు కనుక్కోవడం పెద్ద కష్టమేమీ కాలేదు కదా" అన్నాడు ప్రభాకర్‌ని



డ్రాయింగు రూంలోకి తీసుకవెళ్తూ.

"లేదండీ! చాలా సులభంగా దొరికింది అడ్రెస్" అన్నాడు ప్రభాకర్ రామారావుకి గోడలకు అలంకరించి ఉన్న పెయింటింగ్స్ చూపిస్తూ-

"ఈ పెయింటింగ్స్ చూశారూ మా లలిత వేసినవే. ఆ రూం లైబ్రరీ రూం. అదంతా లలిత కలక్షనే. కలకత్తాలో ఆమె కాలేజీ లైబ్రరీకి పోయినవి పోగా తనకు చాలా ముఖ్యమని తెచ్చుకున్న



పుస్తకాలు ఈ లైబ్రరీలో సగం పైగా ఉన్నాయి. ఇల్లు కట్టేటప్పుడు ప్లాను ప్రకారం ఇది గెస్ట్‌రూం. కాని లలిత పుస్తకాలు దీని నాక్రమించి లైబ్రరీగా మార్చేశాయి" అన్నాడు. ప్రభాకర్‌ని లైబ్రరీ రూంకి తీసుకవెళ్ళి చూపించాడు. అన్నీ ఇంగ్లీషు, బెంగాలీ పుస్తకాలే. తెలుగు చాలా తక్కువ. ఆ లైబ్రరీ లలిత ఉత్తమ సాహిత్యాభిలాషను చెపుతోంది. ప్రభాకర్ కొన్ని పుస్తకాలు తిరగేశాడు. అతడినా లైబ్రరీ చాలా ఆకర్షించింది. అందులోని పుసకాలు దాదాపుగా అతడి అభిరుచికి సరిపడేవే.

"రండి ఇల్లు చూద్దురుగాని" అని రామారావు లోపలికి దారితీశాడు.

"ఇది వరండా, డ్రాయింగ్ రూం, ఇటువైపున్నది గెస్టురూం. దాని పక్కనే మరో గెస్టురూం. అది స్టోర్ రూం. ఇది డైనింగ్‌హాల్. ఇది ఒక బెడ్ రూం. అది రెండో రూం. దానిలో లలిత పెయిం

టింగ్స్ వగైరా ఉన్నాయి. ఇదీ నా ఆఫీస్ రూం. ఇంతకూ కిచెన్ చూపలేదు కదూ. లలిత కూడా కిచెన్‌లోనే ఉంది... ఇదిగో ఇదే మా కిచన్. ఈమె నా భార్య లలిత" అంటూ పరిచయం ప్రారంభించాడు.

"ఈయన ప్రభాకర్. నాకు చాలా సన్నిహితులు. నీకులాగే పుస్తకాలంటే ప్రాణం"అని లలితకు ప్రభాకర్‌ని పరిచయం చేశాడు రామారావు.

వంటమనిషితో ఏదో చెపుతున్న లలిత ప్రభాకర్ వెపు చూసింది. ప్రభాకర్ చేతులు జోడించి "నమస్కారమండి" అన్నాడు. లలిత మౌనంగా చేతులు జోడించి తన పని చూసుకోసాగింది.

ప్రభాకర్, రామారావు డ్రాయింగు రూంలోకి వచ్చి కూర్చున్నారు. ప్రభాకర్‌కి ఈ కోల్డురిసెప్షన్ తల కొట్టేసినట్లయింది. 'బహుశ తాను రావడం ఆమెకిష్టం లేదేమో...' అనుకున్నాడు. ఇంతలో లలిత కాఫీ ట్రే పట్టుకొని వచ్చింది.

ప్రభాకర్‌కి లలితను చూడగానే నిరాశ కలిగింది. అంత కళాత్మకంగా ఇంటిని తీర్చిదిద్దిన స్త్రీ చాలా అందంగా ఉండి ఉంటుందని ఊహించాడు. కాని లలిత అతడి ఊహకు భిన్నంగా చాలా సామాన్యంగా ఉంది. ప్రభాకర్‌కి ఈ పరిచయం ఉత్సాహాన్నివ్వలేదు. అంతటి సాధారణమైన స్త్రీని రామారావు లాంటి సౌందర్యాభిరుచి ఉన్న వ్యక్తి ఎలా ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడో అర్థం కాలేదు. 'అతడి కళ్ళు పెట్టుకుని చూస్తేగాని నాకు ఆమెలో అందం కన్పించదు గాబోలు' అనుకున్నాడు.

సంభాషణ నెమ్మదిగా పుస్తకాల మీదకు పొర్లింది.

"నాకు అకౌంట్ బుక్స్ తప్ప మిగతా వేటి గూర్చి తెలియదు" అని పేపరు చదువుకోసాగాడు రామారావు.

రామారావు అన్నట్లు లలిత పుస్తకాల పురుగే! ఆమె మాటల్లోని గంభీరత, ఆకర్షణ ప్రభాకర్‌ని నెమ్మదిగా ఆమె వైపు ఆకర్షించ సాగాయి. కొంచెం సేపటి క్రింద ఆమెను గూర్చి అనుకున్న వ్యతిరేకతను ప్రభాకర్ తనకు తెలియకుండానే మర్చిపోసాగాడు.

లలిత ప్రభాకర్‌ని తన లైబ్రరీకి తీసుకువెళ్ళింది.

"మీకు కావాలంటే ఏవయినా బుక్స్ తీసుకెళ్ళండి. కాని వాటిని తిరిగి ఇవ్వడం మర్చిపోకండి" నవ్వుతూ అన్నది.

లలిత అంత నిర్మొహమాటంగా మాట్లాడినందుకు ప్రభాకర్ నొచ్చుకున్నాడు. అయినా తన భావాలు వెలిబుచ్చకుండా, ముఖాన నవ్వు నద్దుకొన్నాడు.

ఎనిమిది గంటలు కావొస్తుండగా ప్రభాకర్ వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"భోంచేసి వెళ్ళండి" అని భార్యాభర్తలిద్దరూ బలవంతం చేసినా "మరోసారి లెండి" అని బయలుదేరాడు.

"పదండి. వీధి చివరి వరకు వస్తాను" అని రామారావు ప్రభాకర్‌తో బయలుదేరాడు.

దారిలో ప్రభాకర్‌తో అన్నాడు."మా లలితను చూశావుగా. స్నేహమయి... కాని బుధవారం వస్తుందంటేనే నాకు భయం. రేపు మధ్యాహ్నం ఓసారి వస్తావా? వచ్చి ఇక్కడే లలిత కొరకు వెయిట్ చేయండి. ఆవేళల్లో లలితను ఎంత ఆపినా ఆగదు. కారు ఆమే డ్రైవ్

చేసుకుంటూ పోతుంది. ఆ స్థితిలో కూడా ఆమె చాలా జాగ్రత్తగా డ్రైవ్ చేస్తుంది, ఆమెను ఆపలేక ఆమెతో పాటు నేనూ వెళుతుంటాను. రేపు మీరు గమనించండి. ఆమె ప్రవర్తన ద్వారా మీకు కొంత అర్థమవుతుంది సమస్య స్వరూపం."

ప్రభాకర్ 'సరే'నని చెప్పి వెళ్ళిపోయాడు. అతనికి లలిత చాలా ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆమె కొంచెం బలహీనంగా ఉన్నమాట నిజమే. కాని హిస్టీరియా గాని, సోమ్నాంబులిజం గాని ఉన్నదంటే నమ్మబుద్ధెయ్యడంలేదు. 'పుస్తకాలు చదివీ చదివీ మతి చలించి ఉంటుంది' అనుకున్నాడు గానీ తన ఆలోచనకు తనకే నవ్వు వచ్చింది.




బుధవారం ఉదయం పదకొండూ ముప్పావుకి స్కూటర్‌ని వీధి మలుపు వద్ద ఆపి రామారావు ఇంటివైపు చూడసాగాడు. రామారావు బాల్కనీలో నించొని ప్రభాకర్‌ని గమనించి చేయి ఊపాడు.

సరిగ్గా పన్నెండు గంటలకు గ్రీన్ ఫియట్ కారు గేటు తెరచుకొని రోడ్డు మీదకు వచ్చింది. రామారావు హెచ్చరికగా మరలా చేయి ఊపాడు. ప్రభాకర్ ఆ సిగ్నల్ నందుకొని తన స్కూటర్‌తో కారుని ఫాలో అవసాగాడు.

భార్యమీద భర్త నిఘా ఏమిటి? రామారావుకి లలిత శీలం మీద ఏమన్నా అనుమానం ఉందా? సామాన్యంగా పెద్ద వాళ్ళ రహస్యాలిలానే ఉంటాయట. లలిత ఒకవేళ నటిస్తోందా? అయితే ఏ ప్రయోజనాన్నాశించి? రామారావు తన సహాయాన్నే ఎందుకు కోరాడు? అతనికి లలిత మీద అనుమానమా? అది నేరుగా చెప్పలేక ఈమిష మీద ఇలా పంపిస్తున్నాడా? రామారావు ఆమెకు ఏం తక్కువ చేశాడని ఆమె ఇలా ప్రవర్తిస్తోంది?

కారు శ్రీముఖి తీరంలో ఆగింది. లలిత కారు దిగి నదివైపు నడవసాగింది. ప్రభాకర్ స్కూటర్ ఆపి ఆమెను వెంబడించాడు. లలిత నదిలోకి వెళుతోంది. ప్రభాకర్ ఓ క్షణం ఆగి ఆలోచించి ఆమె వెనుకనే వెళ్ళసాగాడు. నీళ్లు మోకాలు లోతు దాటి పైపైకి వస్తున్నాయి. కాని లలిత ఇదేమీ గమనించినట్లు లేదు. నీళ్ళు నడుం లోతుకు వచ్చాయి. ప్రభాకర్ బాగా తడిసిపోయాడు. అతడికి లలిత ప్రవర్తన ఆశ్చర్యం కలిగిస్తోంది. నాలుగైదు సార్లు 'లలితగారూ!' అని పిలిచాడు. సమాధానం లేదు. ప్రభాకర్ ఒక్క ఉదుటున వెళ్ళి ఆమె భుజాలు పట్టుకొని ఆపాడు. అలా చూస్తూ ఊర్కుంటే ఆమె నదీగర్భాన కలిసిపోయే ప్రమాదముంది. ఆమెను రక్షించే బాధ్యత రామారావు తన మీద పెట్టినపుడు తను ప్రేక్షకుడుగా ఎలా ఉండిపోగలడు ?

లలిత వెనక్కు తిరిగి చూసింది. ఆమెకళ్ళల్లో ఏవో నీడలు అస్పష్టంగా కదలాడుతున్నాయి. ముఖం ఏ భావమూ వెలిబుచ్చడం లేదు. రెండు క్షణాలలా ప్రభాకర్‌ని చూసి బరువుగా తల వాల్చే



సింది. ప్రభాకర్ కంగారుపడ్డాడు. ఆమె పడిపోతోంది. ఆమెనలానే పట్టుకొని ఒడ్డుకు తీసుక వచ్చాడు. స్పృహ తప్పి తన భుజం మీద వాలిపోయిన లలితను కారు వెనుక సీట్లో పడుకోబెట్టి చుట్టూ చూశాడు ఎవరన్నా సహాయానికి కన్పిస్తారేమోనని. ఆ ఎండవేళ కను చూపు మేరలో ఎవ్వరూ కనిపించలేదు. ప్రభాకర్ నిట్టూర్చి కారు ముందు సీట్లోకి



చూశాడు. బాస్కెట్‌లో ఫ్లాస్కు, వాటర్ బాటిల్ ఉన్నాయి. రామారావు ముందు జాగ్రత్త కతడినభినందించకుండా ఉండ లేకపోయాడు ప్రభాకర్. వాటర్ బాటిల్ లోని నీళ్ళు కొంచెం లలిత ముఖం మీద చిలకరించాడు. లలిత చాలా సేపటికి తేరుకుంది.

"కాఫీ ఇవ్వనా ?" అడిగాడు.

లలిత "ఊఁ" అంది.

కాఫీ ఇచ్చాడు. కాఫీ త్రాగి మౌనంగా నదివైపు చూస్తూ ఉండిపోయింది.

"లలితగారూ !"

"ఊఁ?" లలిత అతని వైపు తిరిగింది.

"ఇప్పుడెలా ఉంది?"

"ఊఁ ఊఁ."

"నన్ను గుర్తుపట్టారా?"

లలిత కళ్ళు విప్పార్చి అప్పుడే కొత్తగా అతని ఉనికిని గమనించినట్లు చూసింది. "మీరు ... మీరు ప్రభాకర్ కదూ?" అని అడిగింది. హఠాత్తుగా

చుట్టూ చూసి "నేనిక్కడికి ఎలా వచ్చాను?" అని అయోమయంగా అడిగింది.

ఆమె ఇహలోకంలోకి వస్తోందని గ్రహించాడు.

"మీరు నదిలోకి ఎందుకు వెళ్ళారు?" అడిగాడు.

"నదిలోకా? ఏ నదిలోకి?" కళ్ళు చిట్లించి అడిగింది.

"ఈ నదిలోకే. మీరు అలా వెళ్ళిపోతుంటే మునిగిపోతారేమోనని భయమేసి మిమ్మల్ని తట్టి పిలిచాను. అంతే పడిపోయారు. ఇప్పుడే తేరుకున్నారు."

"టైమెంత?" కొంచెం సేపు ఆగి అడిగింది.

"రెండు గంటలు."

ఆమె ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది.

"ఈ కారు ఎవరు తెచ్చారు?" కారుని చూస్తూ అడిగింది.

"మీరే"

"నేను డ్రైవ్ చేశానా? నో"

ఆ ముఖంలో నటన కాని, కపటం కాని ఏకోశానా కన్పించడం లేదు ప్రభాకర్‌కి "అవును మీరే! సరిగ్గా పన్నెండు గంటలకు కదా మీరు ఇంటివద్ద బయలుదేరారు".

లలిత అతడివైపు సాలోచనగా చూసి "ఏదో లీలగా గుర్తుకు వస్తోంది. నిన్న రాత్రి మమ్మీ తనసీరోజు శ్రీముఖిలో కలుసుకోమన్నట్లు గుర్తు."

ప్రభాకర్ అదిరిపడి చూశాడు. లలితలో సూయిసైడల్ ఇన్‌స్టింక్ట్ ఉందన్నమాట.

"పదకొండు గంటలకు బాగా తలనొప్పి వచ్చింది. టాబ్లెట్ వేసుకొని పడుకున్నాను. తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు" అంది.

"ఇంటికి వెళదామా?" అడిగాడు.

"కొంచెం సేపు కూర్చుందాము" అంది.

"మీకుఎటువంటి రచనలంటే ఇష్టం?" అడిగింది.

"సీరియస్ టాపిక్స్‌ని త్వరగా ఇష్టపడను. కాలక్షేపం కోసం ఏవో చదువుతాను. మీరో?" తిరిగి ప్రశ్నించాడు.

"ఇంగ్లీషులో మామ్, బెంగాలీలో శరత్, రవీంద్రనాథ ఠాగోరులను ఇష్టపడతాను. ఇప్పుడు చాలామంది రచనలు కొత్తరకంగా వెలువడుతున్నాయి గాని నాకు ఆ పాతరచన మీద ఉన్న ఇష్టంతో ఇవి సరితూగలేవు. డాడీకి గూడా మామ్ అంటే ప్రాణం. డాడీ లైబ్రరీలో మామ్ కలెక్షన్ ఉంది. వాటినన్నింటినీ నా లైబ్రరీలో ఉంచానిప్పుడు."

'ఈమెనా ఓ అరగంట క్రితం హిస్టీరిక్‌గా ప్రవర్తించింది!' అని ఆశ్చర్యపోయాడు ప్రభాకర్. ఇద్దరూ కొంచెం దూరంలో ఉన్న చెట్టు కిందకు వెళ్ళి కూర్చున్నారు.

పుస్తకాల మీదినుండి సంభాషణ కాలేజీ లైఫ్ మీదకు దొర్లింది.

"రాముతో నా పరిచయం కూడా అప్పుడే అయిందండి. రామూ నా ఫ్రెండ్ సుమిత్ర వాళ్ళింట్లో అద్దెకుండేవాడు..."

ఎన్నాళ్ళగానో పరిచయమున్నట్లు పాత విషయాలన్నీ ఎంతో సన్నిహితంగా చెపుతుంటే ప్రభాకర్‌కి చాలా విచిత్రమనిపించింది. రామారావు లలిత చాలా రిజర్వుడు టైప్ అని చెప్పాడు. 'ఇంత స్నేహంగా మాట్లాడే లలిత రిజర్వుడు టైపేమిటి?' అనుకున్నాడు.

"మా కాలేజీలో ఓ పాలిటిక్స్ ప్రొఫెసర్

ఉండేవాడు. లాంగ్వేజ్ క్లాసులకు అన్ని గ్రూపులవాళ్ళం కలిసేవాళ్ళం. ఓ రోజు మా ఇంగ్లీషు లెక్చరర్ రాకపోతే ఆయన తీసుకున్నారు ఆ అవర్. ఏదో కాంపోజిషన్ రాయమన్నారు. ఆ రోజే రాధ అని ఓ కొత్త అమ్మాయి జాయినయింది. సైన్స్ గ్రూపు. మా పాలిటిక్స్ ప్రొఫెసర్‌గారి స్వరం మేఘ గర్జనలా ఉండేది. ఆయన రాధను 'వాటీజువర్ నేమ్?' అని అడిగారు. అసలే కొత్త, పిరికి. దానికితోడు ఈయన స్వరం భయంగొల్పింది. దాంతో రాధ హడలిపోయి పడిపోయింది. రాధ తండ్రి ఐ. ఎ. ఎస్. ఆఫీసర్. ఆ ఇన్సిడెంట్‌తో నానా గొడవ జరిగి, పాపం, ఆ లెక్చరర్‌కి మా ప్రిన్స్‌పాల్ మెమో ఇచ్చారు- 'చాలా సున్నితంగా మాట్లాడాలి విద్యార్థులతో' అని...."

లలిత ఇంకా ఏమేమో పాత విషయాలను నెమరు వేసుకుంటోంది. ప్రభాకర్ ఓప్పుగా వింటున్నాడు.

"మా క్లాసులో నవీన్ అనే ఒకతడుండేవాడు. సన్నగా రివటలాగుండేవాడు. చాలా మంచివాడు. అయితే, పాపం అతనికి కన్వల్షన్స్ వస్తుంటాయి తరచూ. ఎప్పుడూ ఎవరో ఒకరు అతడివెంట ఉండేవారు. సాధారణంగా అతడి తమ్ముడుండేవాడు. ఆరోజు తమ్ముడు రాలేదు. అప్పుడు మేం థర్డ్ బి.ఎ. లో ఉన్నాము. పరీక్షల రోజులు, కాలేజీ అయిన తర్వాత కొంచెంసేపు లైబ్రరీలో కూర్చొని ఒక్కడే ఇంటికి వస్తున్నాడట. అంతే! ఆ తర్వాత అతడి జాడ తెలియలేదు. ఆ రాత్రి అతడి తల్లిదండ్రులు అతడి కొరకు చాలా సేపు ఎదురు చూసి చూసి, కాలేజీకి వచ్చారట వెదుక్కుంటూ. వాచ్‌మన్ తనకేం తెలియదన్నాడు. అతడు ఆరుగంటలప్పుడు కాలేజినుండి వెళ్ళిపోవడం చూశానని మాత్రం చెప్పాడు. పోలీసు రిపోర్టు ఇచ్చారు. రేడియోలో చెప్పారు. అన్ని పేపర్లలో ప్రకటనలిచ్చారు. ఏ సమాధానం రాలేదు. తర్వాత, అతడిని నక్సలైట్ అనే అనుమానం మీద పోలీసులు కాల్చేశారని తెలిసింది. అదీ ఓ సంవత్సరమైన తర్వాత. ఆ సంవత్సరమంతా తన కొడుకు ఎక్కడో ఒక చోట బ్రతికే ఉన్నాడని భావిస్తున్న ఆ తల్లి అతడికలేడు అని తెలిసిన క్షణాన ఎంతో క్షోభించి ఉండాలి కదూ?"

"మీరు బి. ఎ. లో ఏ గ్రూపు?"

"ఎకనమిక్స్"

"గేమ్స్ అవీ ఆడేవాళ్ళా కాలేజీలో?"

"ఊఁ. బాడ్మింటన్ బాగా ఆడేదానిని. సుమిత్ర, నేను ఇంటర్‌స్టేట్ కాంపిటీషన్‌లో స్టార్ గెలుచుకున్నాం"

"కల్చరల్ యాక్టివిటీస్... ఏమన్నా ఉన్నాయా మీకు?"

"మాకు అంటే... కాలేజీలోనా?"

"కాదు. మీరు పార్టిసిపేట్ చేసేవాళ్ళా అని."

"నాటకాలలో... ఎక్కువగా నృత్య నాటికల్లో ఉండేదానిని. నాట్యం, సంగీతం నేర్చుకున్నాను లెండి. థర్డ్ బి. ఎ.లో కల్చరల్ అసోసియేషన్ జాయింట్ సెక్రటరీని."

ఐదు గంటలవుతున్నప్పుడు "ఇక వెళదామా?" అడిగాడు.

"ఊఁ" అని లేచింది లలిత.

"మీరు డ్రైవ్ చేయగలరా?" అడిగాడు.

"అయామ్ ఆల్‌రైట్" అంది కారు స్టార్ట్‌చేస్తూ.

"మా లలితకు అంతా తీరికే. వట్టి పుస్తకాల పురుగు. మా మామగారింట్లో పెద్ద లైబ్రరీ ఉండేదండి. ఆయనపోయిన తర్వాత ఆ లైబ్రరీలో కొన్ని ముఖ్యమైన పుస్తకాలను తను ఉంచుకొని మిగిలిన వాటిని కాలేజీ లైబ్రరీకి ఇచ్చేసింది."

"ఎక్కడండి?"

"కలకత్తాలో మా మామగారు డాక్టరు. వాళ్ళు బెంగాలీలు. వారికి చాలా కాలంవరకు పిల్లలులేరు. చివరిరోజుల్లో వారి నిరాశల్ని చెరిపేస్తూ ఉద్భవించింది మా లలిత. అందుకని చాలా అపురూపంగా పెరిగింది. లలితకు ఆరేళ్ళ వయస్సులో మా అత్తగారూ, లలిత కారులో వెళుతుంటే యాక్సిడెంటయి, విండో గ్లాసు పగిలి తలలో గుచ్చుకొని మా అత్తగారు మరణించారు. తల్లిలేని పిల్లని లలితను చాలా గారాబంగా పెంచారు మామగారు. లలిత పెళ్ళయి ఇటువచ్చేటంతవరకూ కలకత్తాను వదలి ఎక్కడకూ కదిలింది కాదు..."



ఉత్సాహంగా ఉన్నారు. అంతటి సరదా మనిషి. అలా ప్రవర్తించారు అంటే కళ్ళతో చూసిన నాకే నమ్మ బుద్ధేయడం లేదు" అన్నాడు ప్రభాకర్.

రామారావు నిట్టూర్చాడు- "అది మా ప్రారబ్దం. కాలేజీలో లలిత ఎంత యాక్టివ్‌గా ఉండేదనుకున్నారు! ఆ చలాకీ తనం ఎవరినైనా ఇట్టే ఆకర్షించేది. పెళ్ళయిన తర్వాత ఓ ఏడాది వరకూ బాగానే ఉంది. తర్వాత కొంచెం మూడీగా ఉండేది. వాళ్ళ నాన్నగారి మరణం తర్వాత ఇదంతా మొదలయింది. తనకు ఎంతగానో ఇష్టమయితే తప్ప లలిత అంత సరదాగా మాట్లాడదు. మీరు తప్పక లలిత మనస్సును ఆరోగ్య పరిసరాల వైపుకు తిప్ప గలరని నాకు ఇప్పుడు చాలా నమ్మకం కుదిరింది. మీ వంటి స్నేహితుడిని పొందిన నేను చాలా అదృష్టవంతుడిని."

"అంతమాట అనకండి. సాటి మనిషిగా నేను చేయగలిగిన సహాయం చేస్తాను. మీరు నాపై నమ్మకం ఉంచారు, చాలా థాంక్స్" అన్నాడు ప్రభాకర్.

"ఇప్పుడు నా కెంతో సంతోషంగా ఉంది. నేను లేనపుడు లలితను చూసే వాళ్ళెవ్వరా అని చాలా బాధపడేవాడిని. ఇప్పుడు నాకా బాధలేదు. మీరు నా తమ్ముడిలాంటి వారు. ఈ ఇంటి తలుపులు మీకు సర్వదా స్వాగతం పలుకుతాయి మీరు ఎప్పుడయినా స్వేచ్ఛగా రావచ్చు."

ఆ అభిమానానికి ఉక్కిరి బిక్కిరయ్యాడు ప్రభాకర్.

"మీ చదువుకేం ఆటంకం కలగడం లేదు కదా. మీరు అక్కడెక్కడో ఉండకపోతే మా ఇంటికే వచ్చేయ గూడదూ? మాకూ కంపెనీ ఉన్నట్లుం టుంది" అడిగాడు రామారావు.

"పర్వాలేదండి. అక్కడకు లైబ్రరీ, చంద్రమోహన్ ఆఫీసు చాలా దగ్గర."

"మీ ఇష్టం. కాని మీరు మాతో ఉంటే మాకు చాలా ఆనందంగా ఉంటుంది. సరే. వీలయినపుడల్లా వస్తూ ఉండండి" వీడ్కోలు ఇస్తూ అన్నాడు రామారావు.

ప్రభాకర్ ఆ ఆప్యాయతకు సంతృప్తి చెందాడు. సరాసరి చంద్రమోహన్ వద్దకు వెళ్ళాడు.

"చాలా బిజీగా ఉన్నట్లున్నావు. కన్పించలేదేం ఈరోజు" అడిగాడు చంద్రమోహన్.

ప్రభాకర్ విషయాన్ని తుచతప్పకుండా మొదటి నుండి చివరివరకూ చెప్పాడు. చంద్రమోహన్ అంతా విని కొంచెంసేపు ఆలోచించాడు. రామారావు చంద్రమోహన్‌కి ఉన్న ఒకే ఒక్క రిచ్ క్లయింట్. అతడి ఆదాయంలో సగభాగం రామారావు ద్వారానే వస్తుంది. వయస్సు తేడా ఉన్నా ప్రభాకర్‌తో చనువు ఉంది చంద్రమోహన్‌కి. కాని రామారావు ఎంత రిచ్ క్లయింట్ అయినా తను ప్రభాకర్ పట్ల ఉన్న తన స్నేహధర్మాన్ని వదులు కోలేకపోయాడు.

"ప్రభా! నీకు వయస్సూ, అనుభవం రెండూ తక్కువ. ఇలాంటి సమస్యలలో నీవు తల దూర్చడం శ్రేయస్కరమని పించడంలేదు"

"నాకు మటుకు అందులో అనుమానిం చాల్సిందేమీ కన్పించడంలేదు కాని అంతా మిస్టీరియస్‌గా ఉంది"

"మిస్టీరియస్‌గా ఉన్నందుకే అనుమా నించాల్సి వస్తోంది"

"రామారావు లలిత ప్రవర్తనను శంకి స్తున్నాడా అని అనుమానం వేస్తోంది.

కాని ఆవిడ చాలా ప్లెయిన్‌గా ఉన్నారు"

"నీకు లోకానుభవం చాలా తక్కువని అందుకే అన్నాను. పైకి ఎంతో మంచిగా కన్పించే వాళ్ళ మనస్సుల్లో ఏం ఉందో ఎలా చెప్పగలం? ఈ విషయాలలో పడి నీ చదువు పాడుచేసుకుంటున్నావు"

"అదేం లేదులే" అన్నాడు ప్రభాకర్. అతడిని రామారావు మంచితనం, లలిత నిర్మలత్వం ఆకర్షించాయి. వాళ్ళు తనకు పరిచయమయినందుకు సంతోషంగానే ఉంది. కాని ఆ పరిచయం ఇటువంటి సందర్భంతో మొదలయినందుకు అతడికి విచారమేసింది. అయినా ఆ పరిచయం మీద ఓ స్థిర అభిప్రాయం అంటూ ఇంకా ఏమీ ఏర్పడలేదు.



4

స్నేహాలనేవి చాలా విచిత్రంగా ఏర్పడతాయి. ఫస్ట్ ఇంప్రెషన్ బట్టి స్నేహితులయినా తర్వాత విడిపోయే వారూ, మరెన్నడూ కలవాలనుకోని వారూ, మొదట నిర్లిప్తంగా స్నేహం కలిపినా చివరకు విడదీయరాని స్నేహితులయేవారున్నారు.

ప్రభాకర్, లలిత మధ్య స్నేహం నిరుత్సాహంగానే మొదలయింది. లలిత ప్రవర్తనకు వెనుకగల బలీయమైన కారణాల నూహించడానికి ప్రయత్నించాడు ప్రభాకర్. భవిష్యత్తులో రాగల మానసిక మార్పులు బాల్యంలోనే నాటు వేసుకుంటాయి. లలిత కాలేజీ చదువు వరకు తన పరిసరాలతోటి, చుట్టూ వున్న వ్యక్తులతోటి సంతోషంగా, సరిగ్గా సర్దుకొని ఇమిడిపోయింది. అలా సర్దుకోలేకపోయినట్లుంటే ఈ రోజు ఈ సమస్యనర్థం చేసుకోవడానికది ఒక మార్గంగా ఉండేది. మామూలుగా అలా సర్దుకుపోయే వ్యక్తి ఆరోగ్యవంతుడు. అతడికి కోపతాపాలుండవని కాదు. ఉన్నా వాటినెలా అదుపు చేయాలో అతడికి బాగా తెలుసు. తన సమస్యకు కారణమేమిటో, అవి ఎలా సర్దుబాటు కాగలవో అతడు అర్థంచేసుకోగలడు. అతడి ఆలోచనలో ఒక క్రమపద్ధతి,వాస్తవికత ఉంటాయి.తనసమస్యకు సమాధానం తానే ప్రశాంతంగా ఆలోచించి తీసుకోగలడు. అతడు ఏ పరిస్థితులకైనా సర్దుకపోవడానికి ప్రయత్నిస్తాడు. సఫలీకృతుడవుతాడుగూడా! అంటే అతడిది ఏ ఎండకా గొడుగు పట్టే ఊసరవెల్లి మనస్తత్వం కాదు. అతడికి సంపూర్ణమైన, స్థిరమైన వ్యక్తిత్వముంటుంది. అతడెప్పటికీ నీడకాడు. పరిస్థితుల కనుగుణంగా తన ప్రవర్తన ఏ విధంగా మార్చుకుంటే తనకు ఆనందం, ఆరోగ్యం కలుగుతాయో ఆ విధంగా మార్పు తెచ్చుకుంటాడు తన ప్రవర్తనలో. ఆమార్పులో ఉండేది కపటంకాదు, విచక్షణ. అతడు తన వ్యక్తిత్వాన్ని కించపర్చే భావాలన్నీ తనలో నుండి పారద్రోలుతాడు. అతడికి తన ధ్యేయంగూర్చి ఒక లక్ష్యం ఉంటుంది. తన బలహీనతలను అంగీకరిస్తాడు. పొరపాటు తనదయినపుడు దానిని సరిదిద్దుకోడానికి బాధపడడు, కించపడడు. ఈ గుర్తింపు తనకుతాను సరిదిద్దుకోవడానికి

పనికిరావాలిగాని ఇన్ఫీరియర్‌గా ఫీలవడానికి దోహదమవగూడదు.

జీవితంతో రాజీపడడం తెలియని వానికి దానితో ఎప్పుడూ పోరాటం జరుగుతుంది. ఈ రాజీ పడటం తెలియనివానికి అది రైవల్స్ క్వారల్‌గా మారుతుంది. అతడికి స్నేహితులతో ఆనందంగా మెలగడం తెలియదు. అతడెప్పుడూ ఎదుటివారు తమను అవహేళన చేస్తున్నారని భయపడి ఆ భయాన్ని ద్వేషంగా మార్చుకొని ఎదుటివాళ్ళను ద్వేషిస్తూ, తనకు తెలియకుండానే తనను తానే ద్వేషించుకుంటూ ఉంటాడు. వాని కోరికలు, ఆశలు హిమాలయాలు. వాని ఆశలకూ, వాని నిజశక్తికీ పొంతన కుదరదు. ఆ పొంతన లేనపుడు ఆ ఆశలెప్పుడూ అడియాసలవుతాయి. అలా అడియాసలయినపుడు చాలా నిరుత్సాహపడి తనను తప్ప మిగిలిన ప్రపంచాన్నంతటినీ ద్వేషిస్తాడు గాని తనలో ఉన్న పొరపాటునర్థం చేసుకోవ



దానికి ప్రయత్నించడు. నిరాశా, నిస్పృహే అతడి స్నేహితులు. తన సమాజమే తనకు బందిఖానా. దానినుండి పారిపోవడానికి ప్రయత్నిస్తూ మార్గం అర్థంకాక ఊహాలోకంలో, మత్తు మందుల ప్రభావంతో ఉంటాడు. ఇటువంటి మనస్తత్వం ఒక్కసారిగా ఏర్పడదు. బాల్యంలోనే దానికి పునాది ఏర్పడుతుంది. ఆ వయస్సులో ఏర్పడ్డ ప్రతి అభిప్రాయం ముందు జీవితంపై ఎంతో ప్రభావాన్ని కలుగజేస్తుంది. బాల్యంనుండే పిల్లలు భవిష్యత్ నెదుర్కోవడానికి సంసిద్ధులు కాకపోతే వారి భావి జీవితం అసౌకర్యం, అంధకారం అవుతుంది.

లలిత మాటలను బట్టి ఆమె బాల్యం ఆనందంగానే గడిచిందని అర్థమవుతోంది ప్రభాకర్‌కి. అయితే అసలు సమస్య వివాహంతోనే మొదలయిందా? సాధారణంగా భార్యాభర్తల మధ్య మనస్పర్థలు కుదిర్చి చేసిన వివాహాల్లోనే ఎక్కువ అంటారు. ప్రేమవివాహాలలో కూడా అవి ఒకరినొకరు అర్థం చేసుకోలేనప్పుడు వస్తాయి. లలితకు రామారావుతో దీర్ఘ పరిచయం తర్వాతనే వివాహం జరిగింది. పరస్పర అవగాహన లేకపోవడమనేది ఇంత పరిచయం మీద అరుదు. అన్నాళ్ళూ లేని ఈ సమస్య ఇప్పుడు ఎలా ఎందుకు ఉత్పన్నమయింది?

ఈ వివాహ వ్యవస్థలో సాధారణంగా భార్యాభర్తలు తప్పనిసరి పరిస్థితి అని ఒకరినొకరి అంగీకరించడం తప్ప ఇద్దరి మధ్య సరైన అవగాహన ఉండదు. ఒకరినొకరు సంపూర్ణంగా అర్థం చేసుకొని, వివాహం చేసుకొనే అవకాశం కట్నాలతో, మోసాలతో చుట్టబడిన ఈ వివాహ వ్యవస్థ కల్పించజాలదు. ఇటువంటి అనారోగ్య పరిస్థితులుండబట్టే ఆత్మహత్యలు, మానసిక అనారోగ్యాలు నానాటికీ పెచ్చుమీరుతున్నాయి. దాదాపుగా దేశంలో జరిగే ఆత్మహత్యలలో ఇరవై శాతం పశ్చిమ బెంగాలులోనే జరుగుతున్నాయి. ఆభూమిపై పుట్టినందుకు లలితకా వాసనలేమీ వారసత్వంగా రాలేదు కదా? అన్ని రాష్ట్రాలలోకన్నా నాగాలాండ్‌లో ఆత్మహత్యలు చాలా తక్కువట. ఏ సమాజంలో ఆత్మహత్యలెక్కువున్నాయో ఆ సమాజానికి పురోగమనం లేదు. అది తిరోగమనమే చేస్తుంది. మనిషి బ్రతకడానికి ఏర్పడ్డ సమాజం అతడిని ఆత్మహత్యకు పురిగొల్పుతుందంటే అది ఎంత కుళ్ళిపోతోందో అర్థమవుతుంది. మన దేశంలో ఆత్మహత్యలకు దీర్ఘవ్యాధుల తర్వాత అత్తమామల పోరు, కట్నాల పేచీ, భార్యాభర్తల తగాదాలే అధికంగా కారణాలు. 19-30 సంవత్సరాల వయసు వారిలోనే ఈ ఆత్మహత్యల శాతం ఎక్కువగా ఉంది.

సరే, లలిత ప్రవర్తనకు కారణం ఏమిటి?

ప్రభాకర్ చాలా దీర్ఘంగా ఆలోచించాడు. లలితకు ప్రభాకర్‌తో స్నేహం చాలా ఆసక్తిని కలిగించింది. ఆమెకు ప్రభాకర్ చాలా ఆత్మీయుడిలా కన్పించాడు. నిజం చెప్పాలంటే ఇప్పుడామెకు రామారావు తప్ప నా అని చెప్పుకోదగ్గవాళ్ళెవ్వరూ లేరు. తల్లిని చిన్నతనాన్నే కోల్పోయింది. పోయిన సంవత్సరం తండ్రి మరణించాడు. అత్తగారి వైపు వాళ్ళు ఉన్నా వాళ్ళెవ్వరూ రామారావుకే ఇష్టులు కారు. అతడికి తన వారూ, తన ఊరూ, ఆ సంఘమూ లోపభూయిష్టంగా

కన్పిస్తాయి. "వాళ్లు కపట వేషధారులు. నా వాళ్ళను గూర్చి చెప్పుకోకూడదుగాని ఈ ప్రపంచంలో నాకు నిన్ను మించిన ఆత్మీయులు లేరు లలితా. వాళ్ళు, వాళ్ళ ప్రవర్తన నిన్ను గాయపరుస్తాయి. పుట్టి పెరిగిన ఆ ఇల్లు నాకే అంత అయిష్టాన్ని కలిగిస్తే నీవు అక్కడ ఎలా ఉండగలవో అర్థంకావడం లేదు" అన్నాడు లలితతో.

అయినా ఉత్సాహాన్ని తగ్గించుకోలేక ఒకసారి అత్తగారి ఊరువెళ్ళింది లలిత. అక్కడి వాతావరణం ఆమెకు చాలా అసహజంగా, అక్కడి మనుషులు తిరుగాడుతున్న కీబొమ్మల్లాగా అనిపించారు. రెండు రోజుల్లోనే తిరిగి వచ్చేసింది.

"చూశావా నేను ముందే చెప్పలేదా నీవు నామాట నమ్మలేదుగాని" అన్నాడు రామారావు.

ఆనాటినుండి లలిత ప్రపంచం చిన్నదై పోయింది. ఒంటరిగా ఎక్కడకూ వెళ్ళేది కాదు. దానికితోడు ఆమెకు స్నేహితులెవ్వరూ ఏర్పడలేదు. ఆమెకు చాలామంది ప్రవర్తనలో సహజత్వం లోపించి, కృత్రిమత్వం కన్పించి ఎవ్వరితోసాన్నిహిత్యం పెంచుకోలేకపోయింది. ఆశించని వరంలా ఆమెకు ప్రభాకర్‌తో పరిచయం కలిగింది. ప్రభాకర్‌లోని నిజాయితి, సునిసిత పరిశీలనా శక్తి, స్నేహభావం ఆమెనెంతో ఆకర్షించాయి. అచిరకాలంలోనే అతడు లలితకు ఆత్మీయుడయ్యాడు.

"ప్రభా ! నీవీ మధ్య ఇంటికి రావడంలేదేం? రాము కలకత్తా వెళ్ళిపోయి, నీవు లైబ్రరీల చుట్టూ తిరుగుతుంటే నాకెంత బోర్ కొడుతుందో తెలుసా?..."

అంత చనువుగా, సన్నిహితంగా మాట్లాడుతున్న ఆమె నిష్కల్మష స్వభావం ప్రభాకర్‌ని లలితకు మరింత చేరువ చేసింది.

"మా మారేజీ డాడీకి ఇష్టంలేదు. ఆయనెంత పట్టుదలతో ఉన్నాడంటే తన అంతిమ క్షణం వరకూ మా వద్దకు రానే లేదు.''

"ఎందుకంత పట్టుదల?"

"అది నేనెలా చెప్పగలను ? మొదటి నుండి డాడీకి రాముపై సదభిప్రాయం లేదు. ఆయనను వొప్పించడానికి అయిదేళ్ళు ప్రయత్నం చేశాము. ఎంతకూ డాడీ, 'అతడు నీ డబ్బు నాశిస్తున్నాడు' అంటారేతప్ప రాముని అర్థం చేసుకోలేక పోయారు. రాముని పిలిచి ఒకటికి పది సార్లు చెప్పారు- ఈ పెళ్ళి జరగదని, ఒకవేళ జరిగినా తన ఆస్థిలో చిల్లి గవ్వ కూడా నాకు రాదని. అన్నింటికి తెగించే వివాహం చేసుకున్నాము. అంతకుముందే డాడీ తన ఆస్తినంతా ఆర్ఫనేజ్‌కిరాశారు. ఆస్తి రాదని తెలిసీ అంత సాహసం చేసినా డాడీ రాముని నమ్మలేదు. మా ఇంటి గడప తొక్కలేదు. నాకు అదే దిగులు - డాడీ చివరిరోజుల్లో నేను దగ్గర లేకపోయానే అని. డాడీ చివరి క్షణాలలో డాడీ ఫ్రెండ్సే నాకు ట్రంకాల్ చేశారు. నాకు డాడీ చాలా శిక్ష విధించారు ప్రభా"

చేతుల్లో ముఖం దాచుకొని ఏడవ సాగింది లలిత. ఆ వెక్కిళ్ళమధ్యే అన్నది "నేను అంత చేయరాని తప్పేం చేశానని డాడీ నాకు అంతపెద్ద శిక్ష విధించారు ? మమ్మీ నా చిన్నతనంలోనే పోయింది. అసలు ఆ మరణం నాకు రావాల్సింది గాని నన్ను రక్షించి మమ్మీ తను ఆహుతి అయింది. చివరకు డాడీకి అశాంతి నివ్వడానికేనా నేను బ్రతికి ఉన్నది?..."

కొంచెం తేరుకొని అన్నది "మమ్మీ అంతా నాలానే ఉండేదట- నాన్నగారి ఫ్రెండ్స్ అనేవారు ... డాడీ అతడి నంత అసహ్యించుకున్నా రాము నన్ను చాలా ప్రేమగా చూసుకుంటాడు. రాము ప్రేమే గనుక లేకుండా ఉంటే డాడీ మరణానికి నేను పిచ్చిదాన్నయి ఉండే దాన్ని..."

లలిత తన భావాలను, అభిప్రాయాలను, అభిరుచులను అరమరిక లేకుండా చెప్పుకునేది. ఆమె మాటల్లో అమాయకత్వం తప్ప కపటం కాని, నటనగాని కన్పించేవి కాదు.

ప్రభాకర్‌కి రోజూ చంద్రమోహన్ ఆఫీసుకు రావటం అలవాటు. సరిగ్గా పదకొండు గంటల వేళ కారణం ఉన్నా లేకున్నా అతడికి ఫోన్ చేయడం లలితకు అలవాటయింది. ఆ ఫోన్ రావటం ఒక వేళ పది నిమిషాలు ఆలస్యం అయినా



ప్రభాకర్‌లో ఆత్రుత పెరిగిపోతుంది. సరిగ్గా ఆ సమయానికి ప్రభాకర్ అక్కడ గనుక లేకపోతే లలిత ఆందోళన పడి పోతుంది.

స్త్రీ పురుషుల మధ్యగల ఆకర్షణకు మానసిక శాస్త్రవేత్తలు చెప్పే కారణాలు ఏమైనా లలిత, ప్రభాకర్‌ల స్నేహాన్ని చంద్రమోహన్ సహృదయతతోనే గ్రహించాడు. రామారావు ఆ స్నేహాన్ని ఏనాడూ అపార్థం చేసుకున్నట్లు లేదు. ప్రభాకర్, లలితలు కూడా తమకివ్వబడిన మర్యాదను దుర్వినియోగం చేయాలనే ఆలోచన మనస్సుల్లోకి రానివ్వలేదు. స్నేహానికున్న ఉన్నత భావాన్ని వాళ్ళు నిలిపారు. వారానికోసారి కాకున్నా నెలకోసారన్నా ప్రభాకర్ రామారావు ఇంటికి వెళుతుంటాడు. లలిత కూడా అప్పుడప్పుడు ప్రభాకర్ ఇంటికి వచ్చి, కొంచెం సేపు కూర్చొని 'బ్రహ్మచారివనిపించావు ప్రభా' అని ఇల్లు సర్ది మాట్లాడి వెళ్ళిపోతుంది.

తమ పరిచయం తర్వాత ఆమె దినచర్యలో, వైఖరిలో వస్తోన్న మార్పుకు ప్రభాకర్ చాలా సంతోషించాడు. అతడాశించిన మార్పు అదే. ఆ విషయాన్నే రామారావుతో ప్రస్తావించాడు.

"మొదట్లో నేను లలితలో చూసిన అనారోగ్యం ఇప్పుడామెలో చాలావరకు తగ్గిపోయింది. ఇంతకుముందులానే ఆమె రాత్రిళ్ళు నిద్రలో నడుస్తోందా?" అడిగాడు ప్రభాకర్.

"ఆ సోమ్నాంబులిజమ్ అలానే ఉంది గాని శ్రీముఖి తీరానికెళ్ళడం తగ్గించింది. నాకు చాలా సంతోషంగా ఉంది. మీకు చాలా శ్రమ ఇస్తున్నాను"

"ఇందులో శ్రమ ఏముందిలెండి"

"నిజం. లలిత ఆరోగ్యం బాగు పడుతోంది. ఏ డాక్టర్లూ చేయలేని పని మీ స్నేహం చేయగలిగిందంటే మీలాంటి వ్యక్తితో పరిచయమయినందుకు నేను గర్వపడుతున్నాను"

ఆ పొగడ్తలకు ప్రభాకర్ సిగ్గుపడిపోయి "మీరు అంతగా పొగుడుతున్న గొప్పతనమేమీ నాలో లేదండి" అన్నాడు.

రామారావు నవ్వి స్నేహపూర్వకంగా అతడి భుజం తట్టి "బాగా చదువుకో. నీవు తప్పకుండా ఐ.ఎ.యస్.వి కావాలి. లలిత కూడా అదే కలువరిస్తోంది" అన్నాడు.




లలితకు ప్రభాకర్‌తో ఆత్మీయత బాగా పెరిగింది. ఆమె సామాన్య విషయాలను కూడా అసాధారణంగా చర్చిస్తుంది. ప్రభాకర్ ఆమె మాటలను సానుభూతితో వింటాడు. ఆమె సమస్యను తన దృష్టితోనే కాకుండా ఆమె దృష్టితో కూడా ఆలోచించి ఆమెకు పరిస్థితులను విడమర్చి చెప్పడానికి ప్రయత్నిస్తాడు. లలితకు ప్రభాకర్ సమస్యనర్థంచేసుకునే విధానం నచ్చింది. అతడి ఆలోచనా ధోరణిని ఆమె ఆమోదించింది. తన సమస్య పరిష్కారానికి తన ఆలోచనే కాకుండా ప్రభాకర్ వంటి వ్యక్తి సక్రమ

మైన ఆలోచన ఎంతో అవసరమని గ్రహించింది.

ఆ రోజు ప్రభాకర్‌కి ఒక విషయం గూర్చి చెప్పాలని ఆలోచిస్తోంది. ఆ విషయం ఆమె మనస్సుని రంపంలా నెమ్మదిగా కోస్తోంది.

"ఏమిటలా ఉన్నావు?" అడిగాడు ప్రభాకర్.

"ఏమీలేదు" అన్నది మరలా తన ఆలోచనలో మునిగిపోతూ.

ప్రభాకర్ రెట్టించలేదు. ఆమెనే పరీక్షగా చూస్తూండిపోయాడు.ఆమె కిటికీలో నుండి వీధిలోకి చూస్తూ సీరియస్‌గా ఆలోచిస్తోంది. కొంచెంసేపయిన తర్వాత దీర్ఘంగా ఊపిరి తీసుకొని ఒక నిర్ణయానికి వచ్చినదానిలా తలూపి అతడి వైపు తిరిగి అన్నది-

"నాకెందుకో ఈ జీవితం పెద్ద అబద్ధమనిపిస్తోంది ప్రభా! రామూతో నా పెళ్ళి, నీతో పరిచయం అంతా కల్పన అనిపిస్తోంది. కాని దీనిని మర్చిపోవాలని లేదు ఏదో మత్తు నన్ను కమ్మేస్తున్నదనుకుంటాను"

"కావచ్చు. అందుకే నీవు ఏదో చెప్పాలనుకుంటున్నావు"

"అవును. అమెరికాలో గంట కింత చొప్పునని డబ్బు వసూలుచేసి మనం చెప్పదలచుకున్న సొదనంతా ఓపిగ్గా వింటారట"

"రెండుసార్లు'సొద' అన్నది. బహుశ రామారావు ఈమె మాటల్ని సొపకింద తీసిపారేసాడేమో" ప్రభాకర్ అనుకున్నాడు.

"పొద్దున రాముతో గొడవయింది కొత్త మోడల్ డిన్నర్‌సెట్ మార్కెట్‌లోకి వస్తే నిన్న కొన్నాను. రాము ఇష్టపడతాడనుకున్నాను. రామూకు కూడా కొత్త వస్తువులంటే చాలా పిచ్చి. రాత్రి రామూ ఆలస్యంగా వచ్చాడు. అప్పుడేం చెప్పలేదు. ఈరోజు పొద్దున్నే ఏవేవో ఫైల్స్ ముందేసుకుని కూర్చున్నాడు. చాలాసార్లు ఎవరెవరికో ఫోన్‌చేశాడు. చాలా సీరియస్‌గా పనిని గూర్చి ఆలోచిస్తున్నాడు. సాధారణంగా అటువంటి పరిస్థితులలో డైవర్షన్ ఇష్టపడతారు. అందుకని సెట్ తీసుకవచ్చి చూపించాను. కనీసం వాటివైపన్నా చూడకుండా విసుగ్గా 'ఘనకార్యం చేశావులే. వెళ్లు' అన్నాడు. నాకు మనస్సు చివుక్కుమంది. రామూకు నామీద ప్రేమ తగ్గిపోయిందేమో అనిపించింది. 'ఎంతటి దుర్భరమైనజీవితం'అని ఏడ్చానుకూడా. కానితర్వాత ఆలోచించడం మొదలెట్టాను. రామూ అలా వ్యంగ్యంగా మాట్లాడింది నామీద ఇష్టంలేక కాదు. తర్వాత రామూ కూడా 'అయామ్ సారీ లలితా. నిన్ను విసుక్కున్నాను కదూ. చూడు దట్ బడీ రాస్కెల్ వాడి సొంతం అయినట్లు, గవర్నమెంట్ కాంట్రాక్ట్, త్రీ లాక్స్, ఇవ్వడానికి టెన్ పర్సెంట్ కమీషన్ అడిగాడు' అన్నాడు. రామూ బిజినెస్ విషయంలో కిందామీదయి ఆలోచిస్తున్నపుడు నా డిన్నర్ సెట్ ప్రస్తావన అప్రస్తుతం కదూ. ఇలా నేను ముందే ఆలోచించాల్సింది. కాని అతడి నిర్లక్ష్యాన్ని భరించలేక చాలా సెన్సిటివ్‌గా ఫీలయ్యాను. అసలు అలా ఫీలవకుండా ఉండిఉంటే ఏడ్చే అవసరమే వచ్చేదికాదు. మనస్సు పాడయేది కాదు. రాము మీద హఠాత్తుగా కలిగిన కోపం క్షణంలో పోయింది" నవ్వింది లలిత.

"వాస్తవ దృష్టి లోపించినపుడే కలత

చెందుతావు. ఏమైనా నీవు నిజానికి దూరంగా ఆలోచించడాన్ని అసలు తలే ఎత్తనివ్వకూడదు" అన్నాడు.

ఒక విధంగా చెప్పాలంటే లలిత చాలా వరకు వాస్తవదృష్టితోనే ఆలోచిస్తోంది. ఎదుటివాళ్లు మనంచేసే ప్రతిపనినీ ఆమోదించాలని కోరుకోవడం మానవ సహజం. ఆ కోరికే జీవితం కాదు. ఆ కోరికవల్ల జీవితమానందదాయకమవుతుందనే భావనే ఆ కోరికను తీర్చుకోవడానికి పురిగొల్పుతుంది. కాని ఆ భావన హద్దు దాటినపుడు వ్యక్తి హేతువాదదృష్టి శూన్యమైపోతుంది. మనిషికి అసలైన ఆనందం ఎక్కడ వుంది? ఎదుటివాళ్ళ మెప్పుదలకన్నా ఆత్మతృప్తే తనకు ఆనందమిస్తుంది. ప్రశ్న చిన్నదే కావచ్చు. కాని దానికి సమాధానం తనంతట తాను తెలుసుకున్నపుడు ఎంత ఆనందం!... నిరుత్సాహం తన పలాయన భావ ప్రవృత్తిమీద తనకు అదుపులేనపుడు కలుగుతుంది. అదే మనస్సును అప్ సెట్ చేస్తుంది. తన ఓటమిని తానే అదుపుచేయకపోతే విజయం ఎక్కడిది?

"ఒక్కోసారి నాకేమనిపిస్తుందో తెలుసా? నేనేదో కలగంటున్నాననుకుంటాను. ఈ జీవితంలో ఏదో అపశృతి ఉంది ప్రభా! అది నాకు తెలిసినట్లనిపిస్తోంది. కాని చెప్పలేకపోతున్నాను. ఎందుకు జీవిస్తున్నానో అర్థంకావడం లేదు. ఎవరికొరకు జీవిస్తున్నానో తెలియడంలేదు. నాకొరకే నేను జీవిస్తున్నానా? ఒక అబద్ధం, ఒక చేదు నిజం కలసి నన్ను వెంటాడి వేధిస్తున్నాయి. ఏమిటవి? ఒంటరితనం, వైరాగ్యం నా నీడల్లా మారాయి. పెళ్ళికి పూర్వం ఈ నిస్పృహ లేదు. ఎన్నాళ్ళుగానో అర్థంచేసుకున్న తర్వాతే రామారావుని వివాహమాడాను. నాన్నగారు పోయిన తర్వాత నాకు ఇష్టం లేకుండానే నాలో మార్పు వస్తోంది. రాము నా భర్త కావడం నా అదృష్టం. కాని ఏదో నిరాశ నన్ను వదలడంలేదు. డాడీ మరణంతో ఒంటరితనం ! నన్ను పూర్తిగా కమ్మేసి ఊపిరాడనీయకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. రాము నన్ను చాలా ఓదార్చాడు. నానుండి ఒంటరితనాన్ని దూరం చేయడానికి చాలా ప్రయత్నించాడు. కొన్నాళ్ళయితే ఆఫీసు మానేసి నా ఎదురుగానే కూర్చునేవాడు. అతడిలా బిజినెస్‌కి దూరంచేయడం నా తెలివితక్కువ అనిపించింది. అతడికి ఎలాగో సర్దిచెప్పి ఆఫీసుకు పంపించేదానిని... కాని, నేనెంత ఒంటరిగా ఫీలవుతానో నీకు చెప్పినా అర్థంకాదు ప్రభా. చీకటి కమ్ముకువస్తుందంటేనే భయం. నా దృష్టిలో నేను అణువునయి పోతాను. విపరీతమైన భయం. తలనొప్పి వస్తుంది. ఎంతో నీరసంగా ఉంటుంది. కనీసం నీవు డాక్టరువన్నా కాదు నా భయానికి కారణం చెప్పడానికి. ఆ తలనొప్పి భరించలేక తల గోడకేసి కొట్టుకుంటాను. పాపం, ఆఫీసులో అలసిపోయి వచ్చి కూడా రాము రాత్రంతా మేల్కొని నాకు సేవచేస్తూ గడిపేవాడు. భార్యగా అతడిని సంతోషపెట్టడం పోయి అతడితో సేవలుచేయించుకోవాలంటే ఎంత కష్టంగా ఉంటుందో ఆలోచించు. కేవలం ఏడవటం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయత ఆవరించేది నన్ను. వంట తనే చేసి, బలవంతాన నాకు తినిపించి, ఆ ఎంగిళ్లు కూడా తనే తీసేవాడు. రాముని చాలాసార్లు ఇన్‌సెన్సిటివ్ అనుకునేదానిని. కాని ఇంతగా సేవచేసే రాము చాలా గంభీ

రుడు. తన మనస్సునేనాడూ బయట పడనివ్వడు. అతడి కోరిక ఒక్కటే. నిజాయితీగా కష్టపడి ఉన్నత స్థితిని చేరుకోవాలని. అతడికి నేను తగనని పిస్తోంది. అతడంటే నాకు అంతర్గతంగా భయమేర్పడుతోంది ఇప్పుడిప్పుడే. ఎందుకో నాకే తెలియదు. అతడితో వెనుకటిలా ఉండలేకపోతున్నాను. అతడు పలుకరించినా సరైన సమాధానాలివ్వలేకపోతున్నాను. ఎంతోమంది డాక్టర్లను కన్సల్ట్ చేశాము. ఎవ్వరూ ఏమీ లేదన్నారు. ఏ పుట్టలో ఏ పాముందోనని భూతవైద్యుల దగ్గరకు, బాబాల దగ్గరకు వెళ్ళాము. ఖర్చులుతప్ప ఏమీ మిగలలేదు. ఒక బిషప్ క్రిస్టియానిటీలో నమ్మకం ఉంచమన్నాడు. నేను క్రిస్టియన్ ఇన్స్టిట్యూట్‌లో చదువుకున్నాను. మొదటి నుండీ జీసస్ అంటేనే నమ్మకం నాకు. కాని నాకు,నా ఒంటరితనంకు మధ్యనున్న దూరం పెరగలేదు. నా ఆరోగ్యం మెరుగుపడలేదు. నాకు ఒక విషయం తెలుసు ప్రభా! నాలో ఓ విషబిందువు అంతర్లీనమై ఉంది. దాని స్వభావ స్వరూపాలేమిటో నాకు తెలియదు. ఎదుటివారి సలహా తీసుకోవడానికైనా దానినిగూర్చి వారికేమీ వర్ణించి చెప్పలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాను."

లలిత మాటల ద్వార ప్రభాకర్‌కి ఓ విషయం అర్థమయింది. ఆమె అనారోగ్యం పెళ్ళితో మొదలయి తండ్రి మరణంతో ఉచ్ఛస్థాయికి చేరుకుంది. భర్తకు తను న్యాయం చేకూర్చలేకపోతోంది అన్న భావనతోపాటు, వివాహానికి పూర్వం సౌఖ్యంగా, తండ్రి మరణానికి ముందు ఇప్పటికన్నా ఆనందంగా ఉండేదని అనుకుంటోంది. అంటే ఆమె ఈ జీవితానికి దూరంగా, స్వేచ్ఛగా వెళ్ళిపోవాలనుకుంటోంది. ఆమె రామారావుకు దూరమవ్వాలనుకోవడానికి బలమైన కారణాలేమీ చెప్పడంలేదు. ఈ ప్రపంచంలో ఆమెకు సన్నిహితులంటూ ఎవరన్నా ఉంటే అది రామారావే. అటువంటి రామారావు తోడునీడలో కూడా ఆమె ఒంటరితనం అనుభవించటానికి కారణం ఏమయిఉంటుంది? రామారావుకు దూరమయే స్వేచ్ఛనే ఆమె కోరుకుంటే ఆ స్వేచ్ఛకు అర్థం ఏమిటి? లలిత విచక్షణ కలది. ఈమాత్రం ఆలోచించగలదు. ఆమె ఆలోచనలో అస్పష్టంగా ఉంది ఆమెలో అంతర్లీనమై ఉన్న ఆ విష బిందువు ఏమిటి? ఏదన్నా బాల్యంలో జరిగి, మరుగున పడిపోయి, ఇప్పుడు హఠాత్తుగా గుర్తుకు వచ్చిన సంఘటనా? ఏది ఏమైనా వివాహం ఆమె ఇష్టపూర్తిగా జరిగినా, అది ఆమెమీద గట్టి ప్రభావం చూపించింది. ఆమె తండ్రి మరణం ఆమెను బాగా కృంగదీస్తోంది. బహుశా, రామారావు అన్నట్టు తండ్రికి వివాహం వలన తాత్కాలికంగా, మరణంతో శాశ్వతంగా దూరమవడమే ఆమె విచిత్ర ప్రవృత్తికి కారణమా? ఆమె ఆదరణను, ఆప్యాయతను ఎదుటివాళ్ళనుండి మౌనంగా ఆశిస్తోంది. అందుకే ఆమె ప్రభాకర్‌కి అచిరకాలంలోనే చేరువయింది. కాని ఆ ఒంటరితనం ఆమెనుండి దూరమవలేదు కదా!

సాధ్యమైనంతవరకు ఆమె సమస్యకు సమాధానం వెదుకుతున్నాడు ప్రభాకర్. అతడి కామె విషయం అంతుబట్టడం లేదు. అయినా అతడు తన ప్రయత్నం నుండి విరమించుకోలేదు. ఆమె ప్రతి

చర్యను గమనిస్తున్నాడు. ఆమె ఇష్టాలనే తాత్కాలికంగా తన ఇష్టాలుగా మార్చుకొని ఆమె అభిప్రాయాలతో ఏకీభవిస్తూ ఆమె మనస్సులోకి తొంగిచూడటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమె ప్రభాకర్‌తో పరిచయం వలన కలిగిన కొత్త పరిస్థితులకు తేలిగ్గా అలవాటు పడిపోయింది. కనీసం రోజుకొక్కసారైనా అతడిని ఫోనులో పలుకరిస్తుంది. ఆ నాలుగు క్షణాలే ఆమెకు నూతన తేజాన్ని







ప్రసాదించినట్లుంటుంది. తర్వాత యథాప్రకారమే. లలితకూ తన సమస్యమీద ఆసక్తి ఉంది. తనూ దానినిగూర్చి ఆలోచిస్తోంది. కాని తన మనస్సును కదల్చివేస్తున్న ఆ అస్పష్ట భావాలనర్థంచేసుకోలేకపోతోంది.

"నీవు ఎక్కువగా విశ్రాంతి తీసుకోవాలి లలితా. నీకు మానసిక, శారీరక విశ్రాంతి చాలా అవసరం. ట్రాంక్విలై

జర్స్ ఉపయోగిస్తున్నావు కదా. నీకు భయం, విసుగు కల్గించే విషయాల ప్రసక్తే ఎత్తుకోవద్దు" అన్నాడు ప్రభాకర్.

"చిన్నప్పుడు ఓ యాక్సిడెంట్ చూశాను ప్రభా! ఆ యాక్సిడెంట్‌లోనే మమ్మీ పోయింది. ఆ ఎర్రటి రక్తపు మడుగులో మమ్మీని నిర్జీవంగా చూశాను. మమ్మీ ఎలా బాధతో గిలగిలకొట్టుకుందో ఇంకా నా కళ్ళ ముందు మెదులుతోంది ప్రభా. అప్పటి నుండి ఎరుపంటే భయం. అందుకే రాము ఇంట్లో ఒక్క ఎర్రటి వస్తువు కూడా లేకుండా చేశాడు. చివరకు నా బొట్టు కూడా నలుపే. ఇక విశ్రాంతి అంటావా? రోజుకు పదిహేను పదహారు గంటలు నిద్రలోనే గడుపుతున్నాను. ఇంకా ఏం విశ్రాంతి కావాలంటావు? నీతో గడిపిన కొంచెంసేపు నేను అన్నీ మర్చిపోతున్నాను. ఏమిటి ప్రభావం? కాని అంతలోనే నిస్సత్తువ సన్నాపరించుకుంటోంది".

"కొన్నాళ్ళపాటు ఏవన్నా ప్రదేశాలు చూసిరాకూడదూ?"

"అదీ అయింది. ఎర్రటి కార్పెట్లు, రక్తం చిందే పూలు నన్ను వెక్కిరించేవి. కొండలమీద వాలే మేఘమాల నా గుండెను బరువెక్కించేది. ప్రకృతి సంపదతో పరవశించిపోయే లోయలు నన్ను పిచ్చిగా ఆహ్వానించేవి. ఏం చేయను!"

"ఒంటరిగా వెళ్ళావా?"

"ఉహు. నాలో సూయిసైడల్ ఇన్‌స్టింక్టు ఉందని రాము నన్ను ఒంటరిగా పంపించడు. ఆ ఎమోషన్స్ కంట్రోల్ చేసుకోలేక పరవళ్ళు తొక్కుతున్న ఏ నదీ ప్రవాహంలోకో, అంతుతెలియని ఏ లోయలోకో దూకేస్తానని రాము భయం. ఇలా గతంలో జరిగిన రెండు మూడు సంఘటనలు అతడిని కలవరపర్చాయి".

ఈ మానసిక వ్యాధికి చికిత్స ఏమిటి? శాస్త్రవేత్తలతోనే దోబూచులాడుతున్న ఈ వ్యాధి ఏమిటి? ఎంతో చదువుకున్న లలితే ఇలా బాధ పడుతుంటే, ఈ దేశంలో అజ్ఞానంలో మునిగిపోయి ఇలా బాధపడుతున్నవారెందరో ఉన్నారు. వారు భూతవైద్యులకు, బాబాలకు, మూఢ నమ్మకాలకు బలై పోతున్నారు. వారితో పోలిస్తే లలిత సమస్య అనూహ్యం. వారి బాధకు కారణాలు అర్థం చేసుకోవడానికి వీలవుతుంది. కాని లలిత సమస్య విచిత్రం. ఇది స్వయం కల్పితమా? లేకుంటే డాక్టర్లనెలా మోసగిస్తోంది? లలితలో ఇంత కల్పన చేసే కపటం ఉందా? తండ్రి మరణం ఆమెను కృంగదీస్తోంది. దాని నివారణకు డాక్టర్లిచ్చిన ఆ ప్రిస్క్రిప్షన్స్ ఏమీ చెప్పలేక పోతున్నాయి.

ప్రభాకర్ లలితవైపు చూశాడు. ఆమె కళ్ళు ఎంతో అలసిపోయినట్లున్నాయి- మత్తుగా, బరువుగా. ఆమెకెంతో సహాయం చేయాలని ఉంది. కాని ఎలా చేయాలో, అసలేం చేయాలో తెలియడంలేదు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆ చేయి చల్లగా, వాడిపోయిన పూవులా వుంది. అతడు తన నిస్సహాయతను, సానుభూతిని నోటి ద్వారా చెప్పలేక పోయినా ఆ భావాలు అతడి చేతి స్పర్శలో లలితకు అర్థమయ్యాయి. ఆమె వేడి మనస్సుకు మలయ మారుతం వీచింది. వాక్కు కన్నా చూపు, స్పర్శ మనస్సుని స్పష్టంగా తెలియజేస్తాయి. ఇది మూగ భాష. ఇదే బాహ్యాంతరాలు ఎన్ని ఉన్నా మానసిక సాన్నిహిత్యం కలిగించి మనిషిని మనిషికి దగ్గరగా చేస్తుంది.

భిన్న ధృవాలు ఆకర్షింపబడతాయి. మానవ మనస్తత్వంలో ఇది నిజం కాదు. పోలికవల్లే ఆకర్షణ కలుగుతుంది. ఎదుటి వాళ్ళతో స్నేహం నెరపే వాళ్లెప్పుడూ ఎదుటివాళ్ళలో తమ రూపాన్ని చూసుకుంటారు. సాధారణంగా స్నేహం సమవయస్కుల మధ్య, ఒకే రకమైన ఆసక్తులున్న వ్యక్తుల మధ్య, ఒకేస్థాయి ఆలోచనలున్న వ్యక్తుల మధ్య జరుగుతుంది. కొన్ని కొన్ని సమయాలలో ఈ సిద్ధాంతం అబద్ధమేమోననిపిస్తుంది. ఇది కొన్ని వివాహాలు చూసిన తర్వాత తరచూ కలిగే భావన. చాలా సరదాగా ఉండే వ్యక్తి, నెమ్మదిగా రిజర్వ్‌డుగా ఉండే స్త్రీని చేసుకుంటాడు. ఈ వివాహాన్ని చూసి ఆ సిద్ధాంతం తప్పు అని నిర్ధారించటం పొరబాటు. కొన్ని అంతర్గతమైన పోలికలే వారిద్దరిని దగ్గరకు చేర్చాయని తెలుసుకోలేకపోవడం వలనే అది. బహుశ అది వారి ఆకారాలలో పోలిక కావచ్చు. తల్లిదండ్రులలోనో, సాంఘిక స్థాయిలోనో, వివేక పరిధిలోనో...మరేదో ఇద్దరికీ ప్రియమైన విషయంలో గల పోలికే వారిని దగ్గరకు చేర్చింది. బయటకు కన్పించే తేడా ఎక్కువున్నా వారి నొకటిగా చేసే పోలిక ఒక్కటయినా ఆ తేడాకన్నా చాలా బలమైనది.




ప్రభాకర్‌కి లలిత సమస్య చాలా విషమంగా కన్పించి అతడి ఆలోచనలలో కల్లోలం రేపింది. అయినా అతడు దృఢచిత్తంతో ఉన్నాడు. చదువు నశ్రద్ధ చేయడంలేదు. చదివే సమయంలో ఇతర ఆలోచనలేమీ మనస్సులోకి రానివ్వడం లేదు. పరీక్షలు దగ్గరపడ్డాయి.

ప్రభాకర్‌కి తనకు తెలియకుండానే లలితమీద ఆరాధన పెరిగింది. సామాన్యంగా ఉండే లలితలో ఓ బలమైన ఆకర్షణ అతడిని కట్టిపడేసింది. ప్రతి వ్యక్తిలోనూ ఓ ఆకర్షణ ఉంటుంది. అది రూపం కావచ్చు, మాట కావచ్చు. ఒక్కోసారి అదేమిటో చెప్పడానికి కూడా మాటలు చాలవు. అటువంటి మాటల సంకెళ్ళలో ఇమడలేని ఆకర్షణే ప్రభాకర్ లలితలో చూశాడు. ఆమె వివాహిత అని తెలిసీ దానినుండి తప్పించుకోలేకపోయాడు. ఆమెకూ ప్రభాకరంటే ఇష్టం. అతడి సన్నిధిలో శాంతి పొందేది. ఆ స్థితికి, ఆ సాన్నిహిత్యానికి ఆమె అర్థం వెదుక్కోలేదు. వెదుక్కోవాల్సిన అవసరం కూడా ఆమెకు కన్పించలేదు. ఆమెకు తన జీవితం కృంగిపోతున్నట్లు తెలుసు. ప్రభాకర్ తెలివిగలవాడు. అవగాహన ఉన్నవాడు. ఆవేశాన్ని అదుపులో నుంచుకొని ప్రశాంతంగా ఆలోచించగలడు. చాలామంది యువకుల కన్నా అతడు ఎంతో మెరుగు. అయితే జీవితంలో అనుభవం లేదు. విధివశాత్తు తనకు పరిచయమయ్యాడు గాని తనను రక్షిద్దామని వచ్చిన రక్షకుడేమీ కాడు. ఆమెకా విషయం బాగా తెలుసు. అందుకే ఆమె ప్రభాకర్ తనకేదో చేస్తాడని, ఉద్ధరిస్తాడని ఊహించలేదు. ఊహే

మనిషిని గారడి చేస్తుంది. ఎదుటి వాళ్ళు చాలా గొప్ప పని చేయగలరని, త్యాగం, జాలి ప్రేమ చూపించగలరని అధికంగా ఊహిస్తే చివరకు మిగిలేది నిరాశ. మనిషి మనసు ఎదుటి వ్యక్తిని ప్రతిఫలించడం కన్నా ఊహా చిత్రాన్ని గీసుకుంటుంది. ఈ లోకంలో ఎవరికొరకు ఎవరున్నారు? ప్రతి మనిషి విధి అనే నదిపై అడ్డంగా వేసిన జీవితం అనే తాటి దూలం మీద ఒంటరిగా నడుస్తున్నాడు. ఒడ్డు వరకే తోడు. నిజానికిజీవితం ఒంటరిప్రయాణం. ఆ ప్రయాణంలో కాలు జారి నదీ ప్రవాహంలోకొట్టుకపోయేవారు ఎందరో, అవతలి ఒడ్డు చేరుకునేవారు ఎందరో! ఎవరికొరకు ఎవరు ఆగుతున్నారు? ఎవరు చేయూతనిస్తున్నారు? ఈ బంధాలన్నీ ఈవలి గట్టునే. ఈ బాసలన్నీ నది దాటకముందే. దాటడమనేది జీవితసమరం. అది బంధాలను, వాగ్దానాలను మర్చిపో జేస్తుంది. తల్లిదండ్రులు, బిడ్డలు,



స్నేహితులు, బంధువులు అందరూ ఎవరికివారే యమునాతీరే.

రామారావు వచ్చేసరికి ప్రభాకర్ సీరియస్‌గా చదువుకుంటున్నాడు.

"రివిజన్ అయిందా?'' రామారావు అడిగాడు.

చదువుతున్న పుస్తకం టేబిల్‌మీద పెట్టి చిర్నవ్వుతో "అయింది" అన్నాడు ప్రభాకర్.

"మీ ఇన్వెస్టిగేషన్ ఎంతవరకు వచ్చింది?''

ప్రభాకర్ ఓ క్షణం మాట్లాడలేదు.

"ఆవిడ కొంచెం నెర్వస్‌గా ఫీలవుతున్నారే తప్ప నాకింకేం విచిత్రం కన్పించలేదు'' అన్నాడు.

రామారావు ఆశ్చర్యపోయాడు. "కన్పించలేదా?"

ప్రభాకర్ తికమక పడ్డాడు. తన ఉద్దేశం ఎలా వివరించి చెప్పాలో అర్థం కాలేదు. ''అంటే...ఆవిడ చాలా వివేకంతో ఆలోచించగలరు. అయినా ఇప్పుడేమీ చెప్పలేను...ఆవిడ నిద్రలో నడుస్తారని మీరు ఓసారి అన్నట్లు గుర్తు."

"అవును. ఉన్నట్లుండి హఠాత్తుగా నిద్రలో లేచి 'వస్తున్నా మమ్మీ వెళ్ళిపోకు' అని తలుపులు తీసుకొని వెళ్ళిపోతుంది. ఆస్థితిలో ఆమె నాపడానికి నాకు శక్తిచాలదు. ఆమెకూ, శ్రీముఖికీ ఉన్న అవినాభావ సంబంధమేమిటో నాకు తెలియదు. ఎక్కువగా ఆ నదీ తీరానికెళుతుండేది. ఆమెను ఒంటరిగా వదలాలంటేనే నాకు భయం, ఏక్షణంలో ఏ అఘాత్యం చేస్తుందోనని. నా బిజినెస్‌నూ,లలితనూ ఒక్కసారే చూసుకోవాలంటే చాలా ఇబ్బందిగానే ఉంది"

ప్రభాకర్ కొంచెంసేపు ఆలోచించి ''నేనోరోజు రాత్రిపూట మీ ఇంట్లో ఆమె ప్రవర్తనను గమనించవచ్చా?" అడిగాడు.

రామారావు చిరునవ్వుతో "సంతోషంగా. శనివారం సాయంత్రం వస్తారా? ఆదివారం అంతా మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

''వస్తాను''

''మళ్ళీ కలుద్దాం'' అని రామారావు వెళ్ళిపోయాడు.

ప్రభాకర్ అతడు వెళ్ళిన దిక్కుగా చూస్తూ ఉండిపోయాడు.కొంచెంసేపయిన తర్వాత మనస్సు నదుపులోకి తెచ్చుకొని చదువుతున్న పుస్తకం మీదకు దృష్టి కేంద్రీకరించి దానిలో లీనమయ్యాడు.

శనివారం నాడు ప్రభాకర్ రామారావు ఇంటికి బయలుదేరాడు. అతడు లలిత ప్రవర్తన గూర్చే ఆలోచిస్తున్నాడు.

రామారావు, లలితలు ప్రభాకర్‌ని సాదరంగా ఆహ్వానించారు. ఆమె చాలా బలహీనంగా కన్పించింది కాని సంతోషంగానే ఉంది. భోజనాలు చాలా సరదాగా గడిచిపోయాయి.భోజనాలవద్ద రామారావు లలితతో ''ఈ రాత్రికి ప్రభాకర్‌గారి నిక్కడే ఉండమందాం" అన్నాడు.

లలిత కళ్ళల్లోకి వెలుగొచ్చింది "తప్పకుండా" అన్నది.

లలితకు ప్రభాకర్ తీక్షణమైన నిజాయితి ఎంతో నచ్చింది.వెలిగిపోతున్న ఆమె ముఖాన్ని చూస్తుంటే ప్రభాకర్‌కి ఆమె జబ్బుమనిషి అని నమ్మబుద్ధికాలేదు. కళ్ళల్లో అంత వెలుగు ఉన్నవాళ్ళు హిస్టీరియా పేషెంటు ఎలా అవుతారు?

భోజనాలయిన తర్వాత ముగ్గురూ

కొంచెం సేపు కబుర్లు చెప్పుకున్నారు. రామారావు దేశ సాంఘిక, రాజకీయ, ఆర్థిక విషయాలను గూర్చి ప్రభాకర్‌తో చర్చిస్తున్నాడు. లలిత మౌనంగా వారి మాటలను వింటోంది.

"లలితా! నీవు వెళ్ళి పడుకో. మేము కొంచెం బిజినెస్ విషయాలు మాట్లాడు కొని వస్తాము'' అన్నాడు రామారావు.

లలిత నవ్వి గుడ్‌నైట్ చెప్పి వెళ్ళి పోయింది. ఆ నవ్వు తియ్యగా గాలిలో రింగులు తిరిగి మాయమయింది.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత ''డ్రింక్ తీసుకుందామా?" అన్నాడు రామారావు. ప్రభాకర్ సమాధానం వినకుండానే ఫ్రిజ్ వద్దకు వెళ్ళి విస్కీ తెచ్చాడు.

"సారీ నాకు అలవాటు లేదు" అన్నాడు ప్రభాకర్.

రామారావు నవ్వి "అలవాటుదేముంది? కొత్త విషయాన్ని ఒకటికి రెండుసార్లు రిపీట్ చేస్తే అదే అలవాటవుతుంది" అన్నాడు.

ప్రభాకర్ ఎప్పుడన్నా ఫ్రెండ్స్‌తో కలిసి బీరు తీసుకుంటాడు. కాని కొత్తచోట తీసుకోడానికి సంకోచించాడు. మందు ప్రభావం అతడికి తెలుసు. మనిషి మనస్సులో బంధింపబడ్డ కోతికి మందు స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. ఒక్క కోతే ఏమి, ఆ బంధిఖానాలో ఉన్న సమస్త జంతుజాలానికి అది స్వేచ్ఛ నిస్తుంది. అందుకే ప్రభాకర్‌కి తనను తాను బయటపెట్టుకోవడం ఇష్టంలేదు. కాని రామారావు బలవంతంమీద కొంచెం తీసుకున్నాడు.

ఆల్కహాలు మనుషలను రెండు రకాలుగా తయారు జేస్తుంది. ఆల్కహాలు తీసుకున్నపుడు ఒకరకం అధిక ప్రసంగు లయితే, రెండోరకం నోరు బిగించుకొని కూర్చుంటారు. కాని మోతాదెక్కువైన కొలది వారి మనస్సులు తమ సంకెళ్ళను వదులు చేసుకుంటుంటాయి. ప్రభాకర్ తెలివి గలవాడు. డ్రింక్ తాగినపుడు మాట్లాడే వాని ప్రతి మాటను అతడు మామూలు స్థితిలో ఉన్నప్పుడు మాట్లాడే మాటతో పోల్చుకుంటాడు. అలా పోల్చు కుంటూ వినడం ద్వారా మానవ మనస్తత్వ లోతులను పరిశీలించాలని అతడికి అభిలాష.

టైం నెమ్మదిగా గడిచిపోతోంది. పన్నెండు గంటలు కావొస్తున్నపుడు రామారావు అన్నాడు ప్రభాకర్‌తో "రండి లోపలికి వెళదాం"

ప్రభాకర్ రామారావు వెనుకే లలిత పడుకొని నిద్రపోతున్న బెడ్‌రూంలోకి వెళ్ళాడు. బెడ్‌రూంలో నీలంరంగు బల్బు వెలుగుతూ గదిని, గదిలోని వస్తువులను నిద్రావస్థలో ఉంచుతోంది. లలిత గుండెల మీదకు నీలం రగ్గు కప్పుకొని ప్రశాంతంగా నిద్రపోతోంది. పైన ఫ్యాన్ నెమ్మదిగా తిరుగుతోంది. అది అలవాటు ప్రకారం తిరుగుతోంది గాని అవసరమై కాదు. రామారావు ప్రభాకర్‌ని కూర్చో మన్నట్లు సంజ్ఞ చేశాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా డ్రెస్సింగ్ టేబిల్ వద్దనున్న కుర్చీలలో కూర్చున్నారు. ప్రభాకర్ గదిని పరిశీలించడానికి బిడియపడి లలిత మంచంవైపే చూస్తూ కూర్చున్నాడు. పరుపు మీద వేసి ఉన్న నీలిరంగు, ఆకు పచ్చపూల బెడ్‌షీట్ మౌనంగా కథలు చెప్పుతున్నట్లుంది. ప్రభాకర్ నిశ్శబ్దంగా ఆ కథలను ఆలకించడానికి ప్రయత్నిస్తు న్నాడు 'వినిపించే రాగాలుకన్నా విన

బదని రాగాలు మరీ మధురం' అని చెప్పిన కీట్సు మాటలను ఆచరణ పెడు తున్నట్లుంది అతడి వాలకం.

లలిత పక్కకు తిరిగి పడుకొంది. "మొదలు" గుసగుసగా అన్నాడు రామారావు ప్రభాకర్‌తో.

ప్రభాకర్‌కేమీ అర్థంకాలేదు. నిద్ర పోయేవాళ్ళు అటూఇటూ మెసలుతూనే ఉంటారు. అది సహజం. అది జబ్బు లక్షణమెలా అవుతుంది ? అదే మాట రామారావుతో అన్నాడు.

"ష్... గమనించండి" రామారావు లోగొంతుకతో సమాధానమిచ్చాడు. ప్రభాకర్ చాలా ఉత్కంఠతతో లలితపై దృష్టి నిగిడ్చాడు.

నిద్ర నుండి మేలుకోబోయేముందు ఎలా మెసలుతారో అలా అటూఇటూ సున్నితంగా కదలసాగింది లలిత. రామారావు లైటు వేశాడు. తెల్లటివెలుగు గదిని పరచుకొంది. ప్రభాకర్ అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు. రామారావు విషాదంగా నవ్వి "ఇప్పుడు తట్టి పిలిచినా మన లోకంలోకి రాదు" అన్నాడు.

లలిత మొహంలో భావాలు లైటు వెలుగులో ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. ఆమె కళ్ళు తెరవలేదు. ఆమె ముఖం లోని ప్రశాంతత క్రమంగా అదృశ్యమై ఆందోళన చోటు చేసుకుంటోంది. ఆ మార్పుకి ప్రభాకర్ నివ్వెరపోయి చూడ సాగాడు. అతడు తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడు.

లలిత చాలా బరువుగా "మమ్మీ" అని పిలిచింది.

అతి బలవంతం మీద లేచి కూర్చొని "మమ్మీ" అన్నది. ఆమె చేతులు శూన్యంలో దేనికో తడుముతున్నాయి. "వస్తున్నా మమ్మీ" అని తడబడే అడుగులతో లేచి నించుంది.

అసంకల్పితంగా ఆమె నాపడానికి, ప్రభాకర్ రెండడుగులు ముందుకువేశాడు. రామారావు ఏమీ పట్టనట్లు వైరాగ్యంతో చూస్తూ నిలుచున్నాడు. ప్రభాకర్‌ని చూసి "మీరు ఆపినా ఆగదు. అయినా ప్రయత్నించండి" అన్నాడు.

ప్రభాకర్‌కి రామారావు మాటలువిన్న తర్వాత తన ఆలోచన తనకు అర్థమయింది. ఆమెను తాకడానికి సంశయిం చాడు. "పర్వాలేదు ఆపండి. లేకుంటే తలుపులు తీసుకొని వెళ్ళిపోతుంది" అన్నాడు రామారావు.

ప్రభాకర్ ఆమె కదలకుండా ఆమె రెండు చేతులూ గట్టిగా పట్టుకున్నాడు. లలిత ప్రభాకర్‌ని కూడా తనతో లాక్కొని పోసాగింది. ఇదే సంఘటన గనుక ప్రభాకర్ ఏదన్నా పుస్తకంలో చదివి ఉంటే ఆ దృశ్యాన్నూహించుకొని నవ్వుకునేవాడు. కాని నిజంగా జరుగు తున్న ఈ విషాద సంఘటన అతడికి చాలా విచారం కలుగజేసింది. గాలికిఊగే పూతీవెలా ఉండే లలితలో ఇంత శక్తా ? ప్రభాకర్ నివ్వెరపోయాడు. ప్రభాకర్ పట్టు విడుల్చుకొని "వస్తున్నా మమ్మీ, వెళ్ళకు. వస్తున్నా మమ్మీ" అంటూ లలిత వరండాలోకి ప రు గె త్తిం ది. వరండా తలుపులు తాళం వేసి ఉన్నాయి. ఆమె ఆ తాళంను గట్టిగా ఊపింది. "మమ్మీ !" అని ఒక్కసారిగా పెద్ద పెట్టున పిచ్చిగా ఏడుస్తూ తలుపు వద్దే కూలబడిపోయింది.

షాక్ తిన్నట్లు నిశ్చేష్టుడయి నిలబడి పోయిన ప్రభాకర్‌ని చేయిపట్టి కూర్చొ

బెట్టాడు రామారావు. గ్లాసులో విస్కీ పోసి ఇచ్చాడు. ఈసారి వద్దనకుండా తీసుకున్నాడు ప్రభాకర్. లలిత ఇలా ప్రవర్తించగలదని కూడా ఊహించలేదు ప్రభాకర్. ఆమె ప్రవర్తన అతడి గుండెను తీవ్రంగా గాయపర్చింది. ఈ లలితేనా కళ్ళల్లో ఎంతో వెలుగు నింపు కొని 'ప్రభా! నాకు నీవెంతో ఆత్మీయుడ' వన్నది ? ఈ లలితేనా- ప్రభా ! నేను ఒంటరిదాన్నన్నది? ఈలలిత.. ఈలలిత.. ప్రభాకర్ గుండె బరువెక్కిపోయింది. గోడకు చేరగిలబడి అతిదీనంగా వెక్కి వెక్కి ఏడుస్తున్న లలితను దగ్గరకు తీసుకొని కన్నీళ్ళు తుడుద్దామనుకున్న కోరిక అడ్డువచ్చిన సాంఘిక మర్యాదతో అణగారిపోయింది. నిస్సహాయంగా ఆమెను చూస్తూ ఉండిపోయాడు ప్రభాకర్.

కొంతసేపటికి లలిత వెక్కిళ్ళనాపి, గోడకానుకొని నిద్రలోకి జారిపోయింది. అప్పటివరకు మౌనంగా ఉండిపోయిన రామారావు ఆమె నిద్రపోగానే, ఆమెను నెమ్మదిగా చేతుల మీద నడిపించుకుంటూ వెళ్ళి పక్కమీద పడుకోబెట్టాడు.

ప్రభాకర్ జరుగుతున్నదానిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ విస్కీ తాగుతున్నాడు. రామారావు వచ్చి ప్రభాకర్‌కి ఎదురుగా సోఫాలో కూర్చొని సిగరెట్ వెలిగించాడు. కొంచెంసేపయిన తర్వాత "చూశావుగా" అన్నాడు నిట్టూర్చుతూ. షెల్ఫునుండి ఒక ఫైల్‌తీసి ప్రభాకర్‌కి ఇచ్చాడు.

ప్రభాకర్ దానిని అందుకొని అందులోని పేపర్లను తిరగవేశాడు. అవన్నీ లలిత మెడికల్ రిపోర్టులు. వాటన్నింటిలో కూడా లలితకేమీ అనారోగ్యం లేదనే ఉంది.

"ఏమిటి విచిత్రం?" అన్నాడు ప్రభాకర్.

"నేనేం చెప్పను? ఒక్కోసారి లలిత కావాలనే ఇలా చేస్తున్నదేమో అనిపిస్తుంది కాని ఆమె స్థితిని చూసిన వాళ్ళెవరైనా అలా అనుకోగలరా ? అసలు ఆమెకు నటించాల్సిన అవసరం ఏమిటి చెప్పండి?"

ప్రభాకర్ మాట్లాడలేదు. రామారావు మళ్ళీ చెప్పసాగాడు-

"ఒకవైపున లలిత ఆరోగ్యం ఇలా, మరోవైపు డాక్టర్ల రిపోర్టులు అలా ఉంటుంటే నాకు చాలా అయోమయంగా ఉంటోంది. దీనినిగూర్చి ఎక్కువగా ఆలోచించడంవల్ల కుటుంబ మర్యాద బజారుకెక్కుతుందనే భయంవల్ల ఆ ప్రయత్నాలు విరమించాను మీరు చాలా సూక్ష్మగ్రాహి. ఈ విషయాన్ని మీరు చాలా కాన్ఫిడెన్షియల్‌గా ఉంచగలరనే మీసహాయాన్ని కోరాను. మీరే స్వయంగా పరిస్థితిని పరిశీలించారు కదా. లలిత నాతో చెప్పుకోలేని విషయాలు మీతో చెప్పుకోగలదని నేను అనుకోవడం లేదు. కాని మీరు లలిత ప్రవర్తనకు ఉండగలిగే అర్థాన్నూహించడానికి ప్రయత్నించడంలో నాకు సహాయాన్నివ్వండి. ఇంతవరకు ఎక్కువకాలం లలితను ఒంటరిగా వదలాల్సిన అవసరం నాకు రాలేదు. ఇప్పుడు మా ఇండస్ట్రీ ఎక్స్‌పాన్షన్ జరుగుతోంది. మా మేనేజర్ లాంగ్‌లీవ్‌లో ఉన్నాడు. ఆ వర్కంతా నేనే చూడాల్సి వచ్చింది. కనీసం ఆరేడు నెలల వరకు నాకు తీరిక ఉండదు. లలితకు సహాయంగా ఉండటానికి వచ్చేవాళ్ళు ఎవ్వరూ లేరు. ఈ స్థితిలో లలితనేం చేయ

మంటారు? లెట్ మి బి ఫ్రాంక్. నా తరఫు వాళ్ళ వద్దకు లలితను పంపడం నాకు ఇష్టంలేదు. నేను పెరిగిన వాతావరణం లోని మనుషులెవ్వరూ ముఖానికి రంగు లేకుండా సమాజానికి కన్పించరు. అందు వలన నేను ఒక నిర్ణయానికి వచ్చాను. మీపై నాకున్న అభిప్రాయాన్ని చెప్పాను. స్నేహితులమధ్య లలితలో కొంత మార్పు రావచ్చు. మీరు లలితకు కొంత కంపెనీ ఇవ్వండి. దయచేసి మీరు నాకీ ఉపకారం చేసిపెట్టండి. నా లలిత మామూలు మనిషి కావడానికి చేయూతనివ్వండి" అన్నాడు రామారావు ప్రభాకర్ రెండు చేతులూ పట్టుకొని.

అతడి అభ్యర్థనకు ప్రభాకర్ కరిగిపోయాడు.

"డాక్టర్ కృష్ణమోహన్ అని మా ఫామిలీ ఫ్రెండ్ సూపరింటెండెంట్‌గా ఇక్కడ జనరల్ హాస్పిటల్‌లో ఉంటున్నారు. ఆయన సైకియాట్రిస్టు. మీరో సారి ఆయనను కలుసుకోండి. ఆయన చాలా అనుభవమున్న డాక్టరు. మీకు



తప్పకుండా సహాయం చేస్తారు. నేనీ విషయాన్ని ఆయనకు ఫోన్‌చేసి చెపుతాను" అన్నాడు ప్రభాకర్.

"పెద్ద పెద్ద డాక్టర్లకే చూపించాను. మీరు రిపోర్టులు చూశారు కదా."

"అయినా మీరోసారి ఈయననుకూడా కలుసుకోండి. ఈయనిచ్చే రిపోర్టు నాకూ సహాయకారిగా ఉంటుంది" అన్నాడు ప్రభాకర్.

"ఆల్ రైట్. మీరు చెపుతున్నారు కదా. మీరు అలాగే ఫోన్ చేయండి. మేము వచ్చే ఆ ది వా రం వెళతాం" అన్నాడు రామారావు.




ప్రభాకర్ డాక్టరు కృష్ణమోహన్‌కి ఫోన్‌చేసి సంగతంతా చెప్పాడు.

ఆయన అంతా ఓపిగ్గా విని చివరకు "నీవీ విషయంలో తలదూర్చడం ఆరోగ్యకరంగా లేదు ప్రభా" అన్నారు.

"ఆవిడకిప్పుడు తనను అర్థం చేసుకోగల మనిషి అవసరం ఎంతైనా ఉంది."

"అంటే ఆమె భర్తకన్నా ఆమెకు నీవే దగ్గర స్నేహితుడవా?" ఆయన చిరాగ్గా అడిగారు. ప్రభాకర్ సమాధానం చాలా అసందర్భంగా తోచింది ఆయనకు.

ప్రభాకర్ మనస్సు చివుక్కుమంది-

"మరీ అలా మాట్లాడకండి అంకుల్. ఇన్నాళ్ళూ ఆమె ప్రవర్తననుబట్టి, రామారావు మాటలనుబట్టి అలా అంటున్నాను"

"అవి భార్యాభర్తల విషయాలు. ఆమె తల్లిదండ్రులు ఎక్కడున్నారు?"

"చనిపోయారు. పుట్టింటి వైపునుండి ఆమెకెవ్వరూ లేరు."

"ఆమెనుగూర్చిన కొన్ని విషయాలు ఆమే చెప్పుకోవాలన్నమాట."

"మీరు ముందు ఇంటర్వ్యూ చేయండి. తర్వాత చూద్దాం."

"రేపు సండే వాళ్లు వస్తారన్నావు కదూ. ఆమర్నాడు నీవు వచ్చికలుసుకో. నీవు చెప్పే విషయాలు కూడా కేసు హిస్టరీకి పనికివస్తాయి కదా."

"అలాగే అంకుల్" అన్నాడు ప్రభాకర్ ఫోన్ పెట్టేస్తూ.

ప్రభాకర్‌కి మొదటినుండి మనస్తత్వ శాస్త్రంలో కొంత అభిరుచి ఉంది. లలితను గూర్చి ఆలోచిస్తూ తనకు సాధ్యమైనంత వరకు ఆమె కేస్ హిస్టరీని తనే తయారుచేయడానికి కూర్చున్నాడు. ఓసారి విషయాలన్నింటినీ మననం చేసుకొని చాలా జాగ్రత్తగా ఛార్టు తయారు చేయసాగాడు.

పేరు: లలిత

వయస్సు: సుమారు ముప్పయి.

వివాహం గూర్చి: సంతృప్తికరం.

చటుక్కున లలితకు పిల్లలు లేరు అన్న విషయం గుర్తుకు వచ్చింది ప్రభాకర్‌కి. ఎందుకు లేరు? లోకంలో ఎందరికో ఉండరు. నిజమే! కాని, వాళ్ళ విషయం వేరు. లలిత విషయం వేరు. ఎన్నో విషయాలగూర్చి మాట్లాడే లలిత ఏనాడూ ఆ విషయాన్ని గూర్చి ఎత్తలేదు. కనీసం చిన్నపిల్లల కాలెండర్లన్నా వాళ్ళింట్లో లేవు. పెళ్ళయిన మరుక్షణం

నుండే దంపతులు 'పిల్లలో పిల్లలో' అని కలవరిస్తారే! పెళ్ళయి నాలుగేళ్ళయింది; వీళ్ళసలు ఆ విషయం గూర్చి పట్టించు కున్నట్లులేదేం ? అంతలోకే ప్రభాకర్‌కి మరో విషయం గుర్తుకు వచ్చింది. లలిత తన ఇంటికి వచ్చినప్పుడిల్లా గోడ మీద ఉన్న మర్ఫీ బేబీ కాలెండరుని తదే కంగా చూస్తుంది. కాని ఏం మాట్లాడదు. కారణం ఏమిటి?

ప్రభాకర్ ఆ 'కారణం' గూర్చి ఆలో చిస్తూ ఉండిపోయాడు. పూవును, పాపని ఇష్టపడని వ్యక్తి ఉండడు. అందులో స్త్రీకి ఆ రెండూ ప్రాణంగా ఉంటాయి. పువ్వు లను, పాపలను ద్వేషించేవాళ్ళు మాన వత్వాన్ని ద్వేషిస్తారని ఎక్కడో చదివి నట్లు గుర్తు. అంటే లలిత మానవత్వాన్ని ద్వేషిస్తోందా ? ఈ నిద్రలో నడవటం కూడా నటనా? మానవత్వాన్ని ద్వేషించే వారికి నటించడం పెద్ద కష్టమేమీ కాదు. కాని లలిత... లలిత నటించగలదా? మనిషి తన దుర్మార్గ ప్రవర్తనను మాటల ద్వారా దాచిపెట్టగలడు. కాని, కళ్ళు ఆ బండారాన్ని బయటపెడతాయి. లలిత కళ్ళు ఎంతో అమాయకంగా, నిర్మలంగా ఉంటాయి. ఆ కళ్ళ వెనుక దుర్మార్గపు ఆలోచనలున్నాయని ఊహించడానికే సాధ్యంకాదు. మరి ఆ 'కారణం' ఏమిటి? ప్రతి చర్య, దాని సమాధానం ఆమెకు వ్యతిరేకంగానే సాక్ష్యం చెపుతున్నాయి. తను రాసున్న కాగితంవైపు తదేకంగా చూస్తూ 'ఏమయినా అంకుల్‌ని ఓసారి కలుసుకోవాలి' అనుకున్నాడు.

అనుకున్నవే జరిగితే అది జీవితమే కాదు నాటకమవుతుంది. మనిషి ఆడేది నాటకం అయితే అతడు బతికేదిమటుకు జీవితం కొరకు.

ప్రభాకర్ జీవిత ధ్యేయం ఐ.ఎ.ఎస్. కావడం. కాని విచిత్రంగా లలిత సమ స్యలో చిక్కుకొని తనకు తెలియకుండానే ఎక్కువ సమయం దానికై వెచ్చిస్తున్నాడు. ఎక్కడి లలిత, ఎక్కడి ప్రభాకర్? ఏమిటీ కలయికకు అర్థం ? అదే ప్రభా కర్‌కి అర్థంకాని ప్రశ్న.

ఆ మరుసటి సోమవారం ప్రభాకర్ డాక్టర్‌ని కలుసుకున్నాడు. అంతకు ముందు వారంరోజులుగా ఆయన లలితను ఇంటర్వ్యూ చేశారు. ప్రభాకర్‌ని లలిత విషయం గూర్చి ఎక్కువ ప్రశ్నించలేదు ఆయన. "నీతోడున్నప్పుడు లలిత ప్రవర్తన ఎలా ఉంటుంది?" అనిమాత్రం అడిగారు.

"ఎక్కువ మాట్లాడదు. కాని మాట్లాడి నంతసేపూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతుంది. రోజూ తప్పకుండా ఫోన్ చేస్తుంది. నెలకోసారన్నా ముఖాముఖి కలుసుకొని మాట్లాడుతుంది. ఆమె మాటలను బట్టి నాతో మాట్లాడడం ఆమెకు చాలా ఇష్టమని అర్థమవుతుంది. ఒకటి రెండుసార్లు ఆమెకూడా చెప్పిందీ మాట."

డాక్టర్ కొంచెంసేపు మాట్లాడలేదు. తర్వాత "ఆమె నిన్ను ఫూల్‌ని చేస్తోంది ప్రభా" అన్నారు.

"నేను నా కళ్ళతో స్వయంగా చూశాను. అంకుల్ ఆమె నిద్రలో నడవడం"

"నాకు ఈ విషయంలో చాలా అను మానం ఉంది. ఆమె మంచి ఆరోగ్యం తోనే ఉంది. భార్యాభర్త లిద్దరూ కూడ బలుక్కొని నాటక మాడుతున్నారని పిస్తోంది."

"అయితే? నాతో వారికే ఉపయోగం



మరి? లలితను చూస్తుంటే ఆమెకు అసలు నాటకం అంటే అర్థం తెలుసునా అని అనిపించలేదా అంకుల్ ?"

"ఆవిడను చూస్తుంటేనా? నాకు అలా అనిపించలేదు. నీవే పొరపడుతున్నావు ప్రభా. ఆమె చాలా తెలివిగలది?"

"తెలివిగలదే. కాని చాలా సాధు స్వభావం"

"ఏమయినా నీవు వారిద్దరకూ దూరంగా ఉండాలి. ఆమెది నిజమైన జబ్బుకాదు. నేను పోలీసు రిపోర్టు ఇస్తాను."

"అంకుల్!" ప్రభాకర్ కలవరపడి పోయాడు. లలిత పోలీస్ స్టేషన్ కెళుతుందా? ఆ అమాయకురాలేం తప్పు చేసిందని? అందరూ ఎందుకిలా లలితకు వ్యతిరేకంగా చెపుతున్నారు?

"వద్దు ఆంకుల్. నేను వారికి



దూరంగా ఉంటాను కాని ఆమెను లేని పోని కష్టాలకు గురిచేయవద్దు" అన్నాడు చాలా బాధపడుతూ.

ప్రభాకర్ తత్వానికి అంకుల్ మనస్సు ఆర్ద్రమైపోయింది. అతడు ఎంత డాక్టరయినా ప్రభాకర్‌ని తన చేతుల మీదుగా పెంచాడు. అంకుల్ వద్ద నుండి వచ్చిన తర్వాత ప్రభాకర్ చాలా దిగులు పడ్డాడు. ఒకవైపు నుండి లలిత అమాయకత్వం, రెండో వైపు నుండి అంకుల్ హెచ్చరిక... ప్లస్, మైనస్... చివరకు లలితను చూడగూడదనే నిర్ణయించుకున్నాడు.

రోజూ సరిగ్గా పది గంటలప్పుడు తనకు ఫోన్ చేస్తుందని గుర్తున్న ప్రభాకర్, ఆ మర్రోజు ఆవేళకు చంద్రమోహన్ వద్దకు వెళ్ళకుండా లైబ్రరీకి వెళ్ళి కూర్చున్నాడు. కూర్చున్నాడన్న మాటేగాని మనస్సు స్థిమితంగా లేదు. లైబ్రరీలో గడియారం టంగు, టంగుమంటూ పది గంటలు కొట్టింది. అవి అతడి గుండె మీద సమ్మెట పోట్లలా మోగాయి.

"లలిత ఫోన్‌చేసి ఉంటుంది" బరువుగా అనుకున్నాడు. మనస్సు కల్లోలితమై దృష్టి చదివే పుస్తకం మీద నిలవలేదు. పుస్తకం అలాగే ముందు పెట్టుకొని గడియారం వైపే చూస్తూ ఉండిపోయాడు.

ప్రభాకర్‌ని పొద్దుటి నుండి గమనిస్తున్న లైబ్రరీ క్లర్కు అతడు నాలుగు గంటలయినా శిల్పంలా అలాగే కదలకుండా కుర్చీలో కూర్చొని ఉండటం చూసి విస్మయపడ్డాడు. అతడికి ప్రభాకర్‌తో పెద్దగా పరిచయం లేదు. కాని రోజూ వస్తుంటాడు కాబట్టి ప్రభాకర్ బాగా గుర్తు. అతడు ప్రభాకర్‌ని తట్టి పిలిచాడు "నిద్రపోతున్నారా సార్? ప్రొద్దుటి నుండీ ఇలానే కూర్చొని ఉన్నారు."

ప్రభాకర్ ఈ లోకంలోపడి ఒక్కక్షణం ఏమీ అర్థంకాక అతడి వైపు చూశాడు. వెంటనే అంతా గుర్తుకువచ్చి చేతి గడియారం, గోడ గడియారం మార్చి మార్చి చూశాడు. సమయం నాలుగు గంటలయింది. ప్రభాకర్ క్లర్కు వైపు చూసి చిన్నగా నవ్వి 'సారీ' అని చెప్పి లైబ్రరీ నుండి బయటకు వచ్చాడు. అతడికి చుట్టూ ప్రపంచం చాలా కొత్తగా ఉంది. అతడి మనస్సులో ఏ ఆలోచనా లేదు. అలా నడుచుకుంటూ వెళ్ళిపోసాగాడు. అతడి మనస్సునంతా లలిత స్వరూపమే ఆక్రమించుకుంటోంది నెమ్మదిగా. అసలు తను లలిత మీద ఇంత శ్రద్ధ ఎందుకు తీసుకుంటున్నాడు? ఆమె ఎవరు? తనెందుకింత భ్రమలో పడిపోతున్నాడు? తామిద్దరి జీవితాలు సమాంతర రేఖలు. అవి ఎన్నడూ కలిసే అవకాశమే లేదు. మరి ఆమె గూర్చి తానెందుకింత బాధపడుతున్నాడు? భవిష్యత్ ఏం చెప్పబోతోంది?

"ఏం బాబూ నాలుగు రోజుల పాటుండాలని లేదా?" టాక్సీ డ్రైవర్ అదిలింపుతో ఈ లోకంలో పడ్డాడు ప్రభాకర్. అతడిని దాటుకొని ముందు కెళ్ళిపోయింది టాక్సీ.

పక్కకు తిరిగి చూసిన ప్రభాకర్ ఆశ్చర్యపోయాడు. తన పక్కనున్న వ్యక్తిని చూసి గుర్తించలేని అయోమయంలో పడ్డాడు.

ఆమె నవ్వుతూ "ఏమిటి ప్రభా అలా చూస్తున్నావు? నేను లలితను" అంది.

అప్పటికి తేరుకోలేకపోయాడు ప్రభాకర్.

"నీవు... నీవు...." ఆపై ఏం మాట్లాడాలో తెలియలేదు.

"పొద్దున మోహన్ వద్ద కెళ్ళలేదట. ఏం? ఇందాక కూడా ఫోన్ చేశాను. నీవసలు ఈ రోజు రానేలేదని చెప్పాడు. నేను, రాము గుడికి వచ్చాము. గుడి ముందు నుండి నీవు వెళుతూ కన్పించావు. నేనూ పిలిచాను, రామూ పిలిచాడు. ఉహూ. పలకలేదు. చాలా పరధ్యానంగా నడుస్తున్నావు. సరే అని చెప్పి రాముని ఇంటికి వెళ్ళమని ఇటు నీతో వచ్చాను"

"గుడినుండా?" ప్రభాకర్ ఆశ్చర్య పోయి చుట్టూ చూశాడు. అప్పటికి కాని తానెంత దూరం నడిచాడో అర్థం కాలేదు అతడికి. ఇద్దరూ నదీతీరంలో ఉన్నారు.

"నేను ఇంత దూరం నడిచానా? నీవూ ఇంత దూరం నడిచావా?" అని ఆమెను పరీక్షగా చూశాడు.

ఆమె శరీరం అంతా చెమట్లుపట్టి, సన్నగా కంపిస్తోంది. మనిషి ఆయాస పడుతోంది.

"సారీ లలితా! అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ" అన్నాడు చాలా బాధ పడిపోతూ.

ఇద్దరూ జనసంచారం తక్కువగా ఉన్న చోటుకి వెళ్ళి కూర్చున్నారు.

"కూల్‌డ్రింక్స్ సార్" అంటూ కూల్ డ్రింక్స్ బండి నెట్టుకుంటూ వచ్చాడు ఒక పిల్లవాడు. చెరో డ్రింక్ తీసుకున్నారు. ప్రభాకర్, కొంచెం దూరంలో ఉన్న కేంటీన్‌కి వెళ్ళి స్నాక్స్ తెచ్చాడు?

"అయ్యో. ఎందుకు తెచ్చావు. కొబ్బరికాయ ఉందిగా" అన్నది బుట్టలో నుండి కాయను బయటకు తీస్తూ. ఆమెకు తెలుసు ప్రభాకర్‌కి కొబ్బరి అంటే చాలా ఇష్టమని.

"దానిదేముందిలే. రెండూ తినేయ వచ్చు. అయితే గుళ్ళో కెళ్ళలేదా?" అన్నాడు బుట్టలోని అరటి పళ్ళను, పూలను చూస్తూ.

"లేదు. ఎక్కడయితేనేం, అన్నీ తిన డానికే అయినపుడు" అంది.

ప్రభాకర్ దూరంగా ఉన్న ఒక రాయి మీద కాయ పగులగొట్టుకొని వచ్చాడు. తాళంచెవి గుత్తికి ఉన్న చిన్న నైఫ్‌తో లలిత కొబ్బరిని ముక్కలుగా తీసి ప్రభాకర్ చేతిలో ఉన్న పుస్తకం మీద పెట్టింది.

ప్రభాకర్ చాలా ప్రశాంతంగా దానిని తినసాగాడు. అతడి మనస్సులో కల్లోలం క్రమంగా తగ్గిపోసాగింది. 'ఏమయినా సరే లలితకు దూరంగా ఉండలేను' అనుకున్నాడు.

"ఎక్కడికెళ్ళావు?" అడిగింది.

"లైబ్రరీకి"

"ఈ రోజు చంద్రమోహన్ వద్దకు వెళ్ళలేదెందుకు?" అడిగింది. 'నేను ఫోను చేస్తానని నీకు తెలియదా? నా ఫోన్ కావాలనే తప్పించుకున్నావా? ఎందుకు?' ఒక్కసారిగా అంతా అడిగే యాలనిపించింది లలితకు. కాని మామూలుగా ఒక్క ప్రశ్న అడిగింది.

"ఊర్కే" తప్పించుకున్నాడు ప్రభాకర్.

లలిత మరేమీ ప్రశ్నించలేదు. చాలా సేపటివరకు ఆమే ఏదయినా చెప్తుందేమోనని ఎదురు చూశాడు ప్రభాకర్. చివరకు ఉత్కంఠనాపుకోలేక–

"డాక్టర్ దగ్గరకు వెళ్ళారా?" అడిగాడు.

"ఉఁ"

"ఏమన్నారు?"

"ఏమనలేదు"

"అంటే? అసలేం ప్రశ్నలు అడిగారు?"

"నాకు సరిగ్గా గుర్తు లేదు"

"లేవూ? అసలు వెళ్ళావా?"

"అదీ అనుమానమే"

"అనుమానమా?" ప్రభాకర్ లలిత వైపు చూశాడు. ఆమె ముఖం అమాయకంగా ఉంది. తర్వాత గుర్తు తెచ్చుకుంటూ కొన్ని చెప్పింది.

"నీ ఆరోగ్యం సంగతి ఏమీ అడగలేదా? అసలు మీరెందుకు వెళ్ళారు డాక్టరు వద్దకు? ఇంత మతిమరపు అయితే ఎలా లలితా?"

"ఆఁ రాత్రిళ్ళు నిద్ర సరిగా పడుతుందా అని అడిగినట్టున్నారు"

"నీవేమని చెప్పావు?"

"సరిగ్గానే పడుతుందని చెప్పినట్లు గుర్తు"

"అన్నట్లున్నారు, చెప్పినట్లున్నాను... ఏమిటీ మాటలు లలితా? సరిగ్గా చెప్పు. ఇంకా ఏం అడిగారు? నీకు అసలు నిద్ర సరిగ్గా పడుతోందా?

"లేదుకదా. రాత్రి అవుతూనే భయం అని నీకు చెప్పలేదా?"

"మరి అంకుల్‌కి సరిగానే పడుతుందని ఎందుకు చెప్పావు?"

చేతులు నలుపుకుంటూ "నాకేం అర్థం కావడం లేదు ప్రభా" అన్నది.

ప్రభాకర్ తల పట్టుక కూర్చున్నాడు. "ఈ అయోమయం వ్యక్తినా అంకుల్ మోసం అన్నది?" నిట్టూర్చాడు.

"ఏమిటి ప్రభా ?"

"ఏమీలేదులే ఆ విషయం మర్చిపో. మొన్న మామ్ నావెల్ ఏదో మొదలుపెట్టానన్నావు?"

ఆమె నవ్వింది- "మొన్ననా? వారం పైగా అయింది నీకు చెప్పి. నా మతిమరపు నీకు వచ్చినట్లుంది. ఇంకా పూర్తి కాలేదు. నీ చదువు ఎంతవరకు వచ్చింది? నీవు దీక్షతో చదివి ఐ.ఎ.ఎస్.వి కావాలి ప్రభా".

"ఏదో చదువుతున్నానులే" అన్నాడు.

ఇద్దరి సంభాషణ మిగతా విషయాల మీదకు దొర్లిపోయింది. దీపస్తంభాలకు దీపాలు మసక మసగ్గా వెలుగుతున్నాయి.

"జూకి వెళదామా ప్రభా?" అడిగింది.

"ఎప్పుడు?"

ఆలోచించి "రేపు. ఆరోజు పక్షులను చూసి జంతువుల వద్దకు వచ్చేటప్పటికి నాకు ఆయాసం వచ్చి తిరిగే వచ్చేశాం కదూ. ఎంతవరకూ చూశాం? గినీపిగ్స్ చూశామా? అంతే అనుకుంటాను. నాకెందుకో వాటిని చూస్తే చాలా జాలనిపించింది ప్రభా. వాటిని నా గుండె కదుముకొని వాత్సల్యంతో లాలించాలనిపించింది. కేవలం మనిషిని నమ్మినందుకు కదా వాటికా దుర్మరణం" అన్నది జాలిగా.

"రేపు జూకి వెళితే వాటి నెత్తుకొని ఆడించేటట్లున్నావు. ముందు నా పరీక్షలు కాని. తర్వాత వెళదాం".

లలిత నవ్వి ఊరుకుంది.

"నీ మైనా ఏమంటోంది" అన్నాడు.

"ఎలానో తప్పించుకొని ఎగిరిపోయింది మొన్న. ఎంతో దిగులుగా ఉంది. దానికీ, నాకూ ఏమిటి అవినాభావ సంబంధం?"

"మనిషికి మనిషికి మధ్యే కాదు,

జంతువుకూ మనిషికీ మధ్య కూడా ఆకర్షణ ఉంది. స్నేహం కలగాలన్నా, విముఖత కలగాలన్నా సమ్ మాగ్నటిక్ పవరే కారణమంటాను. కొందరు యధా లాపంగా మాట్లాడి జీవితాంతం విడిపోని స్నేహితులవుతారు. కొందరు ఎన్నాళ్ళ పరిచయం మీదనయినా స్నేహితులు కాలేరు. కొందరు ఎంత త్వరగా కలు స్తారో అంత త్వరగా విడిపోతారు. కొందరి మధ్య ఆకర్షణ నెమ్మదిగా కలుగుతుంది. కొందరిని చూడగానే పూర్వజన్మ నుండి శత్రుత్వమున్నట్లని పిస్తుంది. దీనికి కారణం మాగ్నటిక్ ఎట్రాక్టివ్ అండ్ రిపల్సివ్ పవర్స్. వాటిని సౌత్ అండ్ నార్త్ పోల్సుగా చెప్పుకోవచ్చు. నీకూ మైనాకు మధ్య ఆకర్షణ, నీకూ నాకూ మధ్య ఆకర్షణ, నీకూ గినీపిగ్స్ మధ్య ఆకర్షణ..."

లలిత నవ్వింది.

"ఒకరి నొకరిలో ఉన్న హిప్నోటిక్ పవర్సే దీనికి కారణం" అన్నాడు.

ఆమె మరేమీ మాట్లాడలేదు ఈ విషయం మీద. ఆమెకీవిషయాలు అర్థ మయినట్లే అర్థమయి మనస్సు నుండి జారిపోతాయి.

"తనకూ, ఆ జంతువులకు మధ్య ఆకర్షణా?" నవ్వింది కొంచెంసేపు ఆగి.

"నీకు కుక్కల విషయం తెలుసా? కొందరిని చూస్తే మీదపడే కుక్కలు కొందరు కొత్తవాళ్ళను చూసినా తోకాడి స్తాయి. ఎందుకో తెలుసా?" అడిగాడు.

"అవునా? నాకు తెలియదు. ఎందుకు?" అడిగింది.

"ముందు అవి వచ్చిన వాళ్ళ కళ్ళ లోకి చూస్తాయి. ఆ కళ్ళల్లో స్నేహం తప్ప మరే భావం కన్పించినా మీద పడ తాయి".

"దానిదేముంది? కొందరి మనస్సులో ఎంత విషమున్నా స్నేహం నటించ వచ్చుగా?"

"నటించవచ్చా? పూర్తిగా వీలు పడదు లలితా! మనస్సుకి కళ్ళు అద్దం. ఆ అద్దంలో తన బొమ్మను మార్చేయా లంటే కష్టం. ఆ అద్దం నర్థం చేసుకోవ డానికి కూడా సునిశితమైన పరిశీలనా జ్ఞానం కావాలి. ఆ జ్ఞానం ఉన్నవాళ్ళను ఎంతటి మహానటులైనా మోసం చేయ లేరు. నీలాంటి పిచ్చివాళ్ళే అందరినీ నమ్మి మోసపోతారు" అన్నాడు.

"నమ్మకుండా ఉండేదానికన్నా నమ్మి మోసపోవడమే ఉత్తమమన్నారు ప్రభా"

"పాప పరుగెత్తుతూ కిందపడి దెబ్బ తగిలించుకుంటే తల్లి ఏమంటుందో తెలుసా? నీవు పడ్డందుకు దెబ్బ రాయికే తగిలిందిలే..." హఠాత్తుగా ప్రభాకర్‌కి లలితకు పిల్లలు లేరు అన్న విషయం గుర్తుకు వచ్చింది.

"లలితా! నిన్నో విషయం అడగనా!" అన్నాడు.

"అడుగు"

"నీకు పిల్లలంటే ఇష్టం లేదా?" అడిగాడు.

లలిత చాలాసేపటివరకు మాట్లాడ లేదు. పది నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లి పోయాయి.

"లలితా!" పిలిచాడు.

తల తిప్పుకొని దూరంగా చూస్తున్న ఆమె ప్రభాకర్ పిలుపుకి సమాధాన మివ్వలేదు. మరలా పిలిచాడు. లలిత మొహం ఇటు తిప్పలేదు.

"లలితా!" ఆమె ముఖంను తన వైపుకి తిప్పాడు. దూరం నుండి మసగ్గా ప్రసరిస్తున్న దీపకాంతిలో ఆమె బుగ్గ మీద కన్నీరు మెరిసింది. ప్రభాకర్ కలవర పడ్డాడు.

"ఏమిటి లలితా?" అడిగాడు.

"ఏమీలేదు" అన్నది కన్నీరు తుడుచుకుంటూ.

"నేనేమయినా నీ మనస్సు నొప్పించానా? అయామ్ సారీ లలితా"

"పిల్లలంటే ఇష్టం లేనిది ఎవరికి ప్రభా? చిన్నప్పటి నుండి పిల్లలంటే ప్రాణం. ఈ హిస్టీరియా వచ్చినప్పటి నుండి ఆ ఊహే నాకు చాలా భయంకరంగా ఉంది".

ప్రభాకర్ చాలా బాధపడ్డాడు. అన్నింటికన్నా విచారకరమైన విషయం ఏమిటంటే ఆమెకు హిస్టీరియా ఉందని ఆమెకే తెలియడం.

"ఎందుకలా ఉంటోంది?"



"నా చేతుల్లో పిల్లలు బ్రతకరనే ఆలోచన ఒకటి నాలో నాటుకు పోయింది. అందుకే పిల్లల మీద మనస్సు ఎంత గింజుకున్నా ఆ వూహకు వణికి పోతున్నాను" చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది లలిత.

ప్రభాకర్ మాట్లాడలేకపోయాడు.

కొంచెం సేపయిన తర్వాత లలిత తేరుకుంది.

"వెళదామా?" అడిగాడు.

"నాకు భయమేస్తోంది. కొంచెం సేపు ఇక్కడే కూర్చుందాం" అన్నది బేలగా.

"భయం ఎందుకు?"

"నాకు చీకటిని చూస్తేనే భయం. నిద్రపోవాలంటేనే భయం. జీవితమంతా కలతగా ఉంది. కొంచెంసేపు ఇక్కడే ఉందామా?"

"అసలు నీవు రామారావుకు చెప్పి వచ్చావా? ఎంత కంగారుపడుతున్నాడో ఏమో" మొదట్లోనే లలిత చెప్పిన మాట లన్నీ మర్చిపోయి అడిగాడు ప్రభాకర్. రామారావు సాధారణంగా లలితను ఒంట రిగా వదలిపెట్టడు. లలిత 'ఇంకొంచెం సేపు ఇక్కడే ఉందాం' అంటుంటే అక్కడ రామారావు లలిత కన్పించక ఏం కంగారు పడుతున్నాడో అని ప్రభా కర్ ఇక్కడ లలితను కంగారు పెట్టేస్తు న్నాడు.

"ఇద్దరం కలిసే గుడికి వచ్చాము. లోపలికి వెళ్ళకుండానే నిన్ను చూశాను. 'నిన్ను కలుసుకొని మాట్లాడి వస్తానని' రామూతో చెప్పి ఇటు వచ్చాను. తనకూ పని ఉందని, జాగ్రత్తగా వచ్చేయమని చెప్పి తను అటు వెళ్ళాడు"

ఇద్దరూ మరో పది నిముషాలు కూర్చున్నారు.

"ఎనిమిది గంటలవుతోంది. వెళ దామా?" అడిగాడు ప్రభాకర్ వాచి చూసు కొని.

"ఊఁ" లలిత అయిష్టంగానే లేచి బయలుదేరింది. ఇద్దరూ కలసి రోడ్డు మీదకు వచ్చారు. దీపాల వెలుగుల్లో వారి ద్దరి నీడలు పొడవుగా సాగి వారితోపాటే నడుస్తున్నాయి. చలిగాలి సన్న సన్నగా వీస్తోంది. ప్రభాకర్ మనస్సులో ఏవో ఆలోచనలు. తామిద్దరే కొండలు కోనలు దాటి ఎక్కడికో పోతున్న భావన. అడవి బతానీ తీగల పూల మధ్య నుండి నిండు జాబిల్లిని చూస్తున్న అనుభూతి. వెన్నెల వెలుగులో సెలయేటి పరవళ్ళలో జలకా లాడుతున్న తరుచ్ఛాయలను దర్శిస్తున్న ఆనందం. పరవశించి కూస్తున్న కోయిల రాగాలు, లీలగా జాబిల్లిని చుట్టుకొని దాని వెలుగుతోపాటు భూమిని చేరుతున్న వేణుగాన రవళి ... మనస్సు మత్తుగా ఉంది. లలితతో నడుస్తుంటే మనసు ప్రశాంతంగా ఉంది. అలా ఎంతో దూరం యుగాల తరబడి నడవాలనే ఉంది. కాని... కాని...

ప్రభాకర్ వాస్తవాన్ని గుర్తించి టాక్సీని పిలిచాడు. లలితను ఇంటి వద్ద వదిలేశాడు. రామారావు ఇంకా రాలేదు.

"లోపలికి వచ్చి ఓ పది నిమిషాలు కూర్చొని వెళ్ళరాదూ?" అడిగింది.

"ఈ రోజు ఏం చవపలేదు. మరో సారి వస్తాలే" అని అదే టాక్సీలో తన ఇంటికి వెళ్ళిపోయాడు ప్రభాకర్.

* * *

"చాలా రోజులకు కన్పిస్తున్నారు" అన్నాడు ప్రభాకర్ రామారావును చూసి

చిర్నవ్వు నవ్వుతూ.

"బిజినెస్‌లో అసలు తీరికే ఉండటం లేదు. ఏదీ, మీ మాట మీద డాక్టర్ కృష్ణ మోహన్‌ని కలుసుకున్నాము. ఎంతో కష్టం మీద ఆ వారంరోజులు తీరిక చేసుకున్నాను. ఆయన చాలా మర్యాదస్తుడు, పెద్దమనిషి. నాకు చాలా నచ్చారు. మీరేదో కాజువల్‌గా ఆయన మీ ఫ్రెండని చెప్పారు కాని ఆయన మిమ్మల్ని తన చేతుల మీద పెంచారట కదా?''

"అవునండీ. హైస్కూల్ నుండి ఆయన హైదరాబాద్‌లో మా నాన్న గారి వద్దే ఉండి తను చదువంతా పూర్తి చేశారు. మొన్న మొన్నటివరకూ హైదరాబాద్‌లోనే పనిచేసి ఈ మధ్యనే ఇక్కడకు వచ్చారు. లలితను చూసి ఏమన్నారు?"

"మా ము లే. వా రం రో జు లు ఇంటర్వ్యూ చేసి కొంచెం నెర్వస్ వీక్‌నెస్ తప్ప ఏమీ లేదన్నారు."

ప్రభాకర్‌కి డాక్టర్ కృష్ణమోహన్ మాటలు గుర్తుకు వచ్చాయి. 'ఏమిటీ మాటలకర్థం?' అనుకున్నాడు.

"ఇకపై ఏంచేయాలని నిర్ణయించుకున్నారు?"

"అదే నాకు అర్థం కావటం లేదు... కొన్నాళ్ళపాటు ఫారిన్ వెళ్ళి వస్తే బాగుంటుందేమో ననిపిస్తోంది...."

"మంచి ఆలోచనే. అక్కడ పెద్ద డాక్టర్లుంటారు. నాకూ లలిత ఆరోగ్యం అక్కడ బాగుపడవచ్చుననే అనిపిస్తోంది"

"ఎన్నాళ్ళుండాలని నిర్ణయించుకున్నారు అక్కడ?"

''చెప్పలేను. అది లలిత ఆరోగ్య పరిస్థితిని బట్టి ఉంటుంది కదా. న్యూయార్కులో నా ఫ్రెండ్ ఒకతను డాక్టరుగా ఉన్నాడు. కేబుల్ బుక్ చేసి చెపుతాను. అతడి సలహా బట్టి నా ప్రయాణం నిర్ణయించుకుంటాను. ఇంతకుముందే లలిత విషయం వివరంగా ఉత్తరం రాశాను అతడికి. మరో పదిరోజుల్లో సమాధానం రావచ్చు కూడా. అదీగాక నాకూ మా కంపెనీ తరుఫున న్యూయార్కులో పని వచ్చింది. లలితనుకూడా ఇప్పుడే నాతో తీసుకవెళితే అన్ని పనులూ కలసి వస్తాయి కదా అని నా ఆలోచన. అతడినుండి సమాధానం రాగానే ఏ విషయం మీకు త్వరలోనే చెపుతాను... సరే, పరీక్షలయిపోయినవి కదా. ఏం చేస్తున్నారిప్పుడు? ఇంతకూ మీ పెళ్ళెప్పుడు? కుల మతాల పట్టింపు లేకపోతే, మా బాంబే మేనేజర్‌కు ఒక్కగానొక్క కూతురు. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఆయన సంబంధాల కొరకు తెగ గాలిస్తున్నారు. ఈ మధ్యే నాకూ 'చూసిపెట్టమని' చెప్పారు. నిన్ను సజెస్టు చేస్తాను. ఇంటర్ కాస్టు మారేజీ ఇష్టమేనా?" నవ్వుతూ అడిగాడు.

ప్రభాకరూ నవ్వి "ముందు నన్నో ఉద్యోగంలో స్థిరపడనివ్వండి. నన్ను నేనే పోషించుకోలేని వాడిని భార్యనెక్కడ పోషించగలను?'' అన్నాడు.

"మీరో అపురూప సౌందర్యరాసి కొరకు వెదకుతున్నారని చంద్రమోహన్ చెప్పాడు'' టీజింగ్‌గా అన్నాడు రామారావు.

వాతావరణం తేలికబడ్డది.

రామారావు వెళ్ళడానికి లేచాడు.

"మరి నేను వస్తాను. ప్రయాణ విషయం మీకు ఫోన్‌చేసి చెప్తాను" అని వెళ్ళిపోయాడు.

ప్రభాకర్ కుర్చీలో వెనక్కు వాలి

సీలింగువైపే చూస్తూ కూర్చున్నాడు. లలితకు హిస్టీరియా? అందుకు ఫోరన్ వెళుతున్నారా? అసలు హిస్టీరియా అంటే ఏమిటి? చాలామంది హిస్టీరియా అంటే అరచి, గొడవ చేయడమే అనుకుంటారు. దీనిలో చాలా రకాలున్నాయి. ఇది మానసిక అస్వస్థత వలన కలుగుతుంది. దాని వలన వారికి వివిధ భ్రమలు కలుగుతాయి. కొందరు ఆస్థితిలో ఆహారమేమీ తీసుకోరు. చూస్తున్నది, వింటున్నదీ వారికేమీ తెలియదు. ఒక్కోసారి చేతులను, కాళ్ళను పక్షవాతం వచ్చినట్లు వేలాడవేస్తారు. ఎవరినీ గుర్తు పట్టలేరు. ఏ ఆలోచనా చేయరు. బహుశా ఆ స్థితిలోనే లలిత శ్రీముఖి నదీతీరాన తిరిగేది. ఆ అస్థిరత్వం ఆమెకు తర్వాత గుర్తుండేది కాదట. లలిత...ఎంతో ఆరోగ్యంగా ఉండే లలిత ఎందుకిలా మారింది? ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించే భర్త, సకలసంపదలూ ఉన్నాయి. ఇంకా ఏమున్నాయి ఆమెకు బాధలు? ప్రభాకర్ మనస్సులో ఆలోచనలు కృశించిపోసాగాయి. చివ



ఠికి అతడికి అసలు ఆలోచించే ఓపికే లేకపోయింది.

చంద్రమోహన్ వచ్చాడు. "ప్రభా! ఇందాక మీ నాన్నగారు ఫోన్ చేశారు. పరీక్షలయిపోయినవి కదా. ఇంటికి వచ్చేయమన్నారు" అన్నాడు.

"మొన్ననేకదా పరీక్షలకు వెళ్ళి వచ్చాను. ఇక్కడే బాగుంది నాకు. ఇంకా కొన్నాళ్ళు ఇక్కడే ఉందామని ఉంది."

"ఏంబాగుంది? మంచి స్నేహితులను సంపాదించావులే. వెంటనే ఇంటికి వెళ్ళు. డాక్టర్ అంకుల్ కూడా ఫోన్‌చేశారు. నీవు వచ్చిన తర్వాత తనకు మరలా ఫోన్ చేయమని చెప్పారు."

ప్రభాకర్‌కి మనస్సు చికాకయింది. అంకుల్‌కి ఫోన్ చేశాడు.

"ఇంకా ఇక్కడెందుకు? ఇంటికి వెళ్ళు" అన్నారాయన.

"ఎక్కడయినా నేను చేసేదేముంది అంకుల్?"

"ఉద్యోగం కొరకు ప్రయత్నించవా?"

"ఇక్కడ జూనియర్ కాలేజీలో ఓ వేకన్సీ ఉందట. ఆ కరస్పాండెంట్ మీకు బాగా పరిచయం కదా. దానికి అప్లై చేద్దామనుకుంటున్నాను."

"నాన్న వాళ్ళను అక్కడ వదలిపెట్టి నీవిక్కడ ఉద్యోగం చేయడం ఏమిటి? అందులోనూ జూనియర్ కాలేజీలో. మీ నాన్న నీకు యూనివర్శిటీలోనే చూడగలడు ఉద్యోగం"

"అలా అనికాదు అంకుల్ ..." ప్రభాకర్ ఏదో చెప్పబోయాడు.

"నాతో వాదించాలనుకుంటున్నావా?" తీక్షణంగా ఉంది ఆయన స్వరం.

"సారీ అంకుల్" ప్రభాకర్ ఫోన్ పెట్టేశాడు.

ప్రభాకర్‌కి ఆయన ఉద్దేశం అర్థమయింది. సాధ్యమైనంతవరకు ఆయన విషయాన్ని సున్నితంగా చెపుతున్నారు. అయినా ప్రభాకర్‌కి వీళ్ళ పద్ధతులేమీ నచ్చలేదు. అతడికే కోశానా త్రిపురం వదలి వెళ్ళాలనిలేదు. 'అందరూ తనను అపార్థం చేసుకుంటున్నారు' అనుకున్నాడు.

అంతలోనే తన ఆలోచనకు, సెల్ఫ్ పిటీకి తన మీదే అసహ్యమేసింది. తన ప్రవర్తన గూర్చి తనే ఆలోచించుకోసాగాడు. 'ఏనాడూ తను లలితవంటి సామాన్య స్త్రీ వైపుకు ఆకర్షింపబడతాననుకోలేదు. అసలా విషయాన్ని గూర్చి ఇంతకుముందు ఆలోచించడానికి తమ పరిచయం ఆ ఉద్దేశంతో మొదలవలేదు కదా. లలిత ముఖంలో ఎంతో అమాయకత్వం ఉంది. అది ఎంతో నిర్మల మనస్కులకే ఉంటుంది. ఆ రోజు శ్రీముఖి తీరం వద్ద పడిపోయిననాడు ఆమె ముఖంలోని నిర్మలత్వం, ప్రశాంతత తనేనాడూ మర్చిపోలేడు. ఆమెకీ అనారోగ్యం లేకుండా ఉంటే రామారావు వంటి సహృదయుడైన భర్తను, అంతటి ఐశ్వర్యాన్ని కలిగి ఉన్న ఆమె చాలా అదృష్టవంతురాలు. తనూ మొదట ఆమె నడతను అనుమానించాడు గాని ఆమె అలాంటిది కాదు. ఆమెకు అసలు చెప్పుకోదగ్గ పరిచయస్తులెవ్వరున్నారని? తనకు లలిత అంటే చాలా ఇష్టం. అయితే ఆ ఇష్టానికి అర్థం ఏమిటి? చంద్రమోహన్ మాటలకు, అంకుల్ హెచ్చరికకు కారణం ఏమిటి? లలితకూ, తనకూ మధ్య తొలగించలేని ఇనుపతెర ఉంది. అది తామిద్దరికీ తెలుసు. దానిని తొలగించే

ప్రయత్నమేమీ చేయాలనే ఉద్దేశం లేదిద్దరికీ. మరి పీరు తననెందుకిలా హెచ్చరిస్తున్నారు? అసలు రామారావుకు తమ మీద ఏ అనుమానం లేదుకదా! తన ప్రవర్తనలో పొరపాటు ఏముంది? ఇప్పుడు రామారావు, లలిత ఫారెన్ వెళ్ళిపోతున్నారు. ఎన్నాళ్ళుంటారో అక్కడ తెలియదు. ఎట్లా కాదన్నా ఆరు నెలలుండవచ్చు. లలితకు నిజంగా అనారోగ్యంగా ఉందని అంకుల్ ఎందుకు నమ్మడంలేదు? అంకుల్ చాలా తెలివిగలాయన. ఆయన తనతో అబద్ధం చెప్పరు. లలితా తనకు చాలా సన్నిహితురాలు. ఆమె ప్రవర్తనలో నిజాయితీ ఉంది. ఆమె విషయం తనకు బాగా తెలుసు. ఏమిటీ చిక్కుముడి? దీనిని విప్పడం ఎలా? దీనికి ఆది, అంతం ఏమిటి? వాళ్ళు స్టేట్సు నుండి వచ్చిన తర్వాత విషయమంతా స్పష్టమవవచ్చు' అనుకున్నాడు ప్రభాకర్.

రెండు రోజుల తర్వాత రామారావు ప్రభాకర్‌కి ఫోన్ చేశాడు.

"ప్రయాణం నిశ్చయమయింది. నా ఫ్రెండ్ ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వచ్చేయమన్నాడు. మా ఇద్దరికీ పాస్‌పోర్టు ఉంది. త్వరలోనే ప్రయాణానికి డేట్ ఫిక్స్ చేస్తాను. లలితకూ ఇప్పుడే ఈ విషయాన్ని చెప్పాను. తనకూ ఈ ప్రయాణం ఎంతో ఇష్టంగా ఉంది. ఈసారి తప్పకుండా లలిత ఆరోగ్యం బాగుపడుతుందనే ఆశ కలుగుతోంది నాకు" అన్నాడు రామారావు— స్వరంలో ఎంతో ఆశ నింపుకొని.

"నాకూ అలానే అనిపిస్తోంది" ప్రభాకర్ అన్నాడు.

ఫోన్ విన్న తర్వాత ప్రభాకర్ ఆలోచన ఇంకొంచెం డీప్‌గా మారింది. ఆలోచన అనేది చాలా విచిత్రమైనది. ఆలోచనా విధానాన్నిబట్టే మనిషి ఆలోచనను చదవవచ్చు. మనస్సు సరైన స్థితిలో లేనివారి ఆలోచనలో స్థిరత్వం ఉండదు. ఆలోచనా విధానం అనేది చిన్నతనంలోనే ఏర్పడుతుంది. ఆలోచనల్లో ఆరోగ్యం, అనారోగ్యం రెండూ ఉన్నాయి. ప్రభాకర్ సాధ్యమైనంతవరకు తన ఆలోచనను ఎనలైజ్ చేసుకుంటూ దానిలో ఏమయినా అసందర్భం ఉంటే తొలగించడానికి ప్రయత్నిస్తాడు. లలిత ప్రయాణం స్థిరపడ్డదీ అని విన్నప్పటి నుండి మనస్సులో ఏదో ముల్లు గుచ్చుకో సాగింది. లలిత ఎవరు? ఆమె, ఆమె సంసారం అంతా వేరు. ఆమెకూ, తనకూ ఏ సంబంధం లేదు. ఆమె వెళ్ళిపోతుందంటే తనెందుకు బాధపడాలి? ప్రేమ, స్నేహం అనేవి భావాలు. భావానికి రూపం లేదు. కాని ఆ భావ ఫలితాలకు మాత్రం రూపం ఉంది. ఆ భావాన్ని గుర్చి తెలియనివారు ఆ భావ ఫలితాన్ని చూసి అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తే అది ఏమర్థమవుతుంది? అర్థం కానప్పుడు దానిని వ్యామోహం కింద తేల్చేస్తారు. భావం మనోజనితం. మనస్సు పెంపుదలతోనే అది పెరుగుతుంది. అదే దానికి తల్లీ, దండ్రీ అన్నీను. అదే దానికి ఇల్లూ స్వర్గం కూడా! మరో ఇతర పదార్థం కలయిక ఉండదు. కాబట్టి ఏ భావం, ఎవరి మనస్సులో ఎప్పుడు, ఎలా పుడుతుందో, ఎందుకు పుడుతుందో కూడా ఊహించలేము. అది మనిషికి అంతుబట్టని ప్రకృతి వైచిత్రి. మనస్సు ఆరోగ్యం మీద భావం ఆరోగ్యం ఆధారపడి వుంటుంది. అసలు మనస్సు

అంటే ఏమిటి? మనస్సులో మూడు భాగాలున్నాయి. 'ఇడ్'లో అన్ని కోరికలూ గూడు కట్టుకొని ఉంటాయి. ఆ కోరికలకు తీరడమే ముఖ్యం కాని విచక్షణ ఉండదు. సమయాసమయాలు పాటించవు. ఈగో ఇడ్‌కన్నా నాగరికమైంది. కేవలం తనసుఖాన్ని గూర్చేకాకుండా సమాజాన్ని గూర్చి కూడా ఆలోచిస్తుంది. సూపర్ ఈగోలోని కాన్షస్ అసంగతమైన, అసంబద్ధమైన కోరికలను ఎంతగా చేయాలనిపించినా సమాజం హర్షించదు గాబట్టి ఇడ్ చెంపలు వాయగొట్టి చెవులు మూస్తుంది. ఈగో ఐడియల్ అనుకరణ ద్వారా మానసికంగా, శారీరకంగా ఎదగడానికి తోడ్పడుతుంది.

ప్రభాకర్ ఆలోచనలలో మునిగిపోయి అలానే కుర్చీలో కూర్చునే నిద్రపోయాడు.




లలిత చంద్రమోహన్ ఆఫీసుకు వచ్చింది. "షాపింగ్ ఉంది ప్రభా! రాముని రమ్మంటే నిన్ను తీసుకొని వెళ్ళమన్నాడు" అన్నది.

చంద్రమోహన్ కూడా ఆఫీసులోనే ఉన్నాడు. అతడీ మధ్య లలితను చూసి చాలా రోజులయింది. "ఏమిటండీ మీరు మరీ చిక్కిపోయారు?" అడిగాడు.

లలిత నవ్వి ఊరుకుంది. ప్రభాకర్ జూనియర్ కాలేజిలో లెక్చరర్ పోస్టుకు అప్లికేషన్ రాస్తున్నాడు. అంకుల్, చంద్రమోహన్ గూడా ప్రభాకర్ శ్రీపురంలో ఉండటాన్ని వ్యతిరేకించారు. కాని చంద్రమోహన్‌ని మాత్రం ఎలానో ఒప్పించాడు. ఒప్పించడం అంటే చంద్రమోహన్ తన అప్లికేషన్‌ని రికమెండ్ చేయాలన్నమాట. ఆ కాలేజీ కరస్పాండెంట్‌కి అంకుల్ సన్నిహిత మిత్రుడయితే చంద్రమోహన్ లీగల్ ఎడ్వయిజరు.

అంకుల్‌కి నచ్చచెప్పే బాధ్యత కూడా చంద్రమోహన్ పైనే పెట్టాడు ప్రభాకర్. చంద్రమోహన్ ఇరుకున పడ్డాడు. ఎలా చెప్పాలో అతడికి అర్థంకాలేదు. అసలు డాక్టర్‌గారికి ప్రభాకర్ మరో క్షణం కూడా అక్కడ ఉండటం ఏమాత్రం ఇష్టంలేదు. అదేమాట ప్రభాకర్‌తో ఆయన అన్నారు కూడా.

"ఈ సమస్యతో నీవిక్కడ ఉండటం నాకేమాత్రం నచ్చలేదు"

"ఇక సమస్య ఏముంది అంకుల్? వాళ్లు వెళ్ళిపోతున్నారుగా"

ప్రభాకర్‌కి ఈ విషయం మరీ బాధాకరంగా తయారయింది. వీళ్ళు తమను ఎంత నీచంగా ఊహిస్తున్నారు! అతడికసలు ఆ ఊహే చాలా అసహ్యంగా ఉంది. మానవుడు తనబుద్ధితో, విజ్ఞానంతో ఉన్నతస్థితిని చేరుకుంటున్నా, ఈ ఇన్‌స్టింక్ట్సలో జంతువుకన్నా చాలా హీనంగా తయారవుతున్నాడు. అదే విషయాన్ని చాలా ఘాటుగా చంద్రమోహన్‌తో అన్నాడు. అతడి ఆవేశానికి చంద్రమోహన్ చాలా నొచ్చుకున్నాడు.

"మనిషి జంతువుకాదని ఎవరన్నారు? అతడికీ బైలాజికల్ నీడ్స్ ఉన్నాయి. అవి

ఉండటం అసహ్యం ఎలా అవుతుంది?''

"ఉండటం అసహ్యం కాదు. చీకట్లు కమ్ముకోగానే కన్పించి వెలుగులో అదృశ్యమయ్యే వీసస్‌లా అతడు ఏ చిన్న విషయంలోనైనా బయటపడిపోతున్నాడు. వాటికి తన విజ్ఞానాన్ని బానిస చేశాడు'' ప్రభాకర్ ఆవేశంగా అన్నాడు.

''విజ్ఞానం కేవలం సెకండరీ ఫాక్ట్.''

ప్రభాకర్ అప్లికేషన్ రాస్తూ అవన్నీ గుప్త చేసుకొని తనలో తాను నవ్వుకున్నాడు.

"ఏమిటి నవ్వుతున్నావు? ఏమన్నా కథ రాస్తున్నావా?'' లలిత అడిగింది.

''కాదు అప్లికేషన్''

"దేనికి?''

"ఇక్కడ జూనియర్ కాలేజీలో పొలిటిక్స్ లెక్చరర్‌కి వేకెన్సీ ఉందని.." చంద్రమోహన్ అందుకున్నాడు. "వాళ్ళనాన్నగారు హైదరాబాద్ వచ్చేయమంటున్నారు. పరీక్షలయిపోయినవి కదా!

"హైదరాబాద్‌లోనే ఉద్యోగం చూద్దాం అని ఆయనంటారు. ఇతగాడేమో ఇక్కడే ఉద్యోగం చేస్తానంటున్నాడు."

అతడి మాటల్లో తన మీద నేరారోపణ లీలగా ధ్వనించింది లలితకు. చాలా బాధపడ్డది. కాని ముఖాన చిరునవ్వు చెరగనీయకుండా-

"అవును ప్రభా! నీవు హైదరాబాద్ వెళ్ళడమే బాగుంటుంది. అక్కడే ఉద్యోగం చూసుకుంటే బాగుంటుంది. ఇక్కడ నీకు బెటర్ ప్రాస్పెక్ట్స్ ఏముంటాయని" కొంచెం వేగంగా అన్నది.

ప్రభాకర్ ఎవరి మాటలకూ సమాధానమివ్వలేదు. కనీసం విన్నట్లు సూచనగా తలైనా ఎత్తలేదు. అప్లికేషన్ రాయడం పూర్తి చేసి, దాన్ని మరోసారి చదివి, చంద్రమోహన్‌కిచ్చి లలితతో "పద" అన్నాడు.

ఇద్దరూ చీరలు కొనడానికి వెళ్ళారు.

"ప్రభా! నీవు నిజంగా ఇక్కడే ఉండదలచుకున్నావా?" అడిగింది.

"ఉఁ. నన్నీ ఊరు బాగా ఆకర్షించింది" అన్నాడు

"కాని హైదరాబాద్‌లో నీవాళ్ళందరూ ఉన్నారు..."

ప్రభాకర్ ఆ సంభాషణ పొడిగించదలచుకోలేదు. ఇద్దరి మనస్సులో ఏవో ఆలోచనలు, ఏదో చెప్పాలని ఆత్రుత. కాని ఎవరి భావాలకూ మాటలు రావడం లేదు.

లలిత కొన్ని చీరలు, ఇంట్లోకి అవసరమైన ఇతర వస్తువులు కొన్నది. షాపింగు పూర్తయ్యేసరికి ఒంటి గంటయింది.

"హోటల్‌లో భోంచేద్దాం" అన్నది.

ఇద్దరూ హోటల్‌కి వెళ్ళారు. ప్రభాకర్ అంత ఉత్సాహంగా లేకపోవడం గమనించి "ఏమిటి ప్రభా! అలా ఉన్నావు?" అడిగింది లలిత.

''ఏమీలేదు'' పొడిగా అన్నాడు.

''నీ ఉద్యోగ విషయమా''

''ఉఁ."

''నిజం చెప్పు. నీ ఉద్యోగ విషయమేనా? మా ప్రయాణాన్ని గూర్చి కాదూ?" ప్రభాకర్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది.

ప్రభాకర్ చూపులు తిప్పుకున్నాడు. లలిత ఇలా మాట్లాడాలని ఎప్పటినుండో అనుకుంటున్నాడు. 'నా కొరకు కదూ నీవు బాధపడుతోంది' అనీ అడగాలని కోరుకుంటున్నాడు. అలా అడిగితే బాధ

తీరేలా గట్టిగా ఏడ్చేయాలనుకున్నాడు. తీరా లలిత అలా అడగగానే పట్టుబడిపోయినట్లు బెరుగ్గా చూపులు తిప్పుకున్నాడు. ఆ ఒక్క మాటతోనే ఏడిస్తే గాని తీరదనుకున్న బాధ నెమ్మదించింది. 'లలిత చక్కగా గెస్ చేస్తుంది. గర్ల్స్ ఆర్ క్లెవర్' అనుకున్నాడు.

ఇద్దరూ హోటల్ కి వెళ్ళారు. ప్రభాకర్‌కి చాలా దిగులుగా ఉంది. మనిషి స్వభావమే ఇంత. ప్రస్తుతంతో అతడు తృప్తిపడడు. భవిష్యత్ ప్రస్తుతమున్నంత కాంతివంతంగా ఉండదని ముందే తెలిస్తే ప్రస్తుతమున్న కాంతిని అనుభవించలేడు. రాబోయే అంధకారాన్ని తలచుకొని ఈ వెన్నెలను మర్చిపోయి విలపిస్తాడు. లలిత తనతోనే ఉన్నది ఇప్పుడు అనే ఆనందాన్ని లలిత తనకు దూరంగా వెళ్ళిపోతోంది అనే బాధ అధిగమించింది ప్రభాకర్‌ని.

"సరిగ్గా తినడంలేదేం?" అన్నం కెలుకుతున్న ప్రభాకర్‌ని మందలించింది లలిత.

'కొన్నాళ్ళవరకు ఈ ఆప్యాయత ఇక కరువేమో' దిగులుగా అనుకున్నాడు ప్రభాకర్.

ఎలానో భోజనం అయిందనిపించి ఇద్దరూ హోటల్ నుండి బయటకు వచ్చారు.

"నీ ఇంటికి వెళదాం పద" అన్నది.

ప్రభాకర్ చాలా సంతోషించాడు. లలిత వేసిన ప్రతి అడుగూ, ఆమె అడుగు తాకిన ప్రతి ఇసుకరేణువూ చాలా అద్భుతంగా కన్పిస్తున్నాయి అతడికి. ఇన్నాళ్ళు అంతర్గతంగా ఉన్న అతడి ఆరాధన ఆమె దూరమవుతోంది అని తలుచుకునే కొలదీ పెల్లుబుకుతోంది. అతడికే అర్థమవడంలేదు తనస్థితి. అతడి మనస్సు అనేక రకాల భావసమ్మేళనల సంఘర్షణలో తీరిక లేకుండా ఉన్నది. అతడిని అతడి మనస్సు గూర్చి ఏమడిగినా వివరించి చెప్పగలిగే స్థితిలో లేడు. 'అసలు తనెందుకు లలితను కలుసుకున్నాడు? ఇప్పుడేం జరుగుతోంది?' తనకు తానే ఆశ్చర్యపోతున్నాడు.

లలిత ఏదో చెపుతోంది. అతడు 'ఊ' కొడుతూ వింటున్నాడు గాని ఆమె చెప్పే దానిమీద ధ్యానం నిలపడం లేదు. లలిత అతడి పరధ్యానాన్ని చాలా సేపటి నుండి గమనించి గమనించి చివరకు "అంతేనంటావా?" అన్నది.

"అంతే, అంతే" అన్నాడు.

"ఏమిటి అంతే?"

"అదే, నీవు చెప్పినదే సరైనది"

"అసలు నేనేం చెప్పాను?"

"అదే... అది... అది" అంటూ నీళ్ళు నమలసాగాడు.

అతడి అవస్థ చూసి నవ్వాపుకోలేకపోయింది లలిత. "ఏమిటి అది ప్రభా?"

విరగబడి నవ్వుతున్న లలితను చూసి ఆశ్చర్యపోయాడు. సాధారణంగా లలిత అంతగా నవ్వదు. చాలా అరుదుగా ఇంతలా నవ్వుతుంది. కొందరు సంతోషం పట్టలేక గట్టిగా నవ్వుతారు. తమ బాధను ఎదుటివాళ్ళకు తెలియనీయగూడదనుకున్నపుడు కూడా గట్టిగా నవ్వుతారు. ఏ సమాధానం చెప్పడం ఇష్టంలేనపుడు లేదా వ్యతిరేకసమాధానం చెప్పడం ఇష్టం లేనపుడు గూడా నవ్వుతారు. ప్రభాకర్‌కి లలిత మనసులో ఏముందో తెలుసు. అయితే దానికి రుజువులేదు, ప్రమాణం లేదు. ఆమె మనస్సులోని మాటను, తను



కోరుకునే మాటను, స్పష్టంగా తెలుసు కోవాలని అతడి కోరిక. కాని అతడి కోరిక తీరడానికి లలిత ఏనాడూ అవ కాశం ఇవ్వలేదు. ప్రభాకర్ లలిత నవ్వును చూడగానే తను కోరుకుంటున్న ప్రమాణం దొరికిందని తృప్తిపడ్డాడు.

లలిత తన ఇంటికి వస్తుందంటేనే ప్రభాకర్‌కి భయం. ఒక్క బ్రహ్మచారి నూరు కోతులను సమానమన్న నానుడి ప్రభాకర్ ఇల్లు చూస్తే తెలుస్తుంది. అత డికి తన వస్తువులను ఎలా సర్దుకోవాలో తెలియదు. ఖరీదయిన బట్టలు, పుస్తకాలు అతడి బాధ్యతకే నాలుగు రోజులు వది లేస్తే రంగులు వెలిసిపోయి, చినిగిపోయి ఆ వస్తువులు ఎన్ని సంవత్సరాల క్రింద టివో అనే అనుమానం వస్తుంది. చంద్ర మోహన్ ఇల్లు ఆ పెవీథిలోనే! అతడిఇంట్లో ఉండే పనిపిల్లవాడే ప్రభాకర్‌కి కూడా సహాయం చేస్తుంటాడు. రోజూ ఉదయం, సాయంకాలం వచ్చి అడ్డదిడ్డంగా పడి

ఉన్న పుస్తకాలు, బట్టలు నీటుగా సర్ది పెడుతుంటాడు. అతడు రెండు రోజులు గనక రాకపోతే ప్రభాకర్ ఇల్లు రైల్వే గోడౌన్‌లా ఉంటుంది.

లలిత కిందపడివున్న పుస్తకాలను తీసిసర్దుతూ సన్నసన్నగా చివాట్లేసింది. "ఇలా అయితే ఎలా ప్రభా? ఇక ఎప్పుడు నేర్చుకుంటావు సర్దుకోవడం? వయస్సు వస్తున్నా బాధ్యత తెలియదు"

ఆ ఇంటిని ఒక కొలిక్కి తెచ్చేటప్పటికి ఆమెకు ఆయాసం వచ్చింది కూడా.

"ప్రభా! ఇలా అయితే నిన్ను చేసుకునే ఆ బంగారు తల్లి ఎవరోగాని మూడో రోజునే పుట్టింటికి పారిపోయి ఆ ఇల్లును సర్దడం నాకు చేతకాదు కాబట్టి విడాకులు ఇప్పించండి అని కోర్టుకు విన్నపం చేసుకుంటుంది" అన్నది నవ్వుతూ. ఆమె నుదుటి మీద స్వేద బిందువులు మెరుస్తున్నాయి ఆమె నవ్వులో.

"మన కోర్టులు విడాకులు అంత త్వరగా ఇవ్వవులే" ప్రభాకర్ కూడా నవ్వుతూ అన్నాడు.

"అలా ఏం భరోసా పెట్టుకోకు. ఆ జడ్జి వచ్చి నీ ఇల్లు చూసి ఆ అమ్మాయి మాటల్లోని నిజాన్ని గ్రహించి తక్షణమే విడాకులు మంజూరు చేసాడు"

కొంచె మాటల తేడాతో ఇదే అర్థాన్ని ధ్వనించేటట్లు ఎప్పుడూ ప్రభాకర్ అమ్మా నాన్న అంటారు ప్రభాకర్ గదిని చూసి.

ప్రభాకర్ మనసారా నవ్వుకున్నాడు. "చాలా అలసిపోయినట్లున్నావు" అంటూ యాపిల్సు ప్లేటులో పెట్టుకొని వచ్చాడు. షెల్పు నుండి నైఫ్ తీసి, ప్లేటు, నైఫ్ టీపాయి మీద పెట్టాడు. లలిత ఆ కత్తిని అటూ ఇటూ తిప్పిచూసి "ఏ మ్యూజియం నుండి తెచ్చావు?" అన్నది.

ప్రభాకర్ నవ్వుతూ "కాంచెం బ్లంటుగా ఉంది. అంతేలే. ఇంత మాత్రం దానికే మ్యూజియం వరకు వెళ్ళాలా?" అన్నాడు.

లలిత చాలా సున్నితంగా యాపిల్ చెక్కు తీస్తుంటే "మరేం ఫర్వాలేదు. గబగబా తీసేయవచ్చు. బలవంతంగా కోసుకుంటే తప్ప అది గాయంచేయదు" అన్నాడు.

లలిత మౌనంగా ఆలోచిస్తూ యాపిల్ కోస్తోంది. ప్రభాకర్ ఏదో వెదుకుతున్నాడు. ఎందుకో తిరిగి చూసిన ప్రభాకర్‌కు లలిత వేలు తెగి ఎర్రటి రక్తం బొట్టు బొట్టుగా జారడం కన్పించింది.

"అరెరే" ప్రభాకర్ దూదితో గాయం తుడిచాడు. గాయం లోతుగా తెగింది. దానిపై బాండ్ ఎయిడ్ వేస్తూ "ఇంత మొద్దుకత్తి నీ చేతిని కోసిందంటే నీ ఆలోచనలు ఎంతబలంగా నీ మనస్సులో స్థావరమేర్పరచుకుంటున్నాయో అర్థమవుతోంది" అన్నాడు. లలిత అంత పరధ్యానంగా ఉన్నందుకు విసుక్కున్నాడు. "కొంచెం జాగ్రత్తగా ఉండకూడదూ?" ఆ ఎర్రటి రక్తం అతడి గుండెపై కఠినంగా జారుతోంది.

లలిత మెల్లిగా నవ్వింది. "ఇటువంటి వాటికి అర్థం ఏమని చెపుతారో తెలుసా?" అన్నది.

"ఓహ్... వీటికి అర్థాలు కూడా ఉన్నాయా? నీవు అతిగా ఆలోచిస్తున్నావు"

"ఏమో నీవు ది స్కార్లెట్ లెటర్

చదివావా ?"

"లేదు. నీవు చెపితే విన్నాను గానీ, దానికి దీనికి సంబంధం ఏమిటి ?"

"అందులో ఆ మినిస్టర్ ఎందుకు ఆత్మహింసకు పూనుకున్నాడు? తనను తాను చాలా క్రూరంగా ఎందుకు హింసించుకున్నాడు? తప్పు చేశానన్న భావనే కదా?"

ప్రభాకర్ తల పట్టుకుని కూర్చున్నాడు. లలిత ఏవేవో ఊహించుకుంటోంది. ఆ ఊహలను తన ప్రవర్తనకు అన్వయించుకుంటోంది.

"లలితా! నీ బుర్ర చెడిపోయింది. ఇవేం ఆలోచనలు! ఇంకొన్నాళ్ళుపోతే నీకు పట్టిన ఈ పిచ్చె నాకూ పట్టేటట్లుంది. ఆ కథలో అతడిది డైరక్టు యాక్షన్. అతడికి,నీకూ పోలిక ఏమిటి?"

"మమ్మీ ఎప్పుడన్నా కోపం పట్టలేకపోతే నన్ను రెండు దెబ్బలు వేసేది. నేను వెక్కి వెక్కి ఏడుస్తుంటే ఆమె బెడ్‌రూంలోకి పరుగెత్తుకు వెళ్ళి తన కోపానికి చిన్నపిల్లను దండించానే అన్న బాధతో తన చెంపలు తానే గట్టిగా వాయించుకునేది. అది ఆమె తన తప్పుకు తానే శిక్ష విధించుకునే తీరు".

"చూడు లలితా! ప్రతి చిన్న విషయం వెనుకా ఎంతో పెద్ద హిస్టరీ ఉందనుకోకు. ఇవి చిన్న చిన్న పొరపాట్లు. సర్వసామాన్యం. పొరపాట్లు ఎవరికైనా వస్తాయి. వాటిని గోరంతలు కొండంతలుగా చేసి ఊహించుకోకు. మనస్సు పాడుచేసుకోకు" అన్నాడు ప్రభాకర్.

అతడికి ఆమె భావన అర్థమైంది. ఆమె ఈ విషయాన్ని ఎత్తడం ఇదే మొదటిసారి కాదు. ఒకసారి ది స్కార్లెట్ లెటర్ కథ చెపుతూ ఈ 'సెల్ఫు ఇంజ్యూరీ' గూర్చి చెప్పింది. ఆ మినిస్టర్ తను చేసిన పని తప్పు అని దానికి తానే శిక్ష విధించుకోవాలని ఆత్మహింసకు పూనుకుంటాడు.

అనుకోకుండా జరిగే ఈ హింసలు కొన్ని సమయాలలో ఆత్మ శిక్ష క్రింద చెపుతారు. కాళ్ళు, చేతులు విరగ్గొట్టుకోవడం, జారిపడటం, ఇలా లలితలా బ్లేడుతోనో, నైఫ్‌తోనో కోసుకోవడం అప్పుడప్పుడు సెల్ఫ్ పనిష్‌మెంట్ కిందే వస్తాయి. అది తను చేశాననుకొన్న తప్పుకో, చేసిన తప్పుకో తగిన శిక్ష అనుకుంటారు.

అయితే లలిత అలానే అనుకుంటోందా? ఆమె తెలివిగలది. తన ఆలోచనలను తాను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. లలిత తనతో ఆమె పరిచయం తప్పుగా భావిస్తోందా? రామారావుకు తాను న్యాయం కూర్చలేకపోతున్నాను అని బాధ పడుతోందా? ఆమె మనస్సులో ఇంకా ఏం ఆలోచనలు ఉన్నాయి? మొన్న బాత్‌రూంలో జారిపడి కాలు బెణికిందన్నది. ఈరోజు ఇలా... వీటికి ఆమె మనస్సులో ఉన్న గిల్టీ కాన్షస్సే కారణమా?

లలితను ఆలోచించవద్దని చెప్పి తను ఆలోచించకుండా ఉండలేకపోతున్నాడు ప్రభాకర్. అతడు లలితవైపు చూశాడు. ఆమె మౌనంగా యాపిల్ తింటోంది. ఆమె ముఖం చూస్తుంటే, ఆ పరధ్యానంగా తినడం చూస్తుంటే ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తోందని తెలుస్తోంది.

ప్రభాకర్ పేపరు చదవడం ఆపి, దానిని టేబిల్‌పై పడవేసి "ఏమిటంత

దీర్ఘంగా ఆలోచిస్తున్నావు" అన్నాడు లలితతో.

లలిత "ఊఁ?" అని అతడివైపు ప్రశ్నార్థకంగా చూసింది. తన ఆలోచనల నుండి తేరుకుంటూ "మనిషిని మనిషిని కలిపే శక్తి ఏమిటి ప్రభా?" అన్నది.

ప్రభాకర్ లలిత వైపు పరీక్షగా చూశాడు. అతడు ఎప్పుడూ లలిత వింత మనస్తత్వానికి ఆశ్చర్యపోతూ ఉంటాడు. మనిషన్నవాడికి ఆలోచన సహజం. సామాన్యుడి ఆలోచనలు నిత్యావసరాల చుట్టూ తిరిగితే రుషుల ఆలోచనలు తత్వ చింతనపై కేంద్రీకరింపబడి ఉంటాయి. కాని లలిత సామాన్యుల మధ్య పుట్టి పెరిగి, సామాన్యంగానే ఆలోచించడం నేర్చుకొని భిన్నధోరణిని ఎన్నుకుంది. ఆమె ఆలోచనలు దేనికి ఉద్దేశింపబడి ఉన్నాయో ఆమె చెప్పేటంత వరకు ప్రభాకర్‌కి అర్థం కాదు. మొదట్లో ఆమె తత్వం అర్థంకాక ఆమె మాటలను, ఆలోచనలను అపార్థం చేసుకున్నాడు. కాని క్రమేపీ ఆమె ధోరణికి అలవాటు పడిపోయి ఆమె ఆలోచనలను ఊహించడం మానేసి ఆమె చెప్పేది వినడం, అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం చేస్తున్నాడు.

"నాకు తెలియదు. చెప్పు"

"ప్రేమ కదూ? అదే వైటల్ ఫోర్స్ కదూ?"

"ఏమో. ఈ లోకంలో ప్రేమించడం తెలియనివారు కూడా ఉన్నారు"

"ఉన్నారా? నాకు తె లి య దు. ఉన్నారా...ఊహించలేను. నేను అనుకోవడం తమ ప్రేమను వ్యక్తం చేయలేని వారు కొందరున్నారని. కాని ప్రేమంటే తెలియని మనిషి ఉంటాడా? అలా అయితే ప్రేమించలేని మనిషి అనుభవించే ఒంటరితనం ఈ ప్రపంచంలో మరేప్రాణీ అనుభవించదు".

ప్రభాకర్ నవ్వి ఊరుకున్నాడు.

"ప్రభా! నీవు చాలా గొప్పవాడివి" హఠాత్తుగా అన్నది.

"గొప్పవాడినా?" నవ్వాడు. "ఏ విషయంలో? ఎవరికన్నా?" సరదాగా నవ్వి అడిగాడు.

"రాము కన్నా నీవు చాలా గొప్పవాడివనిపిస్తోంది"

ప్ర భా క ర్ చిన్నబుచ్చుకున్నాడు. "అలా పోలిక తీసుకురావద్దని చాలా సార్లు చెప్పాను'

ఆమె నవ్వింది" అలవాటయిపోయింది. ప్రభా! క్షమించు"

"ఏ విషయంలో గొప్ప?"

ఆమె కన్ఫ్యూజయిపోయింది. "అదే నాకు తెలియడంలేదు. ఆస్తి, అంతస్తు కాదు, చదువుకాదు, అందంకాదు. రాము నన్ను ప్రాణంగా ప్రేమిస్తాడు. మరి ఏ విషయంలో? నాకు తెలియడంలేదు. కాని మరి దేనిలోనో నాకు తెలియని, చెప్పలేని విషయంలో నీవు రాముకన్నా అధికుడివి" తీర్మానించి చెప్పింది.

"మంచిది. ఏ విషయంలోనో తెలియదుగాని మొత్తానికి నేను గొప్పవాడి నంటావు" లలితవైపు చూస్తూ అన్నాడు. లలిత నానాటికి తీసిపోతోంది. కళ్ళక్రింద నల్లటి వలయాలేర్పడ్డాయి. కళ్ళల్లో కూడా కాంతి పౌర్ణమి దాటిన చంద్ర కళలా క్షీణించిపోతోంది.

కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకొని రెండు చేతులూ తలకింద పెట్టుకొని

అన్నాడు "సైట్సు వెళ్ళిపోతున్నారుగా"

"ఊఁ!" నిర్లిప్తంగా అన్నది.

"మరలా ఎప్పుడు రావడం?"

"నీ పెళ్ళెప్పుడు" చిలిపిగా అన్నది.

ప్రభాకర్ ఉలిక్కిపడి చూశాడు. ఆమె అన్న మాటలో అతడు ఉలిక్కిపడాల్సినంత తీవ్రత, విచిత్రం ఏమీ లేదు. ఇందాక కూడా ఒకసారి ఆమె అతడి పెళ్ళి సంగతి ఎత్తింది. అప్పుడూ ఏమనిపించలేదు. లలిత ఇప్పుడూ సరదాగానే అన్నది ఆ మాట. ఆ మాటలో అతడు పెళ్ళి చేసుకోడని, చేసుకోకూడదనే అర్థం ఏమీ ధ్వనించలేదు. కాని మనసు తీర్చిదిద్దుకుంటున్న రంగుల కలమీద హఠాత్తుగా చీకటి తెర వాలినట్లనిపించింది. ఎందుకు? ఆ భావం తనకెందుకు కలిగిందో అతడికే తెలియదు. కొంచెం సేపటివరకు మాట్లాడలేదు. మాట్లాడితే తన కంఠంలో ధ్వనించే జీరను ఆమె గుర్తుపడుతుంది. కొంచెంసేపు ఆగాడు మాట్లాడటానికి. తనను తాను సంబాళించుకొని అన్నాడు "పెళ్ళా?"

"ఏం? పెళ్ళే. చేసుకోవా? కనీసం నాకు తెలియజేస్తావా?" అడిగింది నవ్వుతూ.

ఆమె వైపు చూశాడు. ఆ కళ్ళల్లో చిలిపితనం, చిరునవ్వు, అంతే!

"మరలా మీరు ఎప్పుడు వస్తారు?" అడిగాడు.

ఆమె ఓ క్షణం మాట్లాడలేదు. "మరలా నిన్ను చూస్తానని నా అంతరాత్మ చెపుతోంది. కాని ఇదే మన చివరి కలయిక అని మరేదో శక్తి దాని గొంతు నొక్కుతోంది. ఈ శక్తుల సంఘర్షణ నాకు తెలియడంలేదు. 'ఇక కలవము' అనే భావన నాకు చాలా దుర్భరంగా ఉంది ప్రభా" గద్గదికంగా అన్నది.

ప్రభాకర్‌కూ గొంతు పెగలలేదు. అతడి కళ్ళముందు ఈమధ్య లాబొరేటరీలో చూసిన కుందేలు మెదలింది. లలిత కూడా ఉంది పక్కనే. లాబొరేటరీ పరీక్షలకు కుందేళ్ళకు ఏవో ఇంజక్షన్లను ఇచ్చి బోనులలో ఉంచారు. లలిత చాలా సేపటి వరకు వాటినే చూస్తూ ఉండిపోయింది. అవి హుషారుగా అటూ ఇటూ కదలడం లేదు. మత్తుగా పడుకొని అమాయకమైన కళ్ళను అప్పుడప్పుడూ అటూ ఇటూ తిప్పుతూ చూస్తున్నాయి. లలిత కళ్ళలో నీరు చూసి ప్రభాకర్ కదలిపోయాడు.

"ఛ ఛ. ఏమిటది లలితా! ఇంత సెంటిమెంటల్ అయితే ఎలా?"

"కాని చూడు ప్రభా! ఎంత ఉత్సాహంగా, ఆనందంగా ఉండేవి! ఈ రోజు శక్తిని మర్చిపోయి ఆనందం అంటే అర్థం తెలియక, కత్తి కోతకు ఎదురు చూస్తూ మనిషి అలసత్వానికి బలికాబోతున్నాయి. డిసీజ్ టూ మచ్ ప్రభా! టూ మచ్"

"దాని నే అతిగా ఆలోచించడం అంటారు లలితా! వీటికన్నా మనిషి ప్రాణం విలువైనది. ఇటువంటి ప్రయోగాల వలనే కదా ఈరోజు ఇంత అభివృద్ధి చెందింది సైన్సు"

"డోంటాక్ నాన్సెన్స్ ప్రభా! ప్రాణం అనేది ఏదైనా ఒకటే. ప్రతి ప్రయోగానికి ఒకటి చొప్పున ఇలా చంపుకుంటూపోతే సైన్సు అభివృద్ధి చేయడానికి, మానవ ప్రాణ రక్షణ మందులను కనిపెట్టడానికి ఇంత పెద్ద ఎత్తున బలిజరగనక్కరలేదు"

లలితది చాలా సున్నిత మనస్తత్వం.

ఆమెకు ప్రపంచంలో ప్రేమ తప్ప మరే లక్షణం కన్పించదు. లలిత అలా బాధ పడుతూ ఉంటే అతడి అణువణువూ బాధతో మెలికలు తిరిగిపోయింది.

"అవేం మాటలు? నీకు ఆరోగ్యం చేకూరగానే తిరిగి వస్తామని రామారావు చెప్పారుగా" అనునయంగా అన్నాడు.

లలిత మౌనంగా అతడినే చూస్తోంది. ఆమె అంతరంగంలో ఎన్నో జ్ఞాపకాలు అలలవలె ఎగిసిపడుతున్నాయి. నీలాకాశం కింద విశాలమైన పచ్చిక బయళ్ళు, కొండల వెనుకనుండి బయటపడి సుళ్ళు తిరుగుతూ మబ్బుల మధ్య మాయమవుతున్న పొగమంచు, మెట్టతామర పూల మీద మంచు బిందువుల నుండి పరావర్తనం చెందుతున్న బాల భాస్కరుని కిరణాల ఇంద్రధనస్సుల విన్యాసాలు, దేవలోకం నుండి వినిపిస్తున్న గంధర్వ గానం...అనంతమై పృథివిని తన లాలనలోకి తీసుకుంటున్న అమ్మ ప్రేమ...

"ఏమిటలా చూస్తున్నావు?" అడిగాడు.

"ఏమీలేదు" మెల్లిగా నవ్వింది. "వస్తాను" అన్నది వెళ్ళడానికి లేచి నుంచుని.

"అప్పుడే?"

"వెళ్ళాలి" నవ్వి వెళ్ళిపోయింది.

లలిత వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయాడు ప్రభాకర్. 'అప్పుడే వెళ్ళిపోయింది' దిగులుగా అనుకున్నాడు. అతడికే తెలియదు ఆమె ఎంతసేపు ఉంటే తనకు తృప్తి ఉంటుందో. పరీక్షలయిపోయాయి. లలితను గూర్చి,తన ప్రస్తుత స్థితిని గూర్చి ఆలోచించసాగాడు. లలిత స్టేట్స్ వెళ్ళిపోతోంది. చాలా బాధగా ఉంది. అసలు ఆమెను గూర్చి తను ఆలోచించడం ఎందుకు? లలిత ఎదురుగా లేకపోతేనే ఏదో వెలితిగా ఉండే ఆమె కొన్నాళ్ళు కనిపించకపోతే? కంటికి దూరంగా వెళ్ళిపోతే? ఆమెను తను ప్రేమిస్తున్నాడా? ఆ మాట చాలా నీచమైనది ఆమెపై తనకున్న ఇష్టాన్ని వర్ణించడానికి. తనలో ఆమెపై ఇంత ఆరాధన దాగి ఉందా? ఆమె అంటే ఇంత అభిమానం ఏర్పడిందా తనకు? తన మనస్సు ప్రవర్తనకు చాలా ఆశ్చర్యపోయాడు ప్రభాకర్. తను ఎంత సౌందర్యారాశిని ప్రేమించాలని ఊహించాడు! సౌందర్యానికి ఒక లిమిట్ అంటూ ఏముంది? అసలు అందాన్ని కొలవడానికి కొలబద్ద లేదు. సృష్టిలోని ప్రతి వస్తువూ అందమైనదే! ఆ అందమంతా చూసే తీరులో, అనుభవించే తీరులో ఉంది. తనను లలిత వైపు అంత బలంగా ఆకర్షిస్తున్న ఆ శక్తి ఏమిటి? ఆమె కళ్ళల్లో ప్రస్ఫుటమయ్యే ఆ చల్లని ఆప్యాయతా? ఆ నిజాయితా? ఏమో ఇదంటూ ఇతమిద్ధంగా చెప్పలేకపోతున్నాడు ప్రభాకర్. లలిత వివాహిత. తనకంటే కనీసం ఐదేళ్ళన్నా పెద్ద వయస్సులో. ఆమెపై ఇష్టం పెంచుకొని ఎప్పుడూ ఆమె సాన్నిధ్యం కావాలంటే అది తప్పు కాదా? అది ఇమ్మొరాలిటీ కాదా? ఓహ్ ... ఈ ప్రపంచంలో మనిషి ఎంత అసందర్భంగా సృష్టించబడ్డాడు? ఈ అసందర్భం కూడా ఓ అందమేనా? కట్టడి తెలియని భావాలతో మనస్సు నింపుకొని తన చుట్టూ నీతి అనే గిరి గీసుకొని స్వయం బంధితుడయ్యాడు! లలిత మనస్సుని కూడా తను కోరకూడదు. మనసావాచా ఆమె, రామా

రావు ఒకటి. అన్నీ తెలిసీ తన మన
స్సెందుకిలా అరణ్య రోదన చేస్తోంది?
తను ప్రేమించకూడదా? ప్రేమించలేని
వాడు ఒంటరివాడు. మరి లలితను
ప్రేమించకూడదు. ప్రేమకు అంటరాని
తనం కూడా ఉందా? కంచెలు కూడా
ఉన్నాయా? బౌండరీస్ ఉంటే అది
ప్రేమ ఎలా అవుతుంది? లలితపై తనకు
గల ప్రేమకు నిర్వచనం ఏమిటి? తల్లీ
బిడ్డల, అన్నాచెల్లెళ్ళ, భార్యా భర్తల
ప్రేమలకు గల వ్యత్యాసమేమిటి? భావ
మొక్కటే కాని అనుభూతులు వేరు. ఈ
అనుభూతులకు మూలం ఏమిటి?
మనస్సు కాదా? మనస్సు జీవ వ్యాపా
రాలకనుగుణంగా భావ స్పందన
చేస్తుందా? మనస్సు ఎంత అద్భుతమైన
పదార్థం ఈ సృష్టిలో! భార్య భర్తకు
భిన్న రూపంలో దర్శనమిస్తుంది. తల్లి,
చెల్లెలు, నెచ్చెలి, భార్య అన్నీ తానై
తోస్తుంది. ఆ భిన్న రూప దర్శనం
కూడ ఓ అద్భుతమైన వరం! అంటే
ఏమిటి? లలితపై తనకు గల ఆరాధనకు
అర్థం ఏమిటి? ప్రశ్న చుట్టూ తిరిగి
తిరిగి మరలా మొదటికే వచ్చింది. ఏమిటి
అర్థం? ఓహ్... తల తిరిగిపోతోంది.




లలిత, రామారావుల ప్రయాణం తేదీ
నిర్ణయింపబడింది. రామారావు ప్రభాకర్‌కి
ఫోన్ చేసి 'వచ్చే ఆదివారం పిక్నిక్‌కి
వెళదాం' అన్నాడు.

లలిత వెళ్ళిపోతోంది. ఆమె దూర
మయ్యే రోజు దగ్గరవుతోంది. అతడికి
మనస్సులో చాలా దిగులుగా ఉంది.
మళ్ళీ చూడటం ఎన్నాళ్ళకో. ఇప్పుడు
ఈ పిక్నిక్‌కి వెళ్ళడం ఆమె ఆలోచనలకు
మరింత సన్నిహితమవడానికే దోహద
మిస్తుంది కాని ఆమెను మర్చిపోవడానికి
సహాయపడదు.

కనీసం రోజుకొక్కసారైనా ప్రభా
కర్‌ని పలుకరించకుండా ఉండని లలిత
వారం రోజుల నుండి ఫోన్ చేయడం
లేదు. ప్రభాకర్ ఫోన్ వద్దే కూర్చొని
అశాంతిగా ఎదురు చూస్తున్నాడు ఆమె
స్వరం వినడానికి. ఆమెను చూడాలని,
పలకరించాలని ఎంత ఉత్కంఠగా ఉన్నా
మనస్సు దిట్ట పరచుకొని ఆదివారం
కొరకు ఎదురు చూడసాగాడు.

ఆదివారం ఉదయమే రామారావు,
లలిత ప్రభాకర్ వద్దకు వచ్చారు. లలితను
చూసి నివ్వెరపోయాడు ప్రభాకర్. ఆకు
పచ్చని పట్టు చీర కట్టుకుంది. ఆకు
పచ్చ రంగు లలిత ఒంటిమీద చాలా
మెరుస్తుండేది. కాని ఈ రోజు ఆ చీర
కంకాళానికి చుట్టబెట్టినట్లుంది. ఆ కళ్ళు
జీవం కోల్పోయి గాజు గోళీల్లా మెరుస్తు
న్నాయి. అంతకు మించి మరేదో తీవ్ర
మైన మార్పు ఆమె ముఖంలో గోచ
రిస్తోంది. ఆ మార్పేమిటో ప్రభాకర్‌కు
అర్థం కాలేదు.

ప్రభాకర్ లలితను పలుకరించాలని
చాలా ప్రయత్నం చేశాడు. కాని ఒక్క
మాటా అతడి పెదవి దాటి రాలేదు.
ఏమాట ఆమెతో మాట్లాడాలన్నా అదేదో
కృత్రిమంగా అనిపించేది. ఎవరితోనో

మాట్లాడాల్సిన మాటలు మరెవరితోనో మాట్లాడబోతున్నట్లనిపించేది. అప్పటికీ ఒకటీ రెండు ప్రశ్నలు అడిగాడు. జవాబు 'ఊ, ఆ' అంతే.

కారు శ్రీముఖి తీరాన్ని దాటిపోతోంది. ప్రభాకర్ అన్యమనస్కంగా రామారావు చెప్పేది వింటూ వ్యూమిర్రర్‌లో నుండి లలితను చూస్తున్నాడు. ఆమె చాలా నిర్లిప్తంగా ప్రకృతిని చూస్తోంది. అప్పుడప్పుడూ తల తిప్పి ప్రభాకర్ వైపు చూస్తోందిగాని ఏమీ మాట్లాడటం లేదు. ఆ చూపు చాలా నిశ్శబ్దంగా ఉంది. ఆ చూపులో ఏదో చెప్పాలన్న మూగ తపన ఉంది. కాని ఆమె పెదవి కూడా కదల్చడం లేదు. ఆమె తన వైపు చూసి



నవ్వుతున్నా ప్రభాకర్ కూడా ఆమె వైపు చూస్తున్నాడు ఆమె భావాలను చదవడానికి. అతడికి ఆమెలోని మార్పేమిటో అంతుబట్టడం లేదు. చటుక్కున తను ఎప్పుడో చదివిన "ద పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రే" గుర్తుకు వచ్చింది. ఆత్మలో వచ్చిన మార్పులన్నీ ఒక్కసారిగా అతడి ముఖంలోకి వస్తాయి. అలానే లలిత ఆత్మలో మార్పు వచ్చిందా? ఆమె తన కేదో చెప్పాలని ప్రయత్నిస్తోంది కాని చెప్పలేకపోతోందని అర్థమయింది ప్రభాకర్‌కి. ఆమెను అదేమిటో అడుగుదామని పించిందిగాని ప్రభాకర్ ఆ ధైర్యం చేయలేకపోయాడు. ఆమెను ఏమీ ప్రశ్నించడానికి అతడికి మనస్సు రావడం



లేదు. చేతకానితనాన్ని విధి అందామా? ప్రభాకర్ ధైర్యంచేసి లలితను ఏమయినా అడిగి ఉంటే ఆమె తపన అర్థమయి ఉండేదేమో! జరగనివి అలా జరిగి ఉంటే ఎంత బాగుండేది అని అనుకోవడం మనిషి తన అసమర్థతను సమర్థించుకోవడానికి వేసే మొదటి అడుగు. ఆ పిరికితనంను జీవితాంతం 'విధి' అని అనుకోవడం మినహాయించి ఏమీ చేయలేక పోయాడు ప్రభాకర్.

కారు కోట చేరింది. ఆ ఊళ్ళో చూడాల్సిన ముఖ్య ప్రదేశం అదే.

ముగ్గురూ నడుస్తున్నారు. రామారావు ఆ ప్రదేశాల గూర్చి, వాటి చారిత్రిక విషయాల గూర్చి చాలా ఉత్సాహంగా చెప్పుకపోతున్నాడు. అతడు లలిత చేయి పట్టుకొని నడుస్తున్నాడు. ప్రభాకర్ వారికి కొంచెం ఎడంగా నడుస్తూ అతడి మాటలు వింటున్నాడు. లలిత ఏమీ మాట్లాడటం లేదు. ప్రశ్నలకు 'ఉ,ఆఁ' మించి సమాధానాలేమీ చెప్పడం లేదు. వీలయినప్పుడల్లా ప్రభాకర్ వైపు చూస్తోంది. ఆ మూగ అభ్యర్థన అర్థం తెలియక ప్రభాకర్ మనస్సు వలలో చిక్కిన పక్షిలా గిలగిల కొట్టుకుంటోంది.

రామారావు తమ ప్రయాణం గూర్చి చెప్పిన విషయాలు, చెప్పని విషయాలు అన్నీ కలిపి చెపుతున్నాడు.

"న్యూయార్కులో నా ఫ్రెండ్ డాక్టరు ఉన్నాడు కదా. మీతో చెప్పిన మర్నాడే కేబుల్ చేశాను. నా ఉత్తరం అందిందట. నాలుగు రోజులయిందట అప్పటికి అంది. దానిని గూర్చే ఆలోచిస్తున్నాడట. అంతలోకి నేను మాట్లాడాను కదా మళ్ళీ ఫోనులో. ఆమెకు తప్పకుండా బాగవుతుందన్నాడు. మహా అయితే ఆరేడు నెలలు ట్రీట్‌మెంటు అవసరమన్నాడు. ఏ విషయమూ పేషెంటును చూసిన తర్వాతే చెప్పడానికి వీలవుతుందన్నాడు. త్వరలో లలిత మామూలు మనిషవుతుంది" అతడి ముఖంలో సంతోషం వెలిగిపోతోంది.

ప్రభాకర్ ముఖం మీద నవ్వు బలవంతంగా పులుముకున్నాడు. ఆలోచనలు ఈగల్లా ముసురుకుంటున్నాయి అతడిని.

'లలితకు ఈ ప్రయాణం ఇష్టంలేదా? ఇన్నాళ్ళూ ఎంతగానో ఎదురుచూసిన ఈ ప్రయాణం గూర్చి ఆమె ఎందుకంత నిర్లిప్తంగా ఉంది? ఆమెలో ప్రేమ అంత లీనం. ఆమె రూపమెంత సౌమ్యమో మనసంత గంభీరం. దానినర్థంచేసుకునే శక్తి తనకు లేదు. కాని ఆమె మనసులో ఆవేదన గూడు కట్టుకుందని మాత్రం తెలుసు. ఆమె తనతో ఏదో చెప్పాలనుకుంటోంది. ఏమిటది? ఎందుకు చెప్పలేక పోతోంది? తనతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడే లలిత ఎందుకింత మౌనం దాల్చింది? తనూ ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. ఎందుకు?అసలు ఈ వారం రోజులు ఎందుకు మౌనంగా ఉంది? ఈ రోజు కలుసుకున్నా ఆ మౌనాన్ని ఇంకా ఎందుకు కొనసాగిస్తోంది? తనదేమన్నా తప్పు ఉందా? తను లలితను కష్టపెట్టే మాట ఏమీ అనలేదు. కష్టపెట్టే పని చేయలేదే! మనిషి ఇలా జీవం కోల్పోయి నీడలా తయారయింది ఎందుకు? ఏమిటి? ఏమిటి??

ప్రభాకర్ లలితను పలుకరించాలన్న కోరికను ఆమె మౌనాన్ని భంగపరచే శక్తి లేక విరమించుకున్నాడు. టైం పదకొండు గంటలు దాటింది. సూర్యుడు

తీక్షణంగా వెలుగుతున్నాడు. ముగ్గురూ కోట చుట్టుపట్ల ప్రదేశాలు చూసి కోటలోకి ప్రవేశించారు. అది చాలా ఎత్తయిన కోట. కోటకు మూడు వైపులా చెట్లు దట్టంగా పెరిగి అడవిలాగా ఉంది. కోటకు తూర్పు వైపు గోడ ఒక్కటే స్థిరంగా ఉంది. మిగిలిన మూడు దిక్కుల గోడలు శిథిలావస్థలో ఉన్నాయి. చుట్టూ ఆకుపచ్చటి అడవితో ఆ చెట్లను చుట్టుకొని ఎర్రటి పూలను పూసిన అడవి తీగలను చూస్తుంటే ఎరుపు, పసుపు డిజైనుతో అల్లి ఆకుపచ్చని తివాచీ పరచినట్లుంది ఆ కోట చుట్టూ. కోట మూడు వైపులా అడవి ఉండటం వలన నాలుగో వైపున దారి చేశారు కోటలోపలికెళ్ళడానికి. కోటలో చిన్న మ్యూజియం ఉంది. ఒకప్పుడది చాలా పెద్ద మ్యూజియం. కాని ఆ మ్యూజియం చాలావరకు హైదరాబాద్‌కి తరలించారు.

ముగ్గురూ మ్యూజియంలోని ఒక్కొక్క వస్తువునే చూస్తూ ముందుకు వెళుతున్నారు. కొంచెంసేపు ప్రభాకర్ తన మనస్సుని మ్యూజియం వైపుకు కేంద్రీకరించాడు. ముగ్గురూ మ్యూజియం చూసి కోట మీదకు వెళ్ళారు. లలిత రామారావు చేయి నాసరాగా చేసుకొని నడుస్తోంది. మనిషి నడిచి నడిచి చాలా అలసిపోయింది. కోట గోడమీద ముగ్గురూ కూర్చొని చుట్టూ చూస్తున్నారు. వినోద యాత్రికులు చాలామంది వచ్చారు. ఆదివారం కావడం వలన రష్ ఎక్కువగా ఉంది. కొందరు స్కూలు పిల్లలు కూడా వచ్చారు. టీచర్లు వాళ్ళకు ఆ స్థలాన్ని గూర్చి వివరించి చెపుతూ పిల్లలు గోడల చివరకు వెళ్ళకుండా అదుపులో వుంచుతున్నారు.

ప్రభాకర్ లలిత ముఖంలోకి చూశాడు. ఆమె కూడా ప్రభాకర్ వైపే చూస్తోంది. 'తను చూస్తోంది లలితనేనా?' ప్రభాకర్‌కి అనుమానం వచ్చింది. అది తనకు పరిచయమైన లలిత ముఖంలా లేదు. అవే చేతులు, అవే కాళ్ళు, ముక్కు, చెవులు. అంతా లలితలానే ఉంది. కాని అవి లలిత కళ్ళు కావు. ఇవి ఆత్మ కోల్పోయిన కళ్ళు. ప్రభాకర్ కళ్ళు చిట్లించి చూశాడు. ఆ ముఖంలో, ఆ కళ్ళల్లో ఏవో నీడలు కదులుతున్నాయి. క్షణక్షణానికీ అవి పెరుగుతున్నాయి. నిశ్చల సరస్సులో రాయి విసిరితే మధ్య నుండి ఒడ్డుకు చేరుకునే నీటి తరంగాలలా ఆమె కళ్ళలోని నీడలు ముఖమంతా వ్యాపిస్తున్నాయి.

'తనకేనా అలా కన్పిస్తోంది లేక మిగిలిన అందరూ లలితలో వస్తున్న మార్పుని గుర్తిస్తున్నారా' అని చుట్టూ చూశాడు ప్రభాకర్.

ఎవ్వరూ వీరిని పట్టించుకోవడంలేదు. అటూ ఇటూ వెళుతున్నవాళ్లు వీళ్ళను చూసినా, ప్రత్యేకంగా లలితను చూసినా వారేమీ ప్రత్యేకత గుర్తించినట్లు కన్పించడంలేదు ప్రభాకర్‌కి.

"లలితా! నీవు చాలా అలసిపోయినట్లున్నావు. నీవిక్కడే కూర్చుంటావా, మేమలా దక్షిణ గోడను చూసి వస్తాము. రండి ప్రభాకర్. ఈరోజు ఆ గోడను చూడకపోతే రేపటికి మిగులుతుందనే ఆశలేదు. అంతగా పడిపోతోంది. అసలే కోట శిథిలావస్థలో ఉంది కదా, ఈ స్కూళ్ళవాళ్ళు చూడండి చిన్న పిల్లలను కూడా తెచ్చారు" అన్నాడు రామారావు. ప్రభాకర్ బయలుదేరాడు. లలిత గోడ మీద విశాలంగా ఉన్న చోటు చూసుకుని

కూర్చుంది. రామారావు రెండడుగులువేసి "పన్నెండు గంటలయింది రండి. త్వరగా వచ్చేద్దాం" అన్నాడు.

ఇద్దరూ కలిసి దక్షిణ గోడవైపు పదడుగులు వేశారో లేదో చుట్టూ ఉన్న యాత్రికులు ఒక్కసారిగా 'కెవ్వు'మన దంతో ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశారు. లలిత గోడమీద లేదు. ఆమె ఆకుపచ్చటి చీరకొంగు ఒక్కక్షణం గాలిలో తేలి కిందకు మాయమయి పోయింది.

ప్రభాకర్, రామారావు పిచ్చిగా పరుగెత్తారు గోడవద్దకు. వారి చూపును దాటుకుంటూ ఆకుపచ్చటి చీర చెట్ల మధ్యలో అదృశ్యమయింది.

ఆవేశంతో కిందకు దూకబోతున్న ప్రభాకర్‌ని చుట్టూ ఉన్నవాళ్ళు ఆపారు. అతడి మనస్సు మొద్దుబారి పోయింది. కళ్ళముందు జరుగుతున్న దేమిటో అర్థం కాలేదు.



లలిత మరణం ప్రభాకర్‌కి పెద్ద షాక్ ఇచ్చింది. అతడు ప్రాణ సమానంగా దాచుకున్న అమృతభాండమెవరో పగల గొట్టినట్లయింది. తనకు ప్రాణంగా మారిన వ్యక్తి తన కళ్ళ ముందే నిస్సహాయ మరణం పొందడం అతడిని కృంగదీసింది. అతడు చాలా మూడీగా మారి పోయి తన గదిలో గంటల తరబడి కూర్చొని ఆలోచించేవాడు.

మనిషి జీవితమెంత క్షణికం! క్షణం కిందట జీవంతో తుళ్ళిపడ్డ లలిత మరు క్షణంలో నిర్జీవమైపోయింది. ఆ కళ్ళు తనను పలకరించవు! ఆ పెదవులు తనతో మాట్లాడవు! ఎన్నో మాటలు చెప్పిన ఆ తీయని స్వరం అదృశ్యమై పోయింది! ఆ మాటలు గాలిలో కలిసి పోయాయి. ఆ మధుర స్మృతులే మిగిలాయి చివరకు. ఇంతేనా జీవితమంటే? ఇదేనా జీవితానికర్థం? మనస్సులో బాధ చెప్పడానికి భాష చాలడంలేదు. గుండె నిండిన దుఃఖానికి కన్నీళ్ళు అవిరై పోయాయి. ఎలా లలితను మర్చిపోయేది. లలిత ఫారెన్ వెళ్ళిపోయినా బాగుండేది. ఎప్పుడో ఒకసారి జీవితంలో మళ్ళీ చూడవచ్చుననే ఆశ ఉండేది. ఇప్పుడే ఆశా లేదు. లలిత! ఆ పేరు మనస్సున మధురంగా స్పందించేది. ఇప్పుడు కేవలం ఆలోచనలలో భావనగా మిగిలి పోయింది. ప్రేమ ఎంత బలీయమైనది! మనస్సుకి తగిలే గాయం ఇంత దుర్భర మైనదని తనకేనాడూ తెలియదే! శరీరం గాయపడితే నొప్పి లేకుండా చేయవచ్చు. కాని మనస్సుకి తగిలిన ఈ గాయాన్ని మాన్పేది ఎలా? స్వరూప స్వభావం తెలియజేయని ఈ బాధ నుండి విముక్తి ఏది? లలితా! ఎందుకు వెళ్ళిపోయావు నన్ను వదిలి? ఆరోజు నీవు నాతో ఏదో చెప్పాలనుకున్నావు కదూ. ఏమిటది? నాతో ఎందుకు చెప్పలేకపోయావు? లలితా! ప్రభా మీద నీకున్న అభిమానమైనా నిన్ను కిందకు దూకకుండా ఆపలేదా? ఆత్మహత్య ఎందుకు చేసుకున్నావు? ఎన్నో విషయాలు అరమరిక

లేకుండా మనస్సు విప్పి నాతో చెప్పావే, కనీసం ఈ విషయాన్ని మాటమాత్రమైనా నాతో చెప్పాలనిపించలేదా? నీకు ఆత్మ హత్య చేసుకోవాల్సినంత కష్టం ఏమి వచ్చింది? అంతకుముందు ఆ వారం రోజులు నీవు ఫోన్ చేయకపోతే నేను ఎంత అశాంతి చెందానో నీకు తెలుసా? వారం తర్వాత కన్పించి నాకు కలిగిన సంతోషాన్ని ఎందుకు శాశ్వత దుఃఖంగా చేసి వెళ్ళిపోయావు? లలితా...లలితా! ఎలా వివరించను నీతో నా బాధ? ఇక నీవు నాతో మాట్లాడవా? చనిపోయినవారు ఆత్మలవుతారంటారు. అదే నిజమైతే ఎంత బాగుంటుంది. నీవు కనీసం ఆ నానుడి నిజంచేసి ఆత్మగా మారన్నా నాతో మాట్లాడవా? లలితా! ఎందుకు వెళ్ళి పోయావు నాకు ఒంటరితనం మిగిల్చి? నేనీ ఒంటరితనాన్ని భరించగలననుకున్నావా? నీకు ప్రభవద్ద కనీసం వీడ్కోలు తీసుకోవాలని కూడా అనిపించలేదా? లలితా...! ఎంత నిర్దాక్షిణ్యంగా వెళ్ళి పోయావు నన్ను వదలి.

ప్రభాకర్ స్థితికి చంద్రమోహన్ చలించిపోయాడు.

బలవంతంచేసి ప్రభాకర్‌ని ఉత్తర దేశాలు చూసి రమ్మని ప్రయాణం చేయించాడు. ఎటు వెళితేనేం - వెళ్ళినచోటుకల్లా మనిషితో ఆ మనస్సే వస్తున్నప్పుడు?

రామారావు అనుకున్న తేదీన ఫారిన్ వెళ్ళిపోయాడు.

ప్రభాకర్‌కి మాత్రం ప్రయాణం చేయాలని లేదు. శ్రీపురంలో కూడా ఉండాలని లేదు. తన గదిలోని ప్రతి వస్తువూ లలిత చేతిని స్పర్శించినవే. తను వెళ్ళే ప్రతి ప్రదేశం లలిత అడుగుల స్పర్శననుభవించినవే. శ్రీపురంలోని ప్రతి అణువూ లలిత జ్ఞాపకాలతో నిండి పోయింది.

చివరికి చంద్రమోహన్ బలవంతం మీద ప్రయాణమయ్యాడు ప్రభాకర్. కేవలం మనస్సులో తప్ప తనతో ఉంచుకోవడానికి లలిత జ్ఞాపకార్థాలు వస్తు రూపంలో ఏమీలేవు. కనీసం ఆమె ఫొటో అయినా లేదు. ఆమెకు ఫొటో తీయించుకోవాలంటే చాలా సిగ్గు. ఓసారి ప్రభాకర్ కెమేరాలో ఫిల్మ్ లోడ్ చేసి 'లలితా నీ ఫోటో తీస్తాను' అన్నాడు. లలిత ఒప్పుకోలేదు. 'ఇంతటి ఖరీదైన ఫిల్మ్ అందమైన దృశ్యాలను శాశ్వతంగా బంధించడానికి కాని నావంటి సామాన్యురాలిని గుర్తుంచుకోవడానికా' అన్నది. ఆ మాటలకు ప్రభాకర్ చాలాబాధపడ్డాడు. 'అందమనేది చూసేవాళ్ళ హృదయాన్ని బట్టి ఉంటుంది లలితా' అన్నాడు. అంతకు మించి మరేమీ మాట్లాడలేక పోయాడు.

ప్రభాకర్ పుస్తకాలన్నీ సర్దుతున్నాడు. ఒక పాత వారపత్రిక కన్పించింది. అది ఎప్పుడో లలిత చదువుతూ చదువుతూ అక్కడే మర్చిపోయింది. ఆ పత్రికలో ప్రతిపేజీ లలిత సున్నితమైన వేళ్ళతో తిప్పబడ్డదే. ప్రతి అక్షరమూ లలిత కళ్ళల్లో బడ్డదే. ఆ పత్రిక వెనుక కవరు మీద లలిత కొన్ని సరుకుల పేర్లు రాసి వాటి ఖరీదులు వేసింది. అవి అంతకు ముందు రోజు షాపింగులో కొన్న వస్తువులు. ప్రభాకర్ ప్రతి అక్షరాన్ని పట్టి పట్టి చూశాడు. చూసేకొలదీ ఆ అక్షరాలు ప్రాణం పోసుకొని ఆత్మ నింపుకొని లలిత స్వరంతో ధ్వనిస్తున్నట్లు అనుభూతి పొందాడు.

ప్రభాకర్ అన్యమనస్కంగా తన బట్టలు సర్దుకొంటున్నాడు.

"ప్రభా! నీవు బ్రహ్మచారిగా ఉన్నంత కాలం నీకు బాధ్యత తెలియదు. ఇలానేనా బట్టలు సర్దుకునేది!" లలిత మందలించినట్లనిపించింది. "లలిత, లలిత" ఆలోచనలతో ప్రభాకర్ మనస్సు బరువెక్కిపోయింది. 'ఇంకెక్కడి లలిత? ఎంత మౌనంగా ఈ నాటకరంగ ప్రవేశం చేసిందో అంత మౌనంగానే నిష్క్రమించింది. అసలెందుకు కలిశాము? ఇలా విడిపోవడానికేనా? నీతో పరిచయం నా జీవితానికే ఉద్దేశం నిర్దేశింపబడలేదా? ఏమిటిది? ప్రేమంటే అర్థం తెలియని ఈ ఎడారిలో ప్రేమనే ఒయాసిస్సుని శాశ్వతం చేయడమా?' ప్రభాకర్ బరువుగా నిట్టూర్చాడు. 'శ్రీపురంలో తనిక ఉండలేడు. ఆమె దూరంగా వెళ్ళిపోయి వున్నా, సమాజంలో ఎవరిస్థాయిలు వారు వెదుక్కొని స్థిరపడిపోయిఉన్నా జీవితంలో ఎప్పుడోసారి కలుసుకోవచ్చుననే ఆశయినా బ్రతుక్కి ఊపిరి పోసేది. అంతా అయిపోయింది. ఇప్పుడే ఆశ మిగిలింది? లలిత శాశ్వతంగా దూరమయి పోయింది. ఆ మధుర స్వరం, ప్రేమ హృదయం గుప్పెడు బూడిదగా మిగిలిపోయాయి. ఇంతేనా జీవితం?' ప్రభాకర్ మనస్సు గిలగిల్లాడిపోయింది.

ప్రభాకర్ ముందుగా కాశ్మీరు వెళ్ళాడు. దుఃఖాన్ని కాలమే మాన్పుతుంది. స్థలమార్పిడి దానికి దోహదమిస్తుంది. ప్రభాకర్ ఈ ప్రయాణం మొదలెట్టక ముందు తను దుఃఖాన్ని మర్చిపోగలననే ఆశతో లేడు. ఇప్పుడు ఈ కొత్త ప్రదేశాల సందర్శనంలో ఆ ప్రకృతి వైచిత్రికి రోజులో కొన్ని క్షణాలన్నా పరవశించి, ఆ వింతలు చూడటములో నిమగ్నమై గతానికి కొంచెం కొంచెంగా దూరంగా జరుగుతున్నాడు.

మరుపనేది మనస్సుకున్న అద్భుతమైన వరం. ఆ వరమే గనుక ప్రసాదింపబడకపోతే మనిషి అసలు బ్రతకలేడేమో! అతడు ఎంతటి సంతోషాన్నైనా కోరుకుంటాడు కాని చిన్నపాటి దుఃఖాన్ని కూడా భరించలేడు. అటువంటి వ్యక్తికి మరుపనేది వరం కాక మరేమిటి? ఆ మరుపే గనుక లేకపోతే ప్రతి చిన్న బాధ పెనుభూతమై అతడిని జీవితాంతం వెన్నాడుతుంది. ఇలా లెక్క వేసుకుంటూపోతే మనిషి వృద్ధాప్యంలో అడుగుపెట్టేసరికి కేవలం భూతాల గుంపే తప్ప అతడనేవాడే మిగలడు.

జ్ఞాపకాలనేవి తొలగిపోయేవికాదు. కాని వాటిలోని చేదు కాలం చేతిలోబడి విరిగిపోతుంది. ప్రభాకర్ మనసు నుండి లలిత జ్ఞాపకాలు తొలగిపోవేనాటికీ. కాని అతడు బాధను మర్చిపోవడం నేర్చుకున్నాడు. కాలం ఎన్ని పాఠాలను నేర్పుతుంది!

కాశ్మీరునుండి దిగువ రాష్ట్రాలకు ప్రయాణమయ్యాడు. కలకతా చేరుకున్నాడు. కలకత్తా సమీపిస్తూనే భారంగా అనుకున్నాడు 'కలకత్తా వచ్చేశాను' అని. అక్కడ రెండు రోజులుండదలచుకున్నాడు. గార్డెన్స్‌లో తిరుగుతూ పచ్చిక మీద కూర్చొని నేలను ఆప్యాయతగా తాకుతూ 'లలిత ఈ నేలలో పుట్టింది. ఈ గాలిని పీల్చి పెరిగింది. ఈ మనుషుల మధ్య పెరిగింది. మొదటిసారిగా ఈ భాషనుచ్చరించింది. ఆమె మనసు

జీవం పోసుకుంది ఇక్కడే. లలిత లలితగా మారింది కలకత్తాలోనే' అను కున్నాడు.

కలకత్తా అతడిని ఒక ఆవేశంతో నింపింది. అది తన లలిత జన్మస్థలం. అది లలిత ఆడి పాడిన నేల. ఈ నేల అణు వణువులో లలిత ఆత్మ నిండి ఉంది. ఆ ఆలోచన అతడినెంతో ఉద్రిక్త పరి చింది. లలిత విశ్వరూపమై తనను చుట్టి నట్లనిపించింది. అతడిని కలకత్తా ఆహ్వా నించినంత ఆప్యాయతగా మరే ప్రదేశం ఆహ్వానించలేదు.

అక్కడినుండి బీహారు వెళ్ళాడు. లలితకు బౌద్ధమతం ఇష్టం. బీహారులో బుద్ధగయ చూద్దామనుకున్నాడు. అక్కడ ఓ రోజు ఉండిపోదామనుకొని హోటల్‌లో దిగాడు. శ్రీపురం నుండి బయలుదేరే టంతవరకు వీలయినంత త్వరగా ఆ ప్రదేశంనుండి దూరంగా వెళ్ళిపోవాలను కొని త్వరపడ్డాడు. నాలుగు రోజుల్లో హోమ్‌సిక్‌నెస్ కలిగింది, హైదరాబాద్‌కి కాదు, శ్రీపురానికి. అందుకనే త్వర త్వరగా ప్రయాణాన్ని ముగించుకోవాలని చూస్తున్నాడు.

ఉదయమే బ్రేక్‌ఫాస్టు ముగించుకొని లాంజ్‌లో కూర్చున్నాడు. వచ్చే పోయే వాళ్ళను గమనిస్తూ పేపరు తిరగవేస్తు న్నాడు.

హఠాత్తుగా అతడి దృష్టి హోటల్ నుండి బయటకు వెళ్ళిపోతున్న ఓ వ్యక్తి మీద పడింది. ఆమె తన చేతిలోని బాడ్జ్‌ని హాండ్‌బాగ్‌లో వేసుకుంటూ వెళుతోంది. అంటే డ్యూటీ ముగించుకొని వెళ్ళిపోతోం దన్నమాట. ప్రభాకర్ లేచి ఆమె వెనకే గబగబా అడుగులు వేశాడు. కాని ఆమె టాక్సీ ఎక్కి వెళ్ళిపోయింది.

ప్రభాకర్‌కి పిచ్చెక్కినట్లున్నది. 'ఆమె ఎవరు? ఆమె నడక, తీరు అంతా లలిత లానే ఉంది. కలుసుకోలేకపోయానే' అని మధనపడ్డాడు.

ఆమె ఆ హోటల్ ఎంప్లాయే కాబట్టి మర్రోజయినా తెలుసుకోవడానికి వీలు పడుతుందని తన ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నాడు. తెల్లవారి అంతా ఆమె కొరకు ఎదురుచూస్తూ లాంజ్‌లోనేకూర్చు న్నాడు. ఆమె రాలేదు. అతడికి కనీసం ఆమె పేరన్నా తెలియదు ఆఫీసులో ఆమె గూర్చి తెలుసుకోవడానికి. ఆ మర్రోజు కూడా అలానే లాంజ్‌లో ఓపిగ్గా ఎదురుచూశాడు. మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో ఆమె రావడం కన్పించింది. ప్రభాకర్ గుండె ఉద్వేగంతో వేగంగా కొట్టుకోసాగింది.

'ఆమె లలిత!!!'

మనిషిని పోలిన మనుషులుంటారు. కాని ఇంత పోలికా? ఆ నడక, కట్టూ, బొట్టూ—అంతా ముమ్మూర్తులా లలితే! ఆమె రిసెప్షన్ కౌంటర్‌లోకి వెళ్ళి రిసెప్ష నిష్టతో మాట్లాడుతోంది. ప్రభాకర్ ఆమెనే గమనిస్తున్నాడు. ఆ వంగి మాటాడటం, చేతులు తిప్పడం అంతా లలితే. ఈమె ఎవరు? లలిత నిజంగా మరణించలేదా? తన కొరకు బ్రతికి వచ్చిందా? ఈసారి ఏమైనా సరే తను వెనుకటిలా పిరికితనం చూపించడు.

ప్రభాకర్ తన ఆవేశాన్ని అదుపు చేసుకుంటున్నాడు. అతడికి తను చూస్తోంది కలో నిజమో అర్థంకావడం లేదు. అది కలే అయితే కరిగిపోతుందని భయపడ్డాడు. ఆమె ప్రతి చేష్టా ఆమె లలితేనని చెపుతున్నాయి. అయితే




లలిత మరణం అబద్ధమా? తన కళ్ళ ముందే చితి మంటల కాహుతి అయింది లలిత శరీరం కాదా? ప్రభాకర్ తనను తాను నిగ్రహించుకోలేక రిసెప్షన్ కౌంటర్ వద్దకు వెళ్ళాడు.

ఆమె ఏదో పేపరు మీద రాస్తూ రిసెప్షనిస్టుతో నవ్వుతూ అంటోంది "ఈసారి తప్పకుండా అనుకున్నట్లే జరుగుతుంది చూడు."

అదే స్వరం, అదే మాటతీరు. అయితే భాషవేరు. లలిత హిందీ మాట్లాడినా ఇలానే ఉండి ఉండవచ్చు. అతడు ఆమె రాస్తున్న దానివైపు చూశాడు. అదే చేతి వ్రాత. అదే పెన్ను పట్టుకునేతీరు. లలితలా పెన్నుకు కాప్ ఉంచలేదు. 'కాప్ ఉంచి వ్రాస్తే పెన్ను చాలా బరువుగా ఉంటుంది.' అనేది లలిత. ప్రభాకర్ అయోమయంలో పడిపోయాడు. కనీసం ట్విన్స్ అన్నా ఇంతపోలికతో ఉంటారా? లేక లలితఆలోచనలలో పడిపోయి తను భ్రమ పడుతున్నాడా?

రిసెప్షనిస్టు ప్రభాకర్‌ని గమనించి పొలైట్‌గా 'ఎస్ ప్లీజ్' అంది. ప్రభాకర్ లలితలా ఉన్న ఆమెను చూపించి



''ఈమెతో మాట్లాడాలి'' అన్నాడు. ఆమె తలెత్తి చూసింది. ప్రభాకర్ ఆమెను పరీక్షగా చూశాడు. ఎక్కడా పొరపాటు లేదు. ఆమె లలితే.

''నేను ప్రభాకర్‌ని'' అన్నాడు ఉద్వేగంగా.

ఆమె ఓ క్షణం అతడిని పరిశీలనగా చూసి "అహాఁ" అన్నది మరలా తన పనిలో మునిగిపోతూ. ప్రభాకర్ అవాక్కయిపోయాడు. ఆమె ముఖంలో తనను గుర్తించిన భావం కాని, ఆశ్చర్యం కాని లేదు. ఎవరో కొత్త వ్యక్తిని చూసినట్లు చూసింది.

ప్రభాకర్ ఇంకా అక్కడినుండి కదలక పోవడం చూసి రిసెప్షనిస్టు ఆమెతో "శ్యామలా! ఆయన నీతో మాట్లాడాలని సుంచొని ఉన్నారు" అన్నది.

శ్యామల తలెత్తి చూసింది అతడివైపు.

"మీరు ఆంధ్రాలో శ్రీపురంలో ఉన్నారు కదూ? మీరు లలిత కదూ?'' అడిగాడు.

అతడు ఊహించిన కలవరపాటేమీ కన్పించలేదు ఆమె ముఖంలో. ఆమె అతడిని వింతగా చూసింది. "శ్రీపురమా? ఎక్కడ ఉందది? నా పేరు శ్యామల" అన్నది పెన్నుమూస్తూ.

క్షణకాలం పాటు ఏం మాట్లాడాలో తోచలేదు అతనికి. ఆమె ప్రభాకర్‌ని ఓసారి సలువెల్లా పరికించి వెళ్ళిపోయింది. ఆ చూపుతో ప్రభాకర్ కుంచించుకపోయాడు.

నీరసంగా వెళ్ళి కూచ్చున్నాడు. 'ఇది కలకాదు. నిజమే' దీర్ఘంగా నిట్టూర్చాడు. ఈమె తన లలిత కాదంటోంది. కాని లలితకు ప్రతిరూపంలా ఉంది. ఈమె ఎవరు? లలితకు తోడబుట్టినవాళ్ళెవ్వరూ లేరు. మరి, ఈ శ్యామల ఎవరు? లేక లలిత నిజంగా నాటకమాడిందా ? అక్కడ మరణించినట్లు నటించి ఇటు వచ్చి గతాన్ని మర్చిపోయి ప్రవర్తిస్తోందా? నో...నో...లలితకు నటన తెలియదు. ఆరోజు చితి జ్వాలలకు ఆహుతి అయింది లలిత శరీరమే. లలితమరణం యదార్థం. మరి..మరి..., ప్రభాకర్ తల బరువెక్కిపోయింది. ఆ 'మరి'కి అతడు అర్థం చెప్పలేకపోతున్నాడు, అర్థంచేసుకోలేకపోతున్నాడు.

ఈ శ్యామల ఎవరు? ముమ్మూర్తులా లలితనుపోలి; స్వరం, దస్తూరి, అలవాట్లు అన్నింటిలోనూ లలితనే జ్ఞాపకం చేస్తున్న ఈమె ఎవరు?

ప్రభాకర్ లేచి తన రూం వైపుకు వెళ్ళపోతూ ఏదో గుర్తుకువచ్చి రిసెప్షనిస్టు పద్దకు వెళ్ళాడు. ఆమె అతడికీ, శ్యామలకూ జరిగిన సంభాషణ విన్నది. హోటల్లో పనిచేసేవారు ఓ విద్యను నేర్చుకుంటారు. ముందు వచ్చిన మనిషిని పరిశీలించి, అతడిని గూర్చి ఓ అభిప్రాయం ఏర్పరచుకొని దానికనుగుణంగా ప్రవర్తిస్తారు. రిసెప్షనిస్టుకి ప్రభాకర్ ప్రవర్తనలో వెకిలితనం ఏమాత్రం కన్పించలేదు. పైగా అతడు శ్యామలతో కావాలని మాట్లాడక ఏదో ఆర్తిని బాపుకోవడానికి సమాధానం వెదికే వ్యక్తిలా, అన్వేషిలా మాట్లాడాడు. ఆవిడకు అతడి మీద సానుభూతి కలిగింది.

"ఆవిడ... శ్యామల ... ఇక్కడ ఎన్నాళ్ళనుండి పనిజేస్తున్నారు?" అడిగాడు.

"ఐదేళ్ళనుండి పనిచేస్తోంది'' ఆమె సమాధానమిచ్చింది.

ప్రభాకర్‌లో మిణుకు మిణుకుమంటున్న ఆఖరి ఆశకూడా ఆరిపోయింది. నిస్సత్తువగా రూంకి వెళ్ళి పడుకున్నాడు. అతడి మనస్సు విశ్రాంతి కోరుతోంది.

ఏ క్షణాన్నయితే శ్యామల కన్పించిందో ఆ క్షణం నుండి ప్రభాకర్‌లో నిగ్రహశక్తి లోపించింది. ఇన్నాళ్ళూ ఉన్న

ఏదో పిచ్చి ధైర్యం కారిపోయి ఆ స్థానే అశాంతి, ఆవేదన ఆక్రమించుకున్నాయి. వాటినుండి పారిపోలేక తనను తాను మర్చిపోవడానికి డ్రింక్స్ మొదలు పెట్టాడు.

'తను ఎందుకు తాగుతున్నాడు? అసలు తాగుడు నాగరికత చిహ్నమా? ఇంతకుముందు సరదాకు తీసుకునేవాడు దానిని. అది తీసుకున్నపుడు రిలాక్సయి నట్లు గుండెలో వెచ్చగా, మనసంతా సంతోషంగా ఉండేది. అది వేరు, ఆరోజు వేరు. కాని ఇప్పుడో! ఆభావం కొరకేనా? అవునని తనను తాను మోసం చేసుకో లేడు. బాధనుండి, ఆవేదన్నుండి, బాధ్యత నుండి పారిపోవడానికి సహకారి ఈ ఆల్కహాలు. దుఃఖకర సన్నివేశాలు మర్చిపోవడానికి, మనస్సుని మరపించ డానికట ఈ అలవాటు. తనూ అందుకేనా? ఇది ఆరోగ్యాన్ని చెరుపుతుంది. తనకా విషయం తెలుసు. అయినా ఇదే కావాలి. తను బ్రతికేది ఎందుకు? ఎవరూ ఎవరి కొరకు బ్రతకరట. అయితే తను తన కొరకే ఎందుకు బ్రతకాలి, ఏమని బ్రత కాలి? పాతికేళ్లకే ఇంతదుఃఖాన్ని మోస్తున్న హృదయం అసలు భవిష్యత్ దెబ్బలను తట్టుకోగలదా? లలిత జ్ఞాపకాలకూ తన జీవితానికి ఎడబాటు లేదు. తను ఈ జీవి తాన్ని, ఈ దుర్భర వేదనను భరించలేడు. అందుకే ఈ చేదు పానీయం. అది మత్తు ని స్తుంది. మైమరపిస్తుంది. కానీ అది తాత్కా లికం! అశాంతికన్నా తాత్కాలిక శాంతే ఆవేదనను రెట్టింపు చేస్తుంది. కాని మనస్సు శాశ్వతమార్గం తెలియక, తాత్కాలికమైనా దీనినే కోరుకుంటోంది. ఇదేనా బాధనుండి తప్పించుకునే పద్ధతి? ఇదేనా తపన తీర్చు కునే మార్గం? ఎంత అవివేకపుటాలోచన! ప్రభాకర్‌కి తాను ఒకప్పుడు చదివిన ఆల్కహాలు తీసుకోకుండా ఉండేందుకు అవలంబించాల్సిన పన్నెండు సూత్రాలు గుర్తుకు వచ్చాయి. అవి– మేము తాగు బోతులము కాము, అలా ఉండటానికి శక్తినివ్వు అని ప్రార్థించేవి. అంత ప్రార్థించే వివేకమే గనుక ఉంటే తాగుడు జోలికి ఎందుకు పోతాడు? ఈ రోజు తను వివేకం కోల్పోతున్నాడు. క్షణిక శాంతిని కోరుకుంటున్నాడు. తర్వాత వచ్చే రెట్టింపు బాధను భరించ డానికి తాను సిద్ధంగా ఉన్నాడా? బాధకు మెడిటేషన్ చక్కని ఉపశమనమిస్తుం దంటారు. కనీసం ఆ మెడిటేషన్ చేయ డానికైె మనస్సు చిక్కబరుచుకోవాలి. గొంతులో దుఃఖం పేరుకొని ఆలోచ నలను బ్లాక్ చేసింది. అన్యమార్గం ఏది దాన్ని సరిజేయగలదు?'

ప్రభాకర్ ఆల్కహాల్‌ని సిప్ చేస్తూ ఆలోచిస్తున్నాడు. మనస్సు క్రమేణా దాని శక్తికి లొంగిపోయి నిద్రకు జోగు తోంది. ప్రభాకర్ గది అంతా కలయ జూశాడు. గది దుమ్ముగా, బెడ్‌షీట్లు మురిగ్గా అనిపించాయి. 'వీటిని మార్చ మని చెప్పాలి' అని ఫోన్ ఎత్తి హౌస్ కీపింగ్‌కి కనెక్షనివ్వమని చెప్పాడు.

"హౌస్ కీపింగ్ ప్లీజ్" అవతల నుండి మృదువైనస్వరం వినిపించింది. అది లలిత స్వరం. ప్రభాకర్ ఆవేశాన్నణచు కోలేక అసంకల్పితంగానే అన్నాడు "లలితా!"

అవతలనుండి మరలా వినిపించింది "హౌస్ కీపింగ్ ప్లీజ్"

ప్రభాకర్ ఫోన్ పెట్టేశాడు. లలితే మాట్లాడింది. కాదు శ్యామల. లలిత చచ్చి

పోయింది. ఆ జ్ఞాపకంతో ప్రభాకర్‌కి ఏడుపు ముంచుకవచ్చింది. దిండులో తల దాచుకొని చాలా సేపు వెక్కి వెక్కి ఏడ్చాడు. ఎక్కడికెళ్ళావు లలితా! నాతో ఎందుకీ ఆటలాడుతున్నావు? నీవే కదూ శ్యామల రూపంలో ఉంది ఇక్కడ? చెప్పు లలితా చెప్పు. అవునని చెప్పు. ఈసారి నిన్ను దూరం చేసుకోను. ఎవరేం చెప్పినా, ఆరు నూరైనా దేనికీ సంకోచించను. వచ్చేయి లలితా.

ప్రభాకర్ ఆల్కాహాలు తాగిన వాళ్ళను చూసి ఎంజాయ్ చేసేవాడు ఎప్పుడూ. తాగినప్పుడు వాళ్ళు వేసే వెకిలి వేషాలను తనివితీరా ఆనందించేవాడు. వాళ్ళు ఒక్కోసారి అతిగా నవ్వుతారు. ఒక్కోసారి ఒకడు ఏడుపు మొదలు పెట్టగానే మిగిలిన అందరు కూడా జాయింటుగా ఏడుపు మొదలు పెట్టేవాళ్ళు. ఈ దృశ్యాలు ప్రభాకర్‌కి చాలా నవ్వు పుట్టించేవి ప్రభాకరూ ఇప్పుడు అదే స్థితిలో ఉన్నాడు. తన స్థితికి తానే ఆనందించే మూడ్‌లో లేడు. 'లలిత, లలిత' అని చిన్నపిల్లవాడిలా చాలా సేపు రోదించాడు. ఆ ఏడుపులోనే అలసిపోయి నిద్రపోయాడు.

హఠాత్తుగా మెలుకువపచ్చింది. వాచి ఏడు గంటలు చూపిస్తోంది. రిసెప్షనిస్టుని టైం అడిగాడు అనుమానం తీరక. 'సెవన్ పి. ఎమ్. ప్లీజ్' అందామె.

అద్దంలో ఒకసారి ముఖం చూసుకున్నాడు. కన్నీటి చారికలతో ముఖం చాలా మలినమైపోయింది. తన స్థితికి తానే జాలిపడి నవ్వుకున్నాడు. ఆ నవ్వులో ఒక అపశృతి కన్పించిందా అద్దంలో.

స్నానం చేసి ఫ్రెష్‌గా తయారయి క్రిందకు వచ్చాడు. గార్డెన్‌లో కొంచెం సేపు అటూ ఇటూ తిరిగి కాఫీ తాగి, టిఫిన్ చేసి హోటల్ బయటకు వచ్చాడు. సాయంకాలం దాటిపోయిందెప్పుడో. విద్యుద్దీపాలు ఆ రాత్రిని కాంతివంతం చేస్తున్నాయి. అది చాలా బిజీ సెంటర్‌లా ఉంది. వాహనాల రద్దీ ఎక్కువగా ఉంది. ట్రాఫిక్‌ని అతికష్టం మీద కంట్రోల్ చేస్తున్నారు ట్రాఫిక్ పోలీసులు.

అంతలో హోటల్ నుండి వస్తూ శ్యామల కన్పించింది. బహుశ డ్యూటీ అయిపోయి వస్తోంది. తిరిగి రూంకెళ్ళిపోదామనుకుంటున్న ప్రభాకర్ తన ఆలోచనలను విరమించుకొని ఆమెనే చూస్తూ నిలబడ్డాడు.

ఆమె ప్రభాకర్ ముందు నుండే గబగబా నడచుకుంటూ వెళ్ళింది కాని ప్రభాకర్‌ని గమనించలేదు. ప్రభాకర్ ఆమె వెనుకే నడవసాగాడు. ఆమె ననుసరించాలని నిర్ణయించుకున్నాడు. ఆమె బస్ స్టాపులో నిలబడి బస్ కొరకు ఎదురు చూడసాగింది. ప్రభాకర్‌కి ఆమె ఏ బస్ ఎక్కుతుందో, ఎటువెళుతుందో తెలియదు కాబట్టి వచ్చే, పోయే బస్‌లని చాలా జాగ్రత్తగా గమనించసాగాడు. కొంచెం సేపటికి బస్ నెంబరు ముప్పయి రెండు వచ్చింది. అది మార్కెట్ నుండి ఎమ్. జి. మార్గ్‌కి వెళుతోంది. బస్ చాలా రష్‌గా ఉంది. శ్యామల ఆ బస్ ఎక్కింది. ప్రభాకర్ కూడా ఆ బస్ ఎక్కాడు. శ్యామలకు ప్రభాకర్ చర్యలు తెలియకపోయినా ప్రభాకర్‌కు మటుకు శ్యామల ప్రతి కదలికను వేయి కళ్ళతో కనిపెడుతున్నాడు. అతడికి శ్యామల ఏ స్టాపింగ్‌లో దిగుతుందో తెలియదు. చివరి వరకూ టికెట్ తీసుకుని శ్యామల దిగిన చోటున

దిగాలని నిర్ణయించుకున్నాడు.

కండక్టర్ వచ్చి టికెట్ అడిగాడు. "ఎం.జి. మార్గ్" అంటూ చెప్పాడు.

కండెక్టరు ఏభై పైసల టికెట్ ఇచ్చాడు. బస్ ముందుకు పోతున్న కొలదీ అతడి మనస్సు ఉద్వేగంతో ఎగిసి పడుతోంది. మరో రెండు స్టాప్స్ తర్వాత శ్యామల బస్ దిగింది. ఆమెను చూసి జనాన్ని నెట్టుకుంటూ ప్రభాకర్ కూడా దిగాడు. ఆ హడావుడిలో తాను ఎందరి కాళ్ళు తొక్కాడో, వాళ్ళేం తిడుతున్నారో కూడా వినిపించుకునే తీరిక లేదు అతడికి. ఎవరి ముఖాలు చూడకుండా అందరికీ 'సారీ' చెపుతూ హడావుడిగా దిగిపోయాడు.

ప్రభాకర్ బస్ దిగి శ్యామల కొరకు చూశాడు. ఆమె రోడ్డు పక్కగా నడిచి పోతోంది. ఒక్క క్షణం చుట్టూ పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించి మనస్సులో వాటిని ముద్ర వేసుకున్నాడు. అంతలోనే శ్యామల కనుమరుగయిపోతుందనే భయంతో వేగంగా నడవసాగాడు ఆమె వెనుకే. ఆమె రెండు వీధుల మలుపులు తిరిగి ఒక ఇంట్లోకి వెళ్ళింది. ప్రభాకర్ ఆ ఇంటి దాపులకు వెళ్ళడానికి సాహసించక రోడ్డు మీదే నిలబడి ఆమెను గమనించసాగాడు. ఆమె తలుపు తాళం తీస్తోంది. వాచీ చూసుకున్నాడు. టైం తొమ్మిదిన్నర దాటుతోంది. కొంచెం సేపటికి ఆ తలుపులు తెరచుకొని మూసుకున్నాయి. కిటికీ నుండి వెలుతురు కన్పించింది.

ప్రభాకర్ కొంచెం సేపు అక్కడే నించున్నాడు. 'వెళదామా వద్దా' అని సంశయించాడు. ఇప్పుడు వెళ్ళడం మర్యాదగా ఉండదు. రేపు వద్దాం అనుకొని వెనక్కు మరలాడు. తను వచ్చిన త్రోవనే జాగ్రత్తగా గుర్తు చేసుకుంటూ బస్‌స్టాప్ వద్దకు వెళ్ళాడు.

టాక్సీలు స్టాండ్ చేసి ఉన్నాయి. ఒక టాక్సీ అతడిని ''ఈ ప్రదేశం పేరేమిటి'' అని అడిగాడు. అతడు ''పూల్‌బాగ్'' అని చెప్పాడు. ప్రభాకర్ చుట్టూ చూశాడు. అక్కడంతా పూల దుకాణాలు ఎక్కువగా ఉన్నాయి. అప్పుడు వచ్చింది ప్రభాకర్‌కి రకరకాల పూల వాసన. తను ఎంతగా డిస్కవరీలో మునిగిపోయాడో అర్థమయి తనలో తానే నవ్వుకున్నాడు. ఆ టాక్సీలోనే ఎక్కి నటరాజ్‌కి వెళ్ళిపోయాడు. హోటల్‌కి వెళ్ళేటంతవరకూ ఆ ప్రదేశాన్ని, శ్యామల ఇంటి దారిని పదేపదే మననం చేసుకున్నాడు. 'మర్చిపోవడానికి వీలు లేకుండా కాగితం మీద రాసుకోవాలి రూంకి వెళ్ళగానే' అనుకున్నాడు. అలాగే చేశాడు.

ఆ రాత్రికి ప్రభాకర్‌కి నిద్ర రాలేదు. 'రేపు మధ్యాహ్నండ్యూటీ అనుకుంటాను శ్యామలకు. పొద్దున్నే వెళ్ళి కలవాలి ఆమెను. అసలు ఆమె ఎవరు? రూపు, ప్రవర్తన ఆమె లలితే అని చెపుతుంటే, పరిస్థితులు ఆమె లలిత కాదని చెపుతున్నాయి. ఈ అవును, కాదులలో ఏది నిజం? ఇంత శ్రమ తీసుకుంటున్నాను. నా అన్వేషణ ఫలిస్తుందా? ఏమిటింత తెలివి తక్కువగా ఆలోచిస్తున్నాను? ఎలా ఫలిస్తుంది? లలిత మరణించింది. నమ్మినా, నమ్మకున్నా ఆమె మరణం యదార్థం.

లలితకు, శ్యామలకు ఏదన్నా సంబంధం ఉందా? ఉందని తన మనస్సుకి అని పిస్తోంది. అనిపించడానికేం, మనస్సు

కేమయినా అనిపిస్తుంది. అది తన కిష్టమైన రీతిలో కోరుకుంటుంది, ఊహించుకుంటుంది. అన్నీ యదార్థాలేనా?

లలితకు మతిమరపు జాస్తి. అది ఎమ్నిషియా కింద మారి ఉండవచ్చా? తన ఆలోచన తనకే నచ్చలేదు ప్రభాకర్‌కి. ఈ రోజుల్లో చాలామందికి ఇదొక అలవాటయిపోయింది. ఏ చిన్న విషయానికైనా పెద్ద పేరు పెట్టడం, అలా చేయడం బిజినెస్‌గా మారింది. చిన్న జబ్బుకి పెద్ద లాటిన్ పేరు తగిలిస్తాడు డాక్టరు. దానితో రోగి హడలిపోయి ఐదు రూపాయలకు బదులు నూరు రూపాయలు ఖర్చయినా తన జబ్బుకి ఆ మొత్తం ఖర్చవడం తగినదే అనుకుంటాడు. బొమ్మలు చేసేవాళ్లుగాని, బట్టలు నేసేవాళ్ళుగాని ఆ వస్తువులున్నట్లు అద్దాల గదుల్లో ఉండరు. ముడుగు కాల్వలమధ్య తలను తాకే గుడిసెల్లో జీవిస్తూ అద్దాల గదుల కొరకు అద్భుత కళా సృష్టి చేస్తున్నారు. ఆ ప్రదేశాలకు వెళ్ళి, జీవచ్ఛాల్లా బ్రతుకుతున్న వాళ్ళ వద్ద రూపాయి ఖరీదుచేసే వస్తువు కొనడానికి మనస్సు వొప్పదు. అది తమ హోదాకు చిన్నతనమనుకుంటారు. అదే వస్తువు మూడో అంతస్తులో అందమైన పాకెట్‌లో పదహారు రూపాయల ఖరీదు ఉన్నా, ఆ ఖరీదును బట్టి ఆ వస్తువు విలువను నిర్ణయించి కొంటారు. అది ఆ వ్యాపారస్తులు వ్యాపారం చేసే పద్ధతి. కారు రిపేరుకి వెళ్ళినపుడు ముందు ఆ కారును చూడడు మెకానిక్. ఆ కారు ఖరీదును, ఆ కారులో కూర్చునే వ్యక్తి అంతస్తుని అంచనా వేసి అది మైనర్ రిపేరే అయినా మేజర్ రిపేరు అని చెపుతాడు. తాము దేశంకై పడుతున్న చిన్న కష్టాన్ని గోరంతలు కొండంతలుగా చెప్పడం రాజకీయ వాదుల బిజినెస్.

'విషయాన్ని విషయంగా కాక అధికంగా చేసి చూడటం ఫాషన్ అయిపోతోంది' అనుకున్నాడు ప్రభాకర్.

ఇష్టంలేని సంఘటనలను, వ్యక్తులను, సందర్భాలను ఎంతముఖ్యమైనవి అయినా మర్చిపోతుంది మనిషి మనస్సు. మరపు అయిష్టతను సూచిస్తుంది, నిర్లక్ష్యాన్ని తెల్పుతుంది. ఈ విషయంలో చంద్రమోహన్ ఎప్పుడూ 'ప్రేమికులను మించిన సైకాలజిస్టులు ఎవ్వరూ లేరు' అంటూ ఒక కథను చెపుతుంటాడు. "ఒక అబ్బాయి ఒక అమ్మాయికి ఉత్తరం రాశాడు. దానికి అడ్రెస్ తప్పుగా రాశాడు. అది ఎక్కడెక్కడికో తిరిగి తిరిగి విసిగి వేసారి డెడ్ లెటర్ ఆఫీసు కెళ్ళి సెన్సార్ చేయబడింది. అక్కడ ఉత్తరాలను చదివే క్లర్కు ఆ ఉత్తరాన్ని చదివి చాలా ఎంజాయ్ చేసి ఉంటాడులే. ఆఫీసు నుండి ఆ ఉత్తరం అతడికే పోస్టు చేయబడింది మరలా. తర్వాత ఆ అమ్మాయి అతడితో 'అతడు తనకు ఉత్తరాలే వ్రాయడం లేదని' నిష్ఠూరమాడింది. అతడు చాలా గొప్పగా తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవడానికి తిరిగి వచ్చిన ఉత్తరాన్ని ఆమెకుచూపించి చాలా గొప్ప పొరపాటు చేశాడు. అసలు చూపించకుండా 'సారీ' అంటే సరిపోయి ఉండేది. 'పని తీరడం లేదులే' అని సరిపుచ్చుకొని ఉండేది ఆమె. అలా కాక ఆ ఉత్తరం చూపించేసరికి ఆమెకు చాలా కోపం వచ్చి, రోషంతో 'నీకు అసలు నామీద ప్రేమ లేదు. నీది అంతా నటన. ప్రియమైన వాళ్ళ అడ్రెస్‌లు, అందులో

ఇన్ని రోజుల పరిచయం తర్వాత కూడా ఎవరూ మర్చిపోరు. మర్చిపోయారు అంటే వారి మధ్య ప్రేమ లేదని అర్థం. ఈ నటన ఇక చాలు. గుడ్ బై' అని వెళ్ళిపోయింది..."




ఆ తెల్లవారి ప్రభాకర్‌కి త్వరగా మెలుకువ వచ్చింది. తొమ్మిది గంటల వరకు అసహనంగా నిరీక్షించి, శ్యామలను కలుసుకోవడానికి బయలుదేరాడు.

గతరాత్రి చూసిన జ్ఞాపకంతో టాక్సీ చేసుకొని పూల్‌బాగ్ వెళ్ళాడు. టాక్సీ దిగి కొంచెం దూరం నడవగానే శ్యామల అప్పుడే అక్కడ ఆగిన బస్ ఎక్కి వెళ్ళిపోవడం చూశాడు ప్రభాకర్. ఒక్కసారిగా చప్పబడిపోయింది అతడి ఉత్సాహమంతా. 'శ్యామల ఎక్కడికో వెళ్ళిపోయింది. తిరిగి ఎప్పుడొస్తుందో తెలియదు. బహుశ ఈరోజు ఆమెను కలుసుకోవడం పడదిక్కడ. మరల ఆమె డ్యూటీకి వచ్చినపుడే ఆమెను కలుసుకోవాలి హోటల్‌లో' అని మరలివచ్చాడు. ఆమె కొరకు ఎదురు చూస్తూ లాంజ్‌లో కూర్చున్నాడు. రెండు గంటలయినా శ్యామల రాలేదు. రిసెప్షన్‌లో అడిగాడు "శ్యామల రాలేదా ?"

"ఈ రోజు లీవు" అన్నది ఆమె.

ప్రభాకర్ అసహనంగా కదలివెళ్ళాడు తన గదికి. సాయంకాలం నాలుగుగంటల ప్రాంతంలో మరలా పూల్‌బాగ్ వెళ్ళాడు. లీవ్ కాబట్టి శ్యామల ఇంటి వద్దే ఉంటుందనే ఆశ లేదు. ఒకవేళ మార్నింగ్ షోకి గనుక వెళ్ళి ఉంటే మధ్యాహ్నము సుండే ఇంట్లో ఉంటుంది. లేదా ఎవరన్నా ఫ్రెండ్స్ ఇంటికో, రిలేటివ్స్ ఇంటికో వెళ్ళి ఉంటే బహుశ చీకటి పడే వరకు రాకపోవచ్చు. తన ప్రయత్నం ఫలిస్తుందనే ఆశలేకపోయినా, ఏదో ఆరిపోతున్న దీపం లాంటి ఆలోచనతో ఆమె ఇంటికి వెళ్ళాడు. తలుపు తాళం వేసి లేదు. అతడి గుండె వేగంగా కొట్టుకోసాగింది. రెండు నిముషాలు అటూ ఇటూ తచ్చాడి, తలుపు కొట్టడానికి సందేహించి చివరకు ధైర్యం కూడగట్టుకొని తలుపు మీద నెమ్మదిగా తట్టాడు.

కొంచెం సేపటికి తలుపు తెరచుకుంది. శ్యామల నిద్రపోతూ మధ్యలో లేచినట్లుంది. మొహం అంతా నిద్రమత్తుతో ఉంది.

"ఎవరు కావాలండి ?" అడిగింది.

ఆమె ప్రశ్న వింటూనే తను మాట్లాడదలచుకున్నదంతా మర్చిపోయాడు ప్రభాకర్. ఆమె లలిత కాకపోయినా ఆమె లలిత అయితే ఎంతో బాగుంటుందని ఊహించుకుంటూ వచ్చాడు.

"నేను ప్రభాకర్‌ని. నటరాజ్‌లో మిమ్మల్ని పలుకరించాను" అన్నాడు.

ఆమె గుర్తు పట్టింది. కాని ఏమీ స్నేహపూర్వకంగా మాట్లాడలేదు.

"ఓహో మీరా! అయితే ఏమిటి విషయం?" వాకిట్లోంచి కదలకుండా ప్రభాకర్‌ని గుమ్మం అవతల ఉంచే అడిగింది.

ఆమె కనీసం అతడిని లోపలకు

రమ్మనైనా అనలేదు. దానికతడు నొచ్చుకోలేదు. ఆమె హోటల్‌లో పనిచేస్తోంది. దాని సంబంధంగా పరిచయమైన ప్రతి వ్యక్తితో ఆమె పరిచయం క్లుప్తంగానే ఉండాలి. లేకపోతే స్త్రీగా ఆమె జీవితం ఈ సమాజంలో దుర్భరమైపోతుంది.

"నేను మీతో కొంచెం మాట్లాడాలి. లోపలికి రావచ్చా? మీరు అన్యథా భావించకండి" చాలా వేడికోలుగా అన్నాడు.

శ్యామల ఓ క్షణం అతడి ముఖంలోకి చూసి అయిష్టంగానే లోపలికి దారితీస్తూ "రండి" అన్నది.

ప్రభాకర్ లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు. పెదవి కొరుక్కు-



న్నాడు. శ్యామల ఏమన్నా కొంచెం శాంతంగా మాట్లాడి ఉంటే అతడికేమన్నా ధైర్యం వచ్చి ఉండేదేమోగాని ఆమె ముభావంగా మాట్లాడడంతో అతడికి గొంతు పెగలడం లేదు. శ్యామల ప్రభాకర్‌నే గమనిస్తోంది. ఆమెకు అతడి స్థితి జాలిగొల్పింది.

"ఏమిటో మాట్లాడాలన్నారు. చెప్పండి" అన్నది ముందుగా తానే సంభాషణ ప్రారంభిస్తూ.

"నా పేరు ప్రభాకర్" అన్నాడు.

శ్యామలకు నవ్వు వచ్చింది.

ఆ నవ్వు చూస్తుంటే తన ఎదురుగా కూర్చున్నది లలితేనని భ్రమ కలుగుతోంది. ఆ నవ్వుని అతడు మర్చిపోగలడా?



"మీరు లలిత కాదూ? మీరు నన్ను గుర్తు పట్టలేదూ? నిజం చెప్పండి" ఒక్కసారిగా ఆవేశం వచ్చింది అతడికి. గొంతు వణికింది.

శ్యామల అతడిని జాలిగా చూసింది.

"మీరెవరో నాకు తెలియదు. మీరనుకుంటున్న లలితను మాత్రం కాను నేను. మీరు పొరపడుతున్నారు" అన్నది.

"లేదు, లేదు. మీరెందుకో అబద్ధం చెపుతున్నారు. దయచేసి నటించకండి. మీరు నన్ను అంత త్వరగా మర్చిపోయారా?"

అతడు 'న ట న' అన్నందుకు శ్యామలకు కోపం వచ్చింది.

"చూడండి ప్రభాకర్‌గారూ! మీరు ఆవేశంలో హద్దులు దాటి మాట్లాడుతున్నారు. మిమ్మల్ని రెండు రోజుల నుండి గమనిస్తున్నాను. అసలు మీ ఉద్దేశం ఏమిటి? నిన్న మీరు నాతో బస్‌లో రావడం, ఈ రోజు పొద్దున టాక్సీలో రావడం అన్నీ గమనిస్తూనే ఉన్నాను. ఎందుకు మీరు నన్నిలా వెంటాడుతున్నారు? మీరనుకుంటున్న లలితను నేను కాను అని మీకు హోటల్లోనే చెప్పాను. ఇంకా ఎందుకు వెన్నాడుతున్నారు? మీరు నన్ను అల్లరి చేయదల్చుకున్నారా?"

ప్రభాకర్ ఖిన్నుడయ్యాడు. మాట్లాడలేకపోయాడు. శ్యామల ఎంతో అపార్థం చేసుకుంది! అతడు చాలా బాధపడ్డాడు. అయినా మ న సు కూడదగట్టుకొని అన్నాడు "శ్యామలగారూ! మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. మీరు అనుకుంటున్నట్లు ఏవో కథలు అల్లి మిమ్మల్ని అల్లరి పెట్టాలనేది నా వుద్దేశ్యం కాదు. మీరు నాగుర్చి చాలా అపోహపడ్డారు. నాది శ్రీపురం — ఆంధ్రప్రదేశ్. అక్కడ నాకు ఒక ఫామిలీతో పరిచయమైనది. అతడి పేరు రామారావు. మీరెప్పుడూ ఆ పేరు వినలేదా?"

"లేదు."

"అతడి భార్య లలిత. బెంగాలీ. రామారావు ఆంధ్ర. అతడిని చేసుకొని ఆమె ఆంధ్రా వచ్చేసింది. చాలా స్నేహశీలి. ఆ కుటుంబంతో నాకు చాలా సన్నిహిత పరిచయమున్నది. మీరు ఆమెను పోలి ఉన్నారు. మీ ఇద్దరిని గూర్చి చెప్పడానికి పోలిక అనేది చాలా చిన్నమాట. మీరు లలితకు ప్రతిబింబంలా ఉన్నారు. కేవలం రూపమేకాదు, స్వరం, నడక, ప్రవర్తన, చివరకు రైటింగ్ కూడా అలానే ఉన్నాయి. ఇది ఎలా సాధ్యమో నా ఊహకు అందడం లేదు. మీరు గనుక లలితను చూసి ఉంటే, మీరు 'నేను లలితను కాను' అని చెపుతుంటే నేను ఎందుకు నమ్మలేకపోతున్నానో అర్థమయి ఉండేది. మీరన్న మాటను నేనే కాదు, ఆమెనెరుగున్న వాళ్ళెవరికైనా నమ్మడం కష్టసాధ్యం."

"ఇప్పుడు వాళ్ళు ఎక్కడున్నారు?"

"ఆమె ఓ నెల రోజుల క్రిందట మరణించింది" విచారంగా అన్నాడు.

శ్యామలకు ప్రభాకర్ మీద సానుభూతి కలిగింది. నెమ్మది స్వరంలో అన్నది.

"మీకు ఆ లలిత చాలా ప్రాణంలా ఉన్నారు. ఆమె మరణించిందన్నారుకదా. మరణించిన వాళ్ళెక్కడయినా బ్రతికి రావడానికి అవకాశముందా? ఆమె మరణంతో మీకు మనస్సు సరిగ్గా లేనట్లుంది. నేనిక్కడ అయిదేళ్ళ నుండి పని జేస్తున్నాను. నాకూ, ఆ లలితకు ఇక

సామీప్యం ఎలా కలుసుందో చెప్పండి. నిజాన్ని భరించడం నేర్చుకోవాలిగాని ఇలా మతి పోగొట్టుకోవడం మంచిది కాదు"

ప్రభాకర్ రోషంతో తల ఎత్తాడు - "మీకంటే బాగా మాటలు నేనూ చెప్ప గలను. మీరనుకుంటున్నట్లు నేను పిరికి వాడిని కాలేదు. మతి పోగొట్టుకోలేదు. మనిషిని పోలిన మనుషలుంటారు. కాదనను. కాని ఇంత పోలిక...చివరకు కవలల్లో కూడా ఉండని ఇన్ని పోలికలు మీ ఇద్దరి మధ్య ఉండటం నాకే కాదు లలితను తెలిసి ఉన్న మరెవ్వరికైనా మతి పోగొడుతుంది. సందేహ నివృత్తి కొరకు వచ్చానుగాని మీతో సలహాలు చెప్పించు కుందామని రాలేదు."

శ్యామల అతడి వైపే చూస్తూ కూర్చుంది. చాలా సేపటివరకు ఇద్దరిలో ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఆమె ఎదురుగా, అక్కడ ఇకపై కూర్చోవడం దుర్భరంగా ఉన్నది ప్రభాకర్‌కి. అక్కడ ఉండబుద్ధి కాలేదు అతడికి. అతడికి చాలా అశాంతిగా ఉంది. ఆమెతో వెళ్తున్నానని కూడా చెప్పకుండా లేచి వచ్చేశాడు.

అతడు ఇహ అక్కడ మరోక్షణం ఉండలేకపోయాడు. వెంటనే హోటలు ఖాళీచేసి బయలుదేరాడు.



## 12

ఒరిస్సాదాకా వెళ్ళినతర్వాత ప్రశాంతంగా ఆలోచించాడు. తాను తొందరపడ్డాడని పించింది. అతడి మనస్సెందుకో లలితకు, శ్యామలకు మధ్య ఏదో సంబంధ మున్నదని నొక్కి చెపుతోంది. శ్యామ లకు శనివారం ఆఫ్ అని గుర్తు ఉంది అతడికి. మరలా ఒకసారి శ్యామలను కలుసుకొని చివరిసారిగా అనుమానం తీర్చుకుందామనుకున్నాడు.

తలుపు మీద ఎవరో తట్టడం విని తలుపు తీసిన శ్యామల ప్రభాకర్‌ని చూసి చిన్నగా నవ్వి "రండి" అన్నది. "మీరు హోటల్ ఖాళీచేసి వెళ్ళిపోయారను కుంటాను" అన్నది.

"అవును" అన్నాడు. "మీరు నా రాకను ఊహించి ఉంటారనుకుంటాను."

"ఊహించాను" చాలా ప్రశాంతంగా అన్నది. "అయితే ఫలానా రోజు అని అనుకోలేదు".

ప్రభాకర్ కొంచెం సేపు ఆగి "శ్యామల గారూ! నిజం చెప్పండి. మీకు రామారావు గాని, లలితగాని తెలియరా?" అడిగాడు.

వెంటనే జవాబివ్వలేదు ఆమె. తర్వాత అన్నది "తెలుసు".

"మీరు లలిత కారా?"

"కాను. కాని రామారావు తెలుసు".

"మరి అతడెలా తెలుసు? ముందు మీరు నాతో అబద్ధం ఎందుకు చెప్పారు?"

"నేను ఆ గత విషయాలను గుర్తు చేసుకోదలుచుకోలేదు. పూర్తిగా మర్చి పోవడానికే ప్రయత్నం చేస్తున్నాను. కాని ఇప్పుడు మీకు నిజం చెప్పాలని పించింది. రామారావు నాకు ఇక్కడే పరిచయం. మేమిద్దరమూ వివాహం చేసు కోవాలనుకున్నాము. కాని ఆ రామారావు ఇప్పుడు లేడు"

"లేదంటే నేడు కాకుంటే రేపయినా ఫారిన్ నుంచి తిరిగి వస్తాడుగదా !"

"మీకు తెలియదా? ఈరోజు పేపర్ చూడలేదా? తిరిగి వస్తున్న రామారావు ప్లేన్ ఆక్సిడెంటులో మరణించాడే !"

"ఆ! రామారావు మరణించాడా?"

"అవును ! నాకో పెద్ద బెడద వదిలిపోయింది. అందుకే ఈరోజు మిమ్మల్ని లోపలికి ఆహ్వానించగలిగాను"

ప్రభాకర్ మాట్లాడలేదు. హఠాత్తుగా అతనికో ఆలోచన వచ్చింది. ఈమెకు, రామారావుకు ఉన్న పరిచయానికీ, లలిత అనారోగ్యానికీ సంబంధం లేదుకదా?

"లలితకు ఆరోగ్యం సరిగా ఉండేది కాదు. హిస్టీరియా అన్నారు తెలుసా?"

"తెలుసు"

"చివరకు ఆమె కోటమీద నుండి కిందకు దూకి ఆత్మహత్య చేసుకుంది. ఆ విషయం కూడా మీకు తెలుసు కదా?"

"అసలా విషయాలపై మీకెందుకింత ఆతృత? మీరామెను ప్రేమిస్తున్నారా?"

"ప్రేమా? ఏమని చెప్పను?" విచారంగా నవ్వాడు. మొదటిసారిగా అతడు తన ప్రేమను గురించి మాట్లాడాడు. ఆ మాటలు అతడి గుండెను చీల్చుకొని వచ్చాయి.

ఆమె ఆలోచిస్తూ ఉండిపోయింది. కొంతసేపయిన తర్వాత దీర్ఘంగా ఊపిరి తీసుకొని "ఇదంతా రామారావు ఆలోచన" అంది.

"అంటే? ఎలా?" ప్రభాకర్‌కి అర్థం కాలేదు.

"రామారావు మనస్తత్వం అతడి సన్నిహితులకు తప్ప మిగతావాళ్ళకు అర్థంకాదు. అతడు డబ్బు మనిషే. కాని దాని కొరకు చెడ్డపనులు చేసి సంఘంలో ఒక మచ్చ తెచ్చుకోవడం అతడికి ఇష్టం లేదు"

"అవునట. ఒకసారి ఈ విషయం లలిత కూడా చెప్పినట్లు గుర్తు"

"అతడిది ఓ విలక్షణ వైఖరి. అతడికి సంఘంలో వేలెత్తి చూపబడటం ఇష్టం లేదు...మీకు తెలుసు కదా లలిత పెద్ద అందగత్తె కాదు"

"కాదు" అతి కష్టంమీద అన్నాడు.

అతడు చెప్పిన విధానం చూసి శ్యామల మెల్లిగా నవ్వింది.

"మొదటిసారిగా లలితను చూసినపుడు మీరేమనుకున్నారో చెప్పండి. అది ఫస్టు ఇంప్రెషన్. కాని సాన్నిహిత్యం దానిని మారుస్తుంది. చాలాసార్లు ఫస్టు ఇంప్రెషన్‌తో మనుషలను నిర్ణయించడంలో పొరపాట్లు చేస్తుంటాము. ఎంతో స్నేహపాత్రులు, మంచివారు అనుకున్నవారే తడిగుడ్డలతో గొంతు కోస్తారు. ఎంతో ముభావంగా ఉండి అంటీ అంటనట్టుగా ఉంటారు అనుకున్నవారే ప్రాణం ఇస్తారు.

"లలిత బెంగాలీ. నేనూ బెంగాలీనే ! రామారావు కలకత్తాలో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో లలితతో పరిచయమేర్పడింది. ఆమె తండ్రి డాక్టరు. అతడు సంపాదించిందే కాక, అతడి తాత తండ్రులు సంపాదించిన ఆస్తి కూడా చాలా ఉంది. దానికంతటికీ లలితే వారసురాలు. అయితే ఆమె చాలా వివేకం గలది. ఏ పనైనా ఆలోచించే చేసేది. ఆమెకు తన ఆకర్షణ తన డబ్బేనని తెలుసు. లలితకు స్నేహితులు అనేకమంది. వారిలో ఒకడుగా పరిచయ

మయ్యాడు రామారావు.రామారావులో ఓ ప్రత్యేకత ఉంది. ఏ ఎండకా గొడుగు చాలా తెలివితో పట్టేవాడు. అబద్ధమాడినా నిజంకన్నా పదునుగా ఉండేది నమ్మించటంలో. అమాయకత్వంలోచిన్నపిల్లలనే మరపించేలా నటించేవాడు. అన్నాళ్ళుగా ఏందరి మోసాలనో భేదించిన లలిత రామారావు మోసానికి తల వంచింది. అతడెలాంటి వాడైనా అద్భుతమైన తెలివితేటలు గలవాడని మటుకు ఒప్పుకుతీరాలి. అతడి మత్తులో పడిపోయి అతడు తన డబ్బుని కాక తననే ప్రేమిస్తున్నాడని దృఢంగా నమ్మింది. కాని ఆమె తండ్రి ఈ వివాహానికి అభ్యంతరం చెప్పాడు. ఆయన జీవితంలో ఢక్కా మొక్కీలు తిన్న డాక్టరు. ఆయన తేలిగ్గానే రామారావు విషయం పసిగట్టాడు. లలిత అనేక నిదర్శనాలు చూపి రామారావు నిజాయితీని రుజువుచేసి తండ్రిని ఒప్పించింది. కూతురుని ఒప్పించలేక ఆ తండ్రి ఒప్పుకున్నాడే తప్ప అతడికి రామారావంటే సురాతమూ ఇష్టంలేదు. వివాహమైన తర్వాత రామారావు లలితను డబ్బు కొరకు ఏనాడూ వేధించలేదు. పైగా చాలా అపురూపంగా చూసుకున్నాడు ఆమెను. అది తర్వాత జరగబోయే నాటకానికి నాందీ పలుకు. అతడు తగిన అవకాశం కొరకు వెతుకుతున్నాడు"

"ఎలా ?"

"అతడి పెళ్ళయిన కొత్తలో అప్పుడు నేను ఈ హోటల్లోనే పనిచేస్తున్నాను. కాకతాళీయంగా మేమిద్దరం కలుసుకోవడం సంభవించింది. లలిత అతడి మోసంలో ఎలా పడిపోయిందో నా స్థితి కూడా అలానే తయారయింది. 'మనకు లలిత అడ్డు. నాకు ఆమె వలన ఆనందం లేదు. ఆమెను వదిలించుకుంటే తప్ప మనకు స్వేచ్ఛలేదు' అన్నాడు. లలిత నిష్క్రమణ చాలా స్వాభావికంగా జరగాలన్నాడు. అందుకు తనో మార్గం ఆలోచించానని, దానికి నా సహకారం కావాలని అన్నాడు. అది ఎటువంటి సహాయమో చెప్పలేదు. మొత్తానికి అతడు చెప్పిన పనల్లా నేను తుచ తప్పకుండా చేయాలి. అప్పటినుండి అతడు కొన్ని షార్ట్ ఫిల్మ్స్ నాకు తెచ్చి ఇచ్చాడు. అవి అతడి ఇంటిలో లలితను తీసినవి. హోమ్ ప్రొజెక్టరు తెచ్చిఇచ్చాడు. ఆమె స్వరాన్ని రికార్డుచేసిన టేప్స్ తెచ్చాడు. ఆమె హాండ్ రైటింగు, ఆమె రొటీన్, ఆమెపై అతడి అబ్జర్వేషన్, ఆమె ఫొటోలున్న ఆల్బం-ఇలా అన్నీ తెచ్చిఇచ్చి ఆమెను ఇమిటేట్ చేయమన్నాడు. అనుకున్నట్లుగా అతి త్వరలోనే నేనా పనిని విజయవంతంగా సాధించాను. మా ప్రయత్నం ఎంతవరకు ఫలించిందంటే నేను ఆమెకు షాడోలా మారాను. ఒకటేమిటి, ప్రతి చిన్న పనిని అనుకరించి చివరకు ఆ అలవాట్లు నా స్వంత అలవాట్లే అని నమ్మగలిగే స్థితికి వచ్చాను. రామారావుకు తనకేం కావాలో తెలియడమే కాదు, వాటిని సాధించడానికి నిజాలుగా అనిపించే అనేక భయంకర ఉపాయాలను సిస్టమాటిక్‌గా ఆలోచించి చేయగలడు. అతడి తోడ్పాటుతో నేను లలితకు ఛాయనయ్యాను. అన్నింటికి మించి ఆమె స్వరం, నా స్వరం ఒకే పోలికతో ఉంది. ప్రతిబింబాలకున్నంత శారీరక పోలికలు నాకూ, లలితకూ ఉండటం ప్రకృతి వైచిత్రి"

"తర్వాత?"

"రామారావుకు లలిత వీక్ పాయింట్స్, స్ట్రాంగ్ పాయింట్స్ తెలుసు. ఒకసారి లలితకు హిస్టీరియా వచ్చింది..."

"ఎలా?"

"రామారావు ఆమెకు తెలియకుండానే ట్రాంక్విలైజర్స్, యల్. యస్. డి. వంటి మత్తుమందులు స్ట్రాంగ్ డోసెస్‌లో ఆమెకిచ్చేవాడు."

"ఆమె ఎలా తీసుకునేది? అసలు అనుమానమే రాలేదా?"

"లేదు. అమె అతడిని ఎంతగా నమ్మిందంటే అతడు తనకిచ్చే ప్రతి టాబ్లెట్ తన ఆరోగ్యానికనే నమ్మింది"

"ఎలా?"

"లలితకు ఎరుపు రంగంటే చాలా భయం. మనిషి నిద్రావస్థలో ఉన్నపుడు గూడ అతడు పడుకొని నిద్ర పోతున్న గదిలోని దీపం కాంతి అతని మనస్సుపై ప్రభావం కలిగిస్తుంది.

ఒకసారి ఆమెకు మామూలు జ్వరం వచ్చింది. ఆమె రెండు రోజులు ఆహారం లేక నీరసపడిపోయింది. రామారావు ఈ అవకాశాన్ని ఉపయోగించుకొన్నాడు. ఆమె జ్వరంతో బాధపడుతున్న రోజుల్లో ఆమె నిద్రపోయే సమయంలో ఆమె గదిలో ఎర్రటి దీపం అమర్చేవాడు. ఆమె ఆ ఎర్రటి కాంతికి ఉలిక్కిపడి లేచేది. అసలే శరీరారోగ్యం బాగులేనపుడు ఈ ప్రయోగం ఆమెను మానసికంగా బలహీన పర్చింది. రామారావు 'అది ఎర్రటి దీపం కాదని, ఆమె భ్రమపడుతోందని' బుజ్జగించి ట్రాంక్విలైజర్స్ అలవాటు చేశాడు. నెమ్మదిగా అలా అలవాటు పడి పోయింది వాటికి. ప్రతిరాత్రి ఈ ఫార్స్ జరిగేది. ఈ విధంగా జరిగిజరిగి చివరకు ఆమెకు తనమీద తనకే నమ్మకం లేని స్థితికి వచ్చింది. అది హిస్టీరియాలోకి దిగుతున్న రోజుల్లోనే ఆమె తండ్రి మరణించాడు. ఆ దుఃఖం ఆమెను మరీ దిగజార్చింది. ఆ ప్రవర్తనను అతిగా చేసి ఆమెకు చెప్పేవాడు రామారావు. చెప్పి ఆమెలో 'తను జబ్బుమనిషిననే' భావం కలుగజేశాడు. మన సంతోషం గాని, దుఃఖంగాని మన భావనలోనే ఉన్నాయి. కాని జరిగే పనులలో లేవు. మనం సంతోషంగా వున్నాం అని ఖచ్చితంగా నమ్మగలిగితే దుఃఖం మనస్సునుండి జారి పోతుంది. అలా నమ్మడానికి చాలా ఆత్మ శక్తి కావాలి. భావాలకు అతీతంగా ఉండగలిగే శక్తి కావాలి. అయితే సామాజిక కారణాల వల్ల, అభిమానం వల్ల అటువంటి శక్తి యోగులు తప్ప సామాన్యులు కావాలని అభిలషించరు. లలితకు నిజంగా ఉన్న అస్వస్థతకన్నా రామారావు మళ్ళీ మళ్ళీ చెప్పే మాటలవలన తనకు చాలా అనారోగ్యంగా ఉందని గట్టిగా నమ్మి అలానే ప్రవర్తించింది. ప్రవర్తన ఎప్పుడూ నమ్మకాన్ననుసరించే ఉంటుంది. నిజానికి ఆమె చాలా సాధు స్వభావురాలు. తండ్రి మరణానికి ముందు ఆమె స్థితి అంతగా దిగజారి పోలేదు. ఆయన మరణం రామారావు ఆలోచనలకు సహకారే అయింది. ఆయన పోవడంతో ఆమె మరీ ఒంటరిగా ఫీలయ్యేది. రామారావుని ఆమె ఎన్నడూ సన్నిహితంగా అనుకోలేకపోయింది. అలా అనుకోలేకపోవడం పాపపుటాలోచన అని దాని పరిష్కారానికి మార్గం వెదుక్కునేది.ఆమెలోని ఆ పశ్చాత్తాపం కూడా రామారావు సమస్యను సులభతరం చేయడానికే తోడ్పడింది. మనస్సులో రామారావుకు తనంటే ఇష్టంలేదనే అనుమానం పీడిం

చినా అతడి చర్యలేవీ ఆ అనుమానాన్ని ఋజువు పర్చలేకిపోయాయి. ఆమె అధో గతికి అతడే మూలకారణమయినా ఆమె తెలివిలో ఉన్నపుడు ఆమెపై ఎంతో ప్రేమ నటించి ఆమె స్థితికి ఆమెకన్నా తనే ఎక్కువ బాధపడేవాడు. ఆమె సానుభూతి కొరకు ఆఫీసు మానుకొని ఆమె ఎదురుగానే కూర్చునేవాడు. ఈ రోజు ఒక రూపాయి నష్టాన్ని కోరు కుంటున్నాడంటే దాని మూలాన అతడికి రేపు పది రూపాయల లాభమున్నదన్న మాట. అతడి జిత్తులను లలిత నిజమనే నమ్మి తనమూలాన అతడు ఆఫీసు మాను కోవడం అనవసరం అని అతడిని బల వంతంగా ఆఫీసుకు పంపేది. అతడు ఎంతో కష్టంమీద, ఆమె బలవంతంమీదే వెళుతున్నట్లు వెళ్ళేవాడు. అంతకు ముందు ఎంత సజీవంగా ఉండేదో,చివరికి ఎలా మారిపోయిందో చూడు" అంటూ శ్యామల ప్రభాకర్‌కి ఓ ఆల్బం ఇచ్చింది.

ఆ ఆల్బంలో లలితఫొటోలు డేట్సుతో



సహా ఉన్నాయి. వాటిల్లో కొన్నింటిని ఇంతకుముందు లలితవద్ద చూశాడు. ఆ ఫొటోలు చాలా క్లియర్‌గా అన్నీ కార్డు సైజులో ఉన్నాయి. వాటిని చూస్తున్న కొలదీ ప్రభాకర్ గుండె పిండివేస్తున్నట్టయింది. అతడిలోని చైతన్యం నెమ్మదిగా మత్తులోకి జారిపోతోంది. అతను శ్యామల చెప్పే మాటలకు ఏ విధమైన రియాక్షన్ చూపించకుండా వింటున్నాడు. ఆమె చూపించే ఫొటోలు చూస్తున్నాడు. మరి, అతడి మనస్సు ఏం ఆలోచిస్తోందో? విన్నదీ, కన్నదీ అంతా అంతరంగంలో నిక్షిప్తమైపోతోంది గాని తదుపరి ఆలోచనలేమీ కలిగించడం లేదు.

"ఆమెను మామూలు మనిషిగా చేయాలంటే ముందు ఆమె భయాన్ని పోగొట్టాలి. కాని రామారావు అవసరం వేరు. అందుకు చేయాల్సిన పనికి సరిగ్గా వ్యతిరేకంగా చేసేవాడు. ఆమె భయాన్ని అధికం చేసేవాడు..."

ప్రభాకర్‌కి లలిత తనవద్ద ఎంత రిలీఫ్‌గా ఫీలయ్యేదో గుర్తుకు వచ్చింది. ఇదంతా వింటుంటే ప్రభాకర్‌కి రామారావు ఏం చదివాడు అనే సందేహం కలిగింది. అదే ప్రశ్న శ్యామలను అడిగాడు.

అతడి ప్రశ్న విని శ్యామల నవ్వింది. "చదువుకు, చెడ్డతనానికి సంబంధంలేదు" అన్నది.

"అతడు లలితనింత బాధకు గురి చేయాల్సిన పనిలేదు. ఒక్కసారే చంపవచ్చు కదా?" అడిగాడు.

"ఒకసారి నేనూ అతడిని అదే అడిగాను. అతడు చాలా ప్రాక్టికల్ మనిషి. ఒక పని చేయాలంటే దానివల్ల లాభం పొందే పద్ధతి ఎక్కువ ఎలా వస్తుందో ఆలోచించిగాని చేయడు. ఇంత జాగ్రత్తగా ప్రవర్తించే వాడయినా లలిత తండ్రిని మటుకు నమ్మించలేకపోయాడు. లలిత డాడీ తన వీలునామాను చాలా రహస్యంగా వ్రాయించి ఉంచాడు. రామారావు ఎలానో తన మేధస్సుపయోగించి ఆ వీలునామా నకలును సంపాదించాడు. దానిని బట్టి ఆ ఆస్తిమీద లలితకు, ఆమె సంతానానికి తప్ప తనకేమాత్రం హక్కులేదని అర్థమయిందతనికి. లలిత మరణం సహజమయితే తప్ప అతడికా ఆస్తి చెందదని తన ప్లీడరును సంప్రదించి తెలుసుకున్నాడు. అప్పటినుండి ఈ 'షో' మొదలయింది."

"నీవు చెప్పినది నాకు అవగాహన కాలేదు."

"ఆ వీలునామాలో ఆస్తి లలితకూ, ఆమె బిడ్డలకూ అని ఉంది. ఒకవేళ లలితకు కనక బిడ్డలు లేకుండా, అనుమానాస్పద పరిస్థితులలో మరణిస్తే ఆ ఆస్తి కలకత్తాలో ఉన్న ఆర్ఫనేజ్‌కి వెళ్ళిపోతుంది. ఈ విషయాలన్నీ గమనించడానికి ఆమె తండ్రి ప్రాణ మిత్రుడయిన ఓ రిటైర్డ్ జడ్జిని ఆమెకు కేర్‌టేకర్‌గా పెట్టాడు. రామారావుకు మొదట్లో ఈ విషయాలు తెలియవు. వాళ్ళ పెళ్ళికి ముందు ఆమె తండ్రి వాళ్ళ పెళ్ళి గనుక జరిగితే పైసలతోసహా ఆస్తి ఆర్ఫనేజ్‌కి పోయేటట్లు వీలునామా రాశానని చెప్పి అలా రాసిన వీలునామా చూపించాడు. అప్పుడు గనుక వెనక్కు తగ్గితే నిజంగా తను ఆస్తికొరకే లలితను చేసుకోవడానికి తయారయ్యాడని వాళ్ళందరికీ చెడు అభిప్రాయమిచ్చినవాడవుతాడని భయపడి లలితను వివాహం చేసుకున్నాడు రామారావు. రామారావుకు డాక్టర్ తన కూతుర్ని ఎంతగా ప్రేమిస్తాడో తెలుసు.

ఆమెకు ఏ రోజుకైనా అన్యాయం చేయడని అతడి నమ్మకం. నిజానికి అంతా అతడు అనుకున్నట్లే జరిగింది. లలితకు హిస్టీరియా ఉన్నా వీలునామాలో ఆమె అనుమానాస్పద పరిస్థితులలో మరణించగూడదని స్పష్టంగా ఉంది కాబట్టి ప్రతి డాక్టరు రిపోర్టు క్లీన్‌గా ఉండేటట్లు చూసుకున్నాడు. తనవలన లలిత బాధపడుతున్నదనే విషయం మరో ప్రాణికి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. తన నటన చాలా స్వాభావికంగా చేశాడు."

"అతడు హిస్టీరియా పద్ధతినే ఎందుకు ఎన్నుకున్నాడు?"

"ఆమే ఆమె మరణానికి కారణం కావాలని. మిగతా పద్ధతులమీద దీనికున్న అవకాశం ఏమంటే, ఇది కొంచెం సమయం తీసుకున్నా కర్తకు అపాయం చాలా తక్కువ. అతడు 'మనిషి తన మనస్సుకి బానిస. ముందు దానిని వశపర్చుకుంటే ఆ మనిషి వశ్యుడవుతాడు' అంటారు. ఇటువంటి మోసం చాలా నమ్మకం మీద ఎంతో నమ్మకంగా సాధ్యమవుతుంది. దీనిని గూర్చిన అనేక విషయాలు అతడు నాకు చెప్పాడు. టేప్ కూడా చేసి ఇచ్చాడు. వినండి" అని టేప్ రికార్డ్‌లో ఒక టేప్ పెట్టి ఆన్‌చేసింది శ్యామల.

"మనిషి ఎప్పుడూ తన మనస్సుని కొంత భాగమైనా దాచిపెట్టుకోవాలని చూస్తాడు..."

ఈ మొదటి వాక్యమే ప్రభాకర్‌ని ఆకర్షించింది. ఆసక్తిగా ముందుకు వంగి టేప్‌లో రామారావు స్పీచ్ వినసాగాడు.

"...కాని నిద్రావస్థలో అది సాధ్యపడదు. అది సహజావస్థ. ప్రయత్నపూర్వకంగా మనస్సుని శరీరం అధికారం నుండి విడదీయవచ్చు. అది నిద్ర, ఇది హిప్నోటిజమ్. నిద్ర అనేది మనిషి జీవితంలో చాలా విచిత్రమైన స్థితి. నిద్రలో కల వస్తుంది. మనిషి తను అనుకునేదే, కోరుకునేదే తనకలలో చేస్తాడు,చూస్తాడు. ఆ కలలను అంతర్దృష్టితో ఆలోచించి అర్థం చేసుకుంటే ఆ విషయం అర్థమవుతుంది. వాస్తవ ప్రపంచంలో అతడి కోరికలు అసంగతమూ; అబద్ధమూ కావచ్చు. కాని కలలలో ఆ కోరికలు రెక్కలు విప్పుకొని ఆ గంటసేపూ అతడిని తారావీధిని తిప్పుతుంది. కల అంటే శరీరంతో మనస్సు మాట్లాడటం. శరీరం వ్యక్తిత్వాన్ని మనస్సు వివరించిచెప్పడం. కాలం, దూరంతో దానికి సంబంధం లేదు. లలిత ఎప్పుడూ తనకు ఒక కల వస్తుందని చెపుతూ ఉంటుంది. ఆ కలలో ఆమెకు తన పరిసరంలోని ప్రతి వస్తువూ ఉన్నతంగా ఎదిగిపోయినట్లు, తాను ఎంతో కుంచించుకపోయినట్లు, ఆ పెరిగిపోయిన వస్తువు శక్తి ముందు తాను శక్తిహీనురాలననిపిస్తుందట. అంటే ఆమె ఒంటరితనంతో బాధపడుతోంది. తనకు రక్షణ కరువైనదని భయపడుతోంది. ఆమె చిన్నపుడే తల్లి మరణాన్ని చూసింది. తండ్రి పెంపకంలో చాలా గారాబంగా పెరిగింది. చదువుకునే రోజుల్లో ఆమెకు ఎందరో స్నేహితులు. అయినా ఆమె నుండి ఆ భయం తొలగిపోలేదు. ఆమెకు తను బాగా నమ్మినవాళ్ళని గూర్చి చేసే ఆలోచనల్లో తనకే నమ్మకం ఉండదు. ఎప్పుడు తన మీద తనకే నమ్మకం పోతుందో, ఎప్పుడు తన నీడను చూసి తానే భయపడతాడో ఆరోజునుండే అతడి పతనం మొదలవుతుంది. అలాంటి అపనమ్మకం

కలుగజేయడం అతడి బలహీనతలను బంధించగలిగినపుడే సాధ్యమవుతుంది.

అసలు శాంతి, అశాంతికి కారణాలు మనం అనుకోవడంలోనే ఉంది. ముందు ఏడ్చి తర్వాత బాధ కలిగిందనుకోము. ముందు బాధ అనేది కలిగిందనుకుంటేనే ఏడుస్తాము.

హిప్నొటిజమ్ సైన్స్. దానిని అన్ని సైన్స్‌లలానే మంచీ చెడుకూ ఉపయోగిస్తారు. ఆ స్థితిలో వ్యక్తి మానసికానుభవాన్నే శారీరకానుభవంగా భావిస్తాడు. అలానే ప్రవర్తిస్తాడు. ఈ స్థితి సూటిగా మనస్సుకే సంబంధిస్తుంది. అప్పుడాతడు తనను ప్రభావితం చేస్తున్న వ్యక్తి ఆదేశాలకు బానిసయై అతడు చెప్పినదే నిజమని భావించి, అనుభవిస్తాడు. ఇదంతా కేవలం నమ్మకం మీదనే సాధ్యమవుతుంది. 'నమ్మకం' అనే మాటను ఎందుకుపయోగిస్తున్నానంటే నీవు ఒక వ్యక్తిని



గనుక మనస్ఫూర్తిగా నమ్మకూడదు అని నిర్ణయించుకున్నట్లయితే ఆ వ్యక్తి ప్రయత్నం నీ యెడల వ్యర్థమవుతుంది. అంటే ఇందులో కో–ఆపరేషన్ మానసికంగా రావాలన్న మాట. ప్రయత్నమనే పాలు విరగడానికి అపనమ్మకమనే పులుపే కారణం.

నీవు ఒక వ్యక్తితో గమ్యం తెలియకుండా వెళ్ళిపొమ్మని చెపుతావనుకో ఒక స్థితిలో. అతడలా వెళ్ళిపోతూ ఉంటాడు. ప్రమాదానికి లోనై మరణించినా అతడికి తెలియదు. ఇది ఇమిటేటివ్ ఆటోమాటిజమ్. దీనిలో ప్రీ టైమ్డ్ సజెషన్స్ ఇస్తారు. అవి పోస్టు హిప్నాటిక్ సజెషన్స్. వాటిని అతడు మర్చిపోయినా అతడి మనస్సుమటుకు బాగా గుర్తుపెట్టుకుంటుంది. నీకు విషయాలన్నీ నీకు అవసరమైనంత వరకే క్లుప్తంగా చెపుతున్నాను.

మనం చెప్పిన ఆ పోస్టు హిప్నాటిక్ సజెషన్ ఎంత చేయగూడనిదైనా మన శక్తిని ఆ మనస్సు ఎదిరించలేదు. ఈ నిస్సహాయతకు కారణం ఒకసారి ఆ మనస్సు మన శక్తి గొప్పతనాన్ని ఒప్పుకొని నమ్మింది. అతడి మనస్సు నీ ఆత్మశక్తికి బానిస కాబట్టి అతడి జీవశక్తి నీ ఆట బొమ్మ.

నిద్రలో నడిచి వెళ్ళడాన్ని సోమ్నాంబులిజమ్ అంటారు. దీనిని పోస్టు హిప్నాటిక్ సజెషన్స్ ద్వారా సాధించవచ్చు."

ప్రభాకర్ చటుక్కున ఆఫ్ చేశాడు.

శ్యామల అతడివైపు ఆశ్చర్యంగా చూసింది. "ఏం?" అడిగింది.

అతడు బాధగా కణతలు నొక్కుకుంటూ "నాకేమీ అర్థం కావడం లేదు. తల తిరిగిపోతోంది" అన్నాడు.

"కాఫీ ఇవ్వనా?" శ్యామల అడిగింది.

"ఊ" అన్నాడు.

శ్యామల లోపలికి వెళ్ళింది.

ప్రభాకర్ ఆలోచనల్లోకి జారిపోయాడు–ఒకవైపు బాధతో తల పగిలిపోతున్నా.

రామారావు ఎంతైనా తెలివిగలవాడు. కాని అతడు తన తెలివిని అలా చెడుకొరకే ఎందుకుపయోగించాడు? వజ్రం శోభ ఆభరణంలో పొదిగినపుడు గాని బోపిడిలో ఉపయోగించినపుడు కాదు. డబ్బు మీద వ్యామోహంలో తనను నమ్మిన అమాయకురాలిని ఎందుకలా తడి గుడ్డతో గొంతు కోశాడు? అతడి బాల్యం చాలా దుర్భరమై ఉండాలి. పిల్లలేదో మాట్లాడుతారు. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తారు; ఏదో చేయాలని చూస్తారు. పెద్దవాళ్ళకవి చిన్న విషయాలుగా తోచి ఆ పిల్లల ఆసక్తులను నిర్లక్ష్యం చేస్తారు. పెద్దవాళ్ళకవి చిన్న విషయాలే. కాని పిల్లలకు అవి చాలా ముఖ్యమైన విషయాలు. వారి కోరికలు తీరనినాడు ఆ పెద్దరికాన్ని అసహ్యించుకుంటారు. ఈ భావన క్రమేపీ ప్రపంచం మీదే ద్వేషంగా మారుతుంది. వారిక ప్రేమ, జాలి వంటి సున్నిత పదాలకు అర్థం నేర్చుకోలేరు. ఆ అర్థాలు పెద్దవాళ్ళు తమ ప్రవర్తన ద్వారా నేర్పాలి గాని ఏ డిక్షనరీ ద్వారా కాదు. వాటి అర్థాలు తెలియనివారు వాటిననుభవించలేరు కూడా. పెద్దలు పిల్లలపై కఠిన క్రమశిక్షణ నియమాలను విధించి, వాటినీ పొల్లుపోకుండా ఆచరించాలని ఆదేశిస్తారు. పిచ్చిపిల్లలు. ప్రేమను తప్ప దేనినీ అర్థం చేసుకోలేని ఆ పిల్లలు ఈ నిర్దేశనలతో పిరికిగా,తప్పు చేశాననే భావనతోనో

లేక సంకుచిత మనస్తత్వంతోనో, కపట వ్యక్తిత్వంతోనో పెరుగుతారు. గులాబీ పరిమళం, వెన్నెల వెలుగు, తేనె మాధుర్యం కలసి రూపొందిన పసిబిడ్డ పెద్దవాళ్ళ...వాళ్లు తల్లిదండ్రులే కానీ, ఉపాధ్యాయులే కానీ అధికారతత్వానికి, అజ్ఞానానికి ఎంత వికృత రూపం సంతరించుకొని పెరుగుతోంది!

శ్యామల కాఫీ తీసుకొని వచ్చింది. కాఫీ అతడికి ఇస్తూ "ఏమిటాలోచిస్తున్నారు?" అడిగింది.

"రామారావు ఎలా ఇలా తయారయ్యాడా అని ఆలోచిస్తున్నాను. బాల్యాన్ననుసరించే వ్యక్తిత్వం పెరుగుతుంది. పిల్లల మనస్సు కనుగుణంగా పెద్దవాళ్ళు మారాలిగాని వారి సమస్యల కనుగుణంగా పిల్లల మానసికారోగ్యాన్ని దిగజార్చడం హర్షదాయకం కాదు. రామారావు విషయంలో ఇదే జరిగి ఉంటుందని నేను అనుకుంటున్నాను. తల్లి దగ్గర నుండే నిరాదరణ ఎదురై ఉండాలి. పసివాని ప్రపంచంలో ఐదారుగురికి మించి జనాభా ఉండరు. ఆ చిన్న ప్రపంచమే, ప్రేమ రహితమై, స్వార్థపూరితమై ఉన్నపుడు ఈ ప్రపంచమంతా అంతేనని ఆ పిల్లవాడు భావిస్తాడు. అలానే ఎదుగుతాడు"

శ్యామల మాట్లాడలేదు.

ప్రభాకర్ తాగిన గ్లాసు టీపాయ్ మీద పెడుతూ "పిల్లలు భవిష్యత్‌లో మారే అద్దాలు. ఈనాడు వారితో వ్యవహరించే పెద్దల ప్రవర్తన తీరే రేపు వారిలో ప్రతిఫలించేది. పిల్లలు నేర్చుకోవడానికి పెద్ద వాళ్ళలా ఏమీ అడగరు? వారికి కావాల్సినదల్లా అవకాశ మొక్కటే" అన్నాడు.

శ్యామల మౌనంగా వింటోంది- "రామారావు ఎంత నాజూగ్గా, పట్టుదల సాధించాడు! ఎంతటి స్థిర నిశ్చయం! చివరికే విధి నెదుర్కొన్నాడూ!" నిట్టూర్చింది.

టేప్‌రికార్డర్ వైపు చూసి "వింటారా?" అన్నది ప్రభాకర్‌తో.

"ఊ" ఇన్నాడు.

శ్యామల ఆన్ చేసింది.

"...హిప్నాటిజమ్‌లో వ్యక్తి లోకం వేరు. అందులో వ్యక్తి అంతరాత్మకు నోరు వస్తుంది. అది ఆర్టిఫిషియల్ స్లీప్. నిద్ర కేవలం విశ్రాంతే కాదు, అనుదిన జీవిత రహస్య ఘటన, నిఘంటువు, సింహావలోకన. ఆ నిద్రలో నీవు అతడి దృష్టిని ఓ ప్రత్యేక సంఘటనపై కేంద్రీకరింపజేస్తావు. ఈ విచిత్రస్థితే హిప్నాటిక్ ట్రాన్స్ ప్రత్యేకత. నిజం చెప్పాలంటే ఈ విద్య మన జీవితంలో కలిసే ఉంది. అది మనస్సుపై మాట వ్రాసే శాస్త్రం..."

శ్యామల ఆఫ్‌చేసి చెప్పసాగింది. "నేను తరచూ దీనినివినే దానిని. ఇందులోని ప్రతి అక్షరం క్షుణ్ణంగా అర్థమవడానికి రామారావు ఎన్నో ఉదాహరణలిచ్చేవాడు. అతడు పలికిన ప్రతి అక్షరం వెనుకా ఓ ప్రత్యేక అర్థమున్నది. అతడు మాట్లాడిన ప్రతి వాక్యమూ భావగర్భితం..."

టైం చూసుకొని "భోజనానికి ఏర్పాట్లు చేస్తాను. ఓ పది నిమిషాలు" అని లేవబోయింది.

"లేదు, లేదు వెళ్ళిపోవాలి. చెప్పండి" అన్నాడు.

ఆమె నవ్వింది. "అలా కుదరదు. భోంచేసిన తర్వాతే చెపుతాను. మీ తలనెప్పి ఎలా ఉంది?"

"తగ్గినట్లున్నది".

"కొంచెం సేపు ఈ పేపరు చూస్తూ ఉండండి. ఈ ఈజీచైర్‌లో రిలాక్సవండి. ఇప్పుడే వస్తాను" అని పేపరు ప్రభాకర్‌కి ఇచ్చి లోపలికెళ్ళిపోయింది శ్యామల.

ప్రభాకర్ ఈజీ చైర్‌లో వాలి ఓ నిమిషం పాటు అలసటగా కళ్ళు మూసుకున్నాడు. అతడి మనస్సు దీర్ఘంగా ఆలోచించడం లేదు. అసలు ఆలోచించే స్థితిలోనే లేదు. శ్యామల ఎవరో, లలిత ఎవరో! ఎవరు, ఎందుకు, ఎప్పుడు పరిచయమయ్యారో కూడా గుర్తుకు రాని విచిత్రమైన స్థితిలో పడిపోయాడు. మార్పు కొరకు పేపరు తిరుగవేశాడు. కొంత రిలాక్సయ్యాడు. టీపాయ్‌మీద ఉన్న ఆల్బం తీసుకొని మరోసారి తిరగేశాడు. వివిధ భంగిమల్లో లలిత... చాలా నిర్లిప్తంగా ఆ ఫొటోలను చూస్తున్నాడు. అంతరాత్మ లేని మనిషిలా, నిర్జీవ శిల్పంలా ఆల్బం పేజీలను తిరగేస్తున్నాడు. ఒకప్పుడతడి ఆత్మకు రంగులు దిద్ది, అతడి జీవితంలో ముఖ్యమలువుగా మారిన లలిత ఈ ఫొటోల్లోనే ఉందిప్పుడు. ఆమె మిగిల్చిన స్మృతులేవీ గుర్తు తెచ్చుకోలేని స్థితిలో ఉంది అతడి మనస్సు. అది మన్ను తిన్నపాము నిద్రావస్థ. అతడు ఆలోచనా రహితంగా, ప్రశాంతంగా, తుఫాన్ రాబోయే ముందుండే వాతావరణంలా గంభీరంగా ఉన్నాడు. ఆ క్షణంలో అతడిని గనుక శ్యామల చూసి ఉంటే 'అతడు తన మాటలు విన్నాడా లేదా' అనే అనుమానం కలుగక మానదు.

భోజనాలు ఏ ప్రత్యేకత లేకుండా జరిగిపోయాయి. ప్రభాకర్ దృష్టి అంతా శ్యామల చెప్పబోయే విషయాలపై ఉంది. అందుకే అతడికి మిగతావేమీ రుచించడం లేదు. భోజనాలయిన తర్వాత శ్యామలతో అన్నాడు.

"మీరు చెప్పేది చాలా ఆశ్చర్యంగా, విచిత్రంగా ఉంది. నాతో లలిత ప్రవర్తన చాలా సాధారణంగా, ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉండేది. కాని రామారావు చెప్పిన మీదట ఓసారి వాళ్ళింటి కెళ్ళి ఆమె సోమ్నాంబులిజమ్‌ని పరిశీలించాను. ఓహ్! ఆ రాత్రి టెరిబుల్! నా జీవితంలో మర్చిపోలేను. డాక్టర్ కృష్ణమోహన్ మా అంకుల్ సైకియాట్రిస్టు. ఆయన కూడా లలితను టెస్టుచేసి ఏమీలేదన్నారు. లలిత నన్ను ఫూల్‌ని చేసింది...అని నేను అనుకోజాలను. రామారావు థియరీ బాగానే ఉంది. ప్రాక్టికల్‌గా కూడా అంతే జరిగిందా?"

"అవును అంతే జరిగింది. లలిత ఎవరినీ ఫూల్‌ని చేయలేదు. మన ముగ్గురినీ రామారావే చేశాడు"

"ఎలా?"

శ్యామల కొంచెం తటపటాయిస్తూ అన్నది "అతడి ప్రవర్తనకు మరోకారణమున్నదని నా అనుమానం"

"అంటే? మరో ప్రయోజనాన్నిదేన్నయినా ఆశించాడా?"

"అతడు శాడిస్టు"

"శాడిస్టా!" ప్రభాకర్ ఆశ్చర్యపోయాడు.

"అనే నేను అనుకుంటున్నాను. శాడిస్టు ప్రేమ కష్టపెట్టడంలోనే ఉంటుంది. ఆర్టిస్టు తన తపన తీర్చుకోవడానికి తెల్ల కాగితాన్ని ఎలా ఉపయోగిస్తుంటాడో రామారావు లలితనూ అలా ఉపయోగించుకున్నాడు. చివరకు నన్ను కూడా! అతడిది పర్వర్షన్. అతడి తృప్తి

ఎదుటివాళ్ళ వినాశంలో ఉంది. అతడిలో విచ్చలవిడితనం మటుకు లేదు. అతడు తన ఆలోచనల్లోకి వచ్చే విచిత్ర భావాలన్నీ లలితమీద ప్రయోగించి ఆమెను మానసిక చిత్రహింస పాల్చేశాడు. అతడి ప్రయోగాలకు ఆమె గినీపిగ్ అయింది"

'అందుకేనా ఆమెకు గినీపిగ్స్ మీద వాత్సల్యం? తన నిస్సహాయ స్థితిని తనకు తెలియకుండానే వాటిల్లో చూసేదా?' అనుకున్నాడు.

"రామారావు నిష్క్రమణ వరకు నేనూ ఆ విషయం గూర్చి ఆలోచించలేదు. ఆ తర్వాత ఎందుకో రామారావు పర్వర్టెడ్ పర్సన్ అని బాగా నమ్మకం కలుగుతోంది. మిగిలినవాళ్ళు కొట్టి, తిడితే ఇతడు మనసుని వేగంగా తిరిగే మరపళ్ళ చక్రాల మధ్య పెట్టి ఆనందించేవాడు. దీనికి కారణం మీరన్నట్లు అతడి బాల్యపు చిన్న ప్రపంచం దుర్భరమై పోవడమే. ఆ వయసుకి వారికా ప్రపంచం చాలు. ఆ నిరాదరణ చాలు వారిని పర్వర్షన్‌లో దింపడానికి. అలా పెరిగినవాళ్ళు ఎదిగే కొలదీ ప్రపంచం అందించే ప్రేమను గ్రహించడం చేతకాక దాని మీద ద్వేషం పెంచుకుంటారు. పిల్లలు మైనపు ముద్దలు. మనం ఏ ఆకారమిస్తే అలా పెరుగుతాయి. అటువంటి వారే పెరిగి పెద్దయిన తర్వాత తమ భార్యనుగాని, భర్తనుగాని హింసించి తమకు లేని ఆరోగ్యపు ఆలోచనలు వారికున్నందుకు శిక్షగా హింసను ప్రసాదిస్తారు. అలా శిక్షించడంలోనే తృప్తి పొందుతాయి. తమ అనారోగ్యం, అశాంతి సంతృప్తి చెందినవని భావిస్తారు"

"ఇటువంటి రామారావులనుండి లలితలకు విముక్తి లేదా?"

"విముక్తా?" పల్చగా నవ్వింది శ్యామల. "నీ మనసే పిచ్చిగా నమ్ముతున్నపుడు నీ శరీరం, దాని బానిస ఎలా తప్పించుకోగలదు వీరినుండి?"

ప్రభాకర్‌కి ఆమె మాటలు అర్థం కాలేదు, సంతృప్తినివ్వలేదు. శ్యామల స్వరంలో ఆవేశంలేదు. ఆమె ప్రతి సంఘటనను వివరిస్తోంది. ఏయే పరిస్థితులు ఎలా ఎలా కూడి లలితను బలిచేశాయో చెపుతోంది. ప్రభాకర్‌కి విషయాన్నంతా ఒక్కసారే వినేయాలని ఉంది. కాని ఆమె విషయ వివరణ అతడి ఆత్రుతకు తగ్గ వేగంలో లేదు. అతడు ఓర్పుగా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడు.

శ్యామల యాపిల్‌ని తెచ్చి దానిని ముక్కలు చేస్తూ చెప్పసాగింది.

"సమాజంలో రామారావుల సంఖ్య తక్కువే. అయితే ఏం వీరిని తరతరాలకు గుర్తు చేసుకొని ఉలిక్కిపడేలా చేస్తారు. పరిస్థితులు ఏమయినా వీరు తమ బలహీనతలకు హింసనే ఉపయోగిస్తారు. ఈ మానసిక అనారోగ్యానికి చిన్నతనంలోనే నాటు పడుతుంది"

"రామారావు విషయంలో ఈ కారణాలన్నీ ఏకమయ్యాయా?"

"రామారావు చాలా ఆర్థొడాక్స్ ఫామిలీ నుండి వచ్చాడు. ఆరుగురి పిల్లలలో నాలుగోవాడుగా పుట్టి అన్ వాంటెడ్ చైల్డ్ గా పెరిగాడు. చిన్నతనంలో అందరూ అతడిని కొట్టి తిట్టినవారేగాని కనీసం తల్లైనా ప్రేమతో చేరదీయలేదంటాడు రామారావు. అంతా నిరాదరణే. ఏనాడూ తల్లిదండ్రుల మధ్య సఖ్యత లేదట. ఆ ఇల్లు ఒక కర్మాగారం. అందులో ఉండేది యాంత్రికంగా కదిలే మరలేకాని అది ఒక సంసారం, వాళ్ళు

మనుషులు కారు అనేవాడు రామారావు. అతడి తల్లి దండ్రులు ఆ ఇంటి నాలుగు గోడలు దాటితే ఎంతో అన్యోన్యంగా మెలిగేవారట. వాళ్ళను ప్రజలు పార్వతీ పరమేశ్వరులుగా, రుక్మిణీ కృష్ణులుగా వర్ణించి చెప్పుకునేవారట. నటన అనేది వారి నరనరాన జీర్ణించుకపోయింది. ఆ ఇంట్లో వీచిన గాలి తిరిగి బయటకు వెళ్ళేందుకు వీలుండేది కాదట. రహస్యం అనే మాట కూడా ఎంతో కట్టు దిట్టంగా ఉండేదట. మానసిక చిత్రహింస వారికి ఉగ్గు పాలతోనే అలవాటవుతుందట. అత్యాశలు, బలహీనతలు ఒకరి ముందు బయటపడకుండా తమకు తామే కొత్త రంగులు వేసుకోవడం వారికి కష్టం కాదట. ఈ నటన



కేవలం బయటవాళ్ళకే పరిమితం కాదు. తమ ఇంట్లో కూడా జరుగుతుందట. తమ మనస్సు ఎంతటి విషపూరితమైనా సమాజంతో తాము అమృతమయులు అనిపించుకోవాలనే తపన వారికింతా అంతా కాదట. విచిత్రమేమంటే వారు నటనలో ఎంత నిష్ణాతులంటే, వారు కోరుకున్నట్లే అనిపించుకుంటారట. మంచి తెలివితేటలున్న రామారావుకి అటువంటి కుటుంబంలో పెరగడంతో ఈ వ్యవహారాలన్నీ అతి శీఘ్రంగా నేర్చుకొని, దాన్నే తన జీవితంగా జీవించడం పెద్ద కష్టమేమీ కాలేదు"

చెప్పడం ఆపి కొంచెంసేపు ఆగి మరలా చెప్పసాగింది "అతడి అదృష్టమో, నా దురదృష్టమో గాని అతడికీ, నాకూ పరిచయమయింది. అతడు ఈ నాటకాన్ని చాలా సున్నితంగా మొదలు పెట్టాడు. ఒక్క వైపు నుండి లలితను మానసికంగా బలహీనపరుస్తూనే రెండో వైపు నుండి నన్ను లలితకు నీడలా మారడానికి ప్రోత్సహించాడు. ఈ నాటకం మొదలయినప్పుడు నేను ఇక్కడకూ, అక్కడకూ తిరుగుతున్నాను. కాని చివరి ఆర్నెల్లూ ఇక్కడ ఉద్యోగానికి శలవపెట్టి శ్రీపురంలో ఉన్నాను"

"మీరా? శ్రీపురంలోనా ?"

"పేరు, రూపం మార్చుకొని లక్ష్మి ఇండస్ట్రీస్‌లో రామారావు ప్రపోజల్ మీద టైపిస్టుగా చేరాను... రామారావు లలితకు ఒక అలవాటు చేశాడు. సరిగ్గా అర్ధరాత్రి పన్నెండయ్యే సరికి ఆమెలో చిత్రహింస మొదలు చేసేవాడు.

"అందులో మీ పాత్ర ఏమిటి?"

"మత్తు పదార్థాలను తీసుకున్నపుడు మనం చూసే దృశ్యాలను విమర్శనగా ఆలోచించలేము. మొదటిసారిగా నేను లలితకు ఎర్రటి దీపం మసక వెలుగులో కన్పించాను..." శ్యామల ఆ రోజును గుర్తు చేసుకుంటూ చెప్పసాగింది. లలిత కళ్ళువిప్పి నావైపు అర్థంకానట్లుచూసింది. ఆమె జుట్టు సవరించి నుదుర, చెంపలు రాస్తూ నెమ్మది స్వరంలో 'లల్లీ ! మమ్మీని. గుర్తుపట్టలేదా?' అన్నాను. లలిత బరువుగా మత్తుగా వాలిపోతున్న కళ్ళను మరీ విప్పార్చి చూడటానికి ప్రయత్నం చేసింది. 'మమ్మీ' అన్నది నన్ను సమీపించడానికి చూస్తూ. ఆమెకు నేను దూరంగా జరిగిపోతూ 'రా...నాతో వచ్చేయి లల్లీ' అన్నాను. ఆ ఎర్రటి దీపం వెలుగులో గోడమీద రక్తం పూసినట్లుగా ఉంది. లలిత సోలిపోతూ తడబడే అడుగులతో నన్నందుకోవడానికి వస్తూ 'మమ్మీ! ఎప్పుడొచ్చావు? పోవద్దు ఆగు. ఎక్కడకు పోతున్నావు?' అనడిగింది.

రామారావు లైట్ ఆఫ్ చేశాడు. నేను చీకట్లోకి తప్పుకున్నాను. కొంచెంసేపు కటిక చీకటి, నిశ్శబ్దం. బల్బుకి అడ్డంగా ఉంచిన ఎర్రటి కాగితాన్ని తీసివేసి లైట్ ఆన్ చేశాడు రామారావు. తెల్లటి వెలుగు గది అంతా పరచుకుంది. ఏమీ అర్థం కాక వెర్రిగా నిలబడ్డ లలిత హఠాత్తుగా ఏడుపు మొదలెట్టింది రామారావును చూసి. 'మమ్మీ అండీ.. మమ్మీ వచ్చింది' అన్నది.

'కలవచ్చిందా? మీ మమ్మీ రావడం ఏమిటి. వెళ్ళి పడుకో' అనునయంగా అన్నాడు. ఆమెకు ఎరుపు అంటే విపరీతమైన భయం" అన్నది శ్యామల.

"అవును ఒక రోజు.. ఆ రోజు నాకు బాగా గుర్తు. నాకు ఎరుపు రంగంటే చాలా

ఇష్టం. లలితతో పరిచయమైన కొత్త రోజులు. నాకు తెలియదు ఆమెకు ఎరుపంటే భయం అని. అది వర్షాకాలం. ఆగస్టు నెల. వాతావరణం మరీ చల్లగా ఉంది. రామారావు సామాన్యంగా లలితను ఒంటరిగా ఉంచడు. తను ఒక ముఖ్యమైన పనిమీద వెళుతూ సాయంకాలం నాలుగు గంటలప్పుడు లలితను నా వద్ద వదిలేసి వెళ్ళాడు. 'మరో గంటలో వస్తాను. మూవీకి వెళదాం' అని చెప్పాడు. రాత్రి తొమ్మిది గంటలయినా అతడిజాడ లేదు. బయట వర్షం కురుస్తోంది. అది కుంభవృష్టి లాగుంది. నా టేబిల్ లాంప్‌కి వామ్ ఎఫెక్ట్ కొరకు రెడ్ బల్బు ఉంది. లలిత ఏదో నావల్‌నిదీక్షగా చదువుతోంది. టేబిల్‌లైట్ ఆన్ చేశాను. అంత వరకు సీరియస్‌గాచదువుతున్న లలితలో సన్నని కంపనం మొదలయింది. చేతిలోని పుస్తకం జారిపోయింది. 'బాగా చలిగా ఉందా? షాల్ ఇవ్వనా?' అడిగాను. 'వద్దు' అన్నది వణికే స్వరంతో. నేను పలుకరించినా సరిగా మాట్లాడటంలేదు. కిటికీలో నుండి వర్షం వైపు చూస్తూ అప్పుడప్పుడు టేబిల్ లాంప్ వైపు భయభయంగా చూడసాగింది. కాఫీ అయినా అలానే ఉంది పరిస్థితి. ఈ లైట్ ఆఫ్ చేసి ట్యూబ్‌లైట్ ఆన్ చేశాను. క్రమేణా ఆమె తేరుకుంది. 'ఎరుపంటే ఇష్టంలేదా?' అని అడిగాను 'అవును' అంది. 'మొదటే ఆ లైట్ తీసేయమని ఎందుకు చెప్పలేదు?' అన్నాను. 'ఏమో నాకు తోచలేదు' అన్నది అమాయకంగా. ఆమె అమాయకత్వానికి నవ్వాలో ఏడవాలో తెలియలేదు.

నాకు తెలిసిన పద్ధతుల ద్వారా ఆమె భావాలనర్థం చేసుకోడానికి ప్రయత్నం చేసేవాడిని. ఆమెకలలను అడిగి చెప్పించుకొని వాటిని ఇంటర్‌ప్రెట్ చేసి ఆలోచించేవాడిని. అవి చాలా డిప్రెసివ్‌గాగాని అగ్రెసివ్‌గా గాని ఉండేవి. ఒక్కోసారి వాటినలా చెపుతూ చెపుతూ మధ్యలో ఆగిపోయి అసలా కల రావడానికి కారణం ఏమిటా అని ఆలోచించేది.

ఆ మె న లా నే ఆలోచింపనిచ్చేవాడిని. ఒక విధంగా చెప్పాలంటే ఆమెనలా వదిలేయడం ద్వారానే తనను తాను బాగా అర్థం చేసుకోగలిగేది. సామాన్యంగా ఆమె నా నుండి సమాధానాలు ఎక్కువగా ఆశించేది కాదు. తన సమస్యను నాకు వివరిస్తున్నప్పుడు అప్పుడప్పుడు దానికి తగిన సమాధానాన్ని కూడా తనే చెప్పేది. అధిక భాగం నేనామె మాటలను మౌనంగా వింటూ ఉండేవాడిని. అంతే కదా– మన సమస్యలు ఎప్పుడు మాటల రూపం దాల్చుతాయో అప్పుడే సమాధానాలు మదిలో మెదులుతాయి..."

"నేను ఆమెకలా కన్పించిన రోజు నుండే డ్రామా ప్రాక్టికల్‌గా మొదలయింది. అప్పటి నుండి తరచూ ఆమెకాభ్రమ కల్పించేవాళ్ళం. పోస్టు హిప్నోటిక్ సజెషన్స్ ఆ స్థితిలోనే ఇచ్చేవాళ్ళం. ఆమె శ్రీముఖి తీరానికి వెళ్ళడం కూడా పోస్టు హిప్నోటిక్ సజెషనే" అన్నది శ్యామల.

ప్రభాకర్ మనస్సు బరువెక్కింది. మొద్దుబారిన మనసు పాములా ఆలోచన వైపు పాక సాగింది. లలిత వీళ్ళ దుష్ట ఆలోచనలకు ఆటబొమ్మయై ఇంత హీనంగా బలైపోయిందా! "మీ నాటకానికి నన్నే ఎందుకు ఎన్నుకున్నారు?" అడిగాడు.

"రామారావుకు నిజాయితీపరుడైన, ఒక తెలివిగల యువకుడు కావాలి. ఆ సమయంలో మీరే అతడికి సరైన వ్యక్తిగా తోచారు. మీలో అతడికి కావాల్సిన పర్సనాలిటీ ఉంది. అందుకే మిమ్మల్ని ఎన్నుకున్నాడు."

"అందువలన అతడాశించిన దేమిటి?"

"ఒకటి తన అమాయకత్వానికి లోకంకు సాక్ష్యం. రెండు లలిత మనస్సుకు కొంత ప్రశాంతత. అసలామెకు ప్రశాంతత అనేదేమీ లేకుండా ఉంటే ఫలితం అనుకున్న సమయాని కన్నా ముందుగా, పనులేమీ జరగకుండానే, ఫలించే ప్రమాదమున్నది. అధ్యాయం అంత త్వరగా ముగిసిపోతే ఆ రిటైర్డ్ జడ్జి చేతుల నుండి లలిత ఆస్తి సులభంగా రాదు అనేవాడు రామారావు. అందుకే ఈ నాటకం మొదలయిన వెంటనే ముగిసిపోవాలని అతడేనాడు ఆశించలేదు."

"మొదటిసారిగా రామారావు నన్ను



సహాయం కోరినపుడు నేను లలితను శ్రీముఖి వరకు వెంబడించాను. ఆమె నది లోపలికి వెళుతుంటే ఆపాను. ఆమె స్పృహతప్పి పడిపోయింది. ఎందుకలా వెళ్ళావని అడిగితే సమాధాన మివ్వలేక పోయింది" అన్నాడు.

"కావచ్చు ఆమెకు అలా వెళ్ళమని పోస్టు సజెషన్స్ ఇచ్చేదానిని కదా. మీరు రాబోయే ముందు రోజు కూడా అలానే చెప్పాను. 'నీవు నా కొరకు శ్రీముఖి నదీగర్భాన వెదుకు. ఎవరయినా నిన్ను మధ్యలో ఆపితే నీవు అంతా మర్చిపోయి వారే ప్రశ్నలు అడిగినా సమాధాన మివ్వలేవు' అని చెప్పాను. గంటలు నిముషాలతోసహా ఆమె అంతా చెప్పినట్లే చేసేది. ఆమె ఒంటరిగా వెళ్ళాలి కాబట్టి ట్రాఫిక్ రూల్సు సరిగ్గా గమనించమనిచెప్పేదానిని కూడా.ఆమెకు చీకటన్నా, ఒంటరితనమన్నా, ఎరుపు రంగన్నా చాలా భయం. ఆ భయాన్ని ఆసరాగా చేసుకొని మేము మా చర్యలను ఆచరణలో పెట్టేవాళ్ళం. రామారావు ముందు జాగ్రత్త కొరకు లలితకు స్నేహితులెవ్వరూ లేకుండా చేశాడు."

"నేను వాళ్ళింటికెళ్ళిన రాత్రి..."

"మీరొస్తున్నట్లుగా రామారావుకు తెలుసు కదా. అంతక ముందే లలితతో చెప్పాను 'రేపు రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకు నీవు నిద్ర లేస్తావు. నన్ను అందుకోవడానికి వస్తావు. నిన్నడ్డగించడం ఎవ్వరికీ చేతకాదు. నేను నీకు అందకపోతే కూర్చొని ఏడుస్తావు" అని.

"ఇలా చెప్పడంసరె, అసలు లలిత ఇవన్నీ ఎలా వినేది, ఎలా ఆచరించేది?"

"ఒకసారి లలితకు మామూలు జ్వరం వచ్చిందని చెప్పాను కదూ. ఆ బలహీన స్థితిలోనే ట్రాంక్విలైజర్స్ అధిక మోతాదులో ఇవ్వడం వల్లన హిస్టీరిక్‌గా ప్రవర్తించింది. తర్వాత ఆమె తండ్రి మరణించాడు. తండ్రి పోయిన దిగులు ఆ స్థితిని మరీ దిగజార్చింది. రామారావుకు హిప్నాటిజమ్ తెలుసు. లలితకు అతడి మీద చాలా నమ్మకం. ఆ మంచితనం మీదనే ఆమెకు స్వస్థత కలిగిస్తానని చెప్పి ఆమెను హిప్నొటైజ్ చేసి ఆమె చివరి వరకూ ఆచరించాల్సిన పనిని చెప్పాడు. ఆమె తన శక్తికి తప్ప మరే శక్తికి లొంగకుండా చేశాడు. ఆమె అతడిని ఎంతగా నమ్మిందంటే డాక్టర్లకన్నా అతడే గొప్పవాడని ఆమె ఉద్దేశం. ఆ మూఢ నమ్మకమే ఆమెనలా చీకట్లోకి దారి తీయించింది."

"ఆ తర్వాత కూడా ట్రాంక్విలైజర్సు వాడిందా?"

"వాడలేదని కాదు. ఒకసారి నాటకం ప్రాక్టికల్‌గా మొదలయిన తర్వాత వాటి అవసరం తల నొప్పికే పరిమితమయిపోయింది... ఎరుపు వెలుతురుకి అర్ధరాత్రి పన్నెండు గంటలప్పుడు ఆమె ఉలిక్కిపడి లేచింది. క్రమేణా అది భయంగా మారింది. ఆ క్రీనీడలోనే ఆమెకు పోస్టు సజెషన్స్ ఇచ్చేదానిని."

"ఆమెకు ఏమీలేదని డాక్టరు కృష్ణ మోహన్ అన్నారు."

"ఆయన అబద్ధం చెప్పలేదు"

"అదెలా? ఆయనకు పరిస్థితిని స్వయంగా నేనే వివరించి చెప్పాను. ఓ వారం రోజులు లలితను ఇంటర్వ్యూ చేశారు కూడా".

శ్యామల ఓ క్షణం మౌనం వహించి "ఆయన వద్దకు లలిత వెళ్ళలేదు" అన్నది.

"వెళ్ళలేదా ?" ఆశ్చర్యపోయాడు "వాళ్ళిద్దరూ వచ్చారని ఆయన చెప్పారే."

"వెళ్ళింది మేమిద్దరం" చాలా ప్రశాంతంగా అన్నది. "ఆయన వద్దకు లలిత గనుక వెళ్ళి ఉంటే అసలు కథ బయటకు పూర్తిగా కాకపోయినా, కొంత యినా వచ్చి ఉండేది; అసలు లలిత చూడటానికే అనారోగ్యంగా ఉంటుంది కదా. రామారావు డాక్టరు అడగబోయే ప్రశ్నలను ముందుగానే ఊహించి వాటికి నేను ఎలా సమాధానాలు చెప్పాలో, సమయస్ఫూర్తి ఎలా ఉపయోగించాలో చాలా ఖచ్చితంగా చెప్పాడు. ఒక్క ఈ డాక్టరు వద్దేకాదు, రామారావుకి రిపోర్టు లిచ్చిన డాక్టర్లందరివద్దా ఈ ఫార్సే జరిగింది".

"అయితే డాక్టరు రిపోర్టు క్లీనుగా రావడానికి నిన్నుపయోగించుకున్నాడన్న మాట. రామారావు చాలా తెలివిగలవాడు సుమా"

"చాలా? చాలా చాలా తెలివిగలవాడు. అతడు తన ఆలోచనలను మంచి దారిలో పెట్టుకుంటే ఎంతో ఉన్నత స్థితికి చేరుకునేవాడు అప్పటిస్థితి కన్నా. ఎంత జాగ్రత్తగా ఆలోచించినా మన బుద్ధికి అందని ఆలోచనను అతడిట్టే చెప్పేస్తాడు."

"లలిత చాలా సాధు స్వభావం కలది. ఆమెను వంచించడానికెందుకింత శ్రమ పడ్డాడు?"

"అతడు శ్రమ పడ్డది ఆమెను వంచించడానికి కాదు, ఆమెను రక్షిస్తున్న బలమైన సమాజాన్ని మోసం చేయడానికి. రామారావుకి తెలుసు లలిత చుట్టూ ఆమె కొరకు ఉన్న సమాజం ఎంత బలమైనదో, తెలివిగలదో! అయినా దానికి ఉన్న బలహీనతలేమిటో కూడా తెలుసు. తన పనిని చాలా తెలివిగా నిర్వహించి తద్వారా లాభం పొందాలి. అదే అతడి ప్రత్యేకత"

"తర్వాత ఏం చేయాలని?"

"ఏమీ లేదు. డబ్బు సంపాదించాలి. ఆ సంపాదించాల్సిన పద్ధతి తను అనుకున్న మార్గాల ద్వారా ప్రయాణించాలి. అంతే! ఇంతకు మించి అతడు మరే ప్రయోజనాన్నాశించినట్లు నాకుతోచదు."

ప్రభాకర్ కొంచెం సేపు మాట్లాడలేదు. ఆమె చెప్పిన విషయాలను మరోసారి మననం చేసుకొని అన్నాడు.

"అయితే డాక్టరు కృష్ణమోహన్ వద్దకు వెళ్ళింది మీరన్న మాట."

"అవును. ఆయన చాలా ప్రశ్నలడిగారు. చాలా రకాలుగా అడిగారు. రామారావు చాలా మంచి టీచర్. అతడు ఆదేశించినట్లే సమాధానాలు చెప్పాను. అతడిచ్చిన ట్రైనింగ్ వల్ల డాక్టర్లడిగే ఎంత గడ్డు ప్రశ్నకైనా తట్టుకుని నిలబడ్డాను. అందుకే ప్రతి మెడికల్ రిపోర్టు క్లీన్‌గావచ్చింది.ఒకళ్ళిద్దరు డాక్టర్లు చివర్లో కొంచెం అనుమానపడ్డారు కాని, రామారావు హోదా, మాట తీరు వారినాపై ఆలోచింపనిచ్చేవి కాదు. ఇలానే లలిత ఆస్తికి కేర్‌టేకర్‌గా ఉన్న రిటైర్డ్ జడ్జిగారిని కూడా మోసంచేశాము."

"లలిత తనే డాక్టరు వద్దకు వెళ్ళానని చెప్పింది"

"ఆ రాత్రి ఆమెకు ట్రాన్స్‌లో చెప్పాను ఆమె డాక్టరు కృష్ణమోహన్ వద్దకు వెళ్ళిందని, ఆయన ఫలానా ఫలానా ప్రశ్నలడిగారని, అందుకామె ఫలానా ఫలానా సమాధానాలు చెప్పిందని జరి

గిన విషయాలన్నీ ఎ టుజడ్ చెప్పాను. మాకు తెలుసు మీరు లలితనీ విషయమై తప్పక ప్రశ్నిస్తారని"

"లలిత నడిగాను డాక్టరు వద్దకు వెళ్ళావా అని. వెళ్ళానంది. ఎప్పుడు, ఎలా వెళ్ళింది అన్నీ చెప్పింది. ఆయన ఏమేం అడిగారు, నీవు ఏమేం చెప్పావు అంటే గుర్తు తెచ్చుకుంటూ వాటిని చెప్పింది. ఆమె డాక్టరుకు చెప్పిన సమాధానాలు విని ఆశ్చర్యపోయాను. ఆయన 'నీకు నిద్ర సరిగా పడుతుందా అంటే పడుతుందని, నీకు భయంకలిగించే విషయాలు గాని, రంగులు గాని ఏమన్నా ఉన్నాయా అంటే ఏమీ లేదని చెప్పిందట. ఆయన ప్రాక్టికల్‌గా టెస్టు చేసినా తను దేనికీ భయపడలేదని గూడా చెప్పింది."

"అవును. డాక్టర్ నా జవాబులు విన్న తర్వాత ప్రాక్టికల్‌గా కూడా టెస్టు చేశారు. నేను దేనికీ భయపడలేదు. అసలు నాకు ఎరుపన్నా, చీకటన్నా భయమయితే కదా భయపడటానికి."

"లలిత అలా అని నాకు చెప్పిన తర్వాత ఎందుకలా చెప్పావు. నీకు సరిగా నిద్ర పట్టదు కదా అన్నాను. ఆమె చాలా నెర్వెస్‌గా ఫీలయి అసలు నాకు ఇదేమిటో అర్థం కావడం లేదు ప్రభా అని అన్నదే తప్ప మరేమీ వివరించి చెప్పలేకపోయింది. ఆమెకు అంతా కలలోలా ఉందనిచెప్పింది. పూర్ గర్ల్! ఎంత క్రూరత్వానికి గురయింది..." ప్రభాకర్ మనస్సులో దుఃఖం పెరుగుతోంది. అయినా నిగ్రహంతో పరిస్థితులను ఆకళింపు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

"లలిత చాలా నిజాయితీగా ఆలోచిస్తుంది. రామారావుకు తను సరైన జోడీ కాదని ఎప్పుడూ బాధపడేది. వివాహం జరిగిన తర్వాతే తన ఆరోగ్యం చెడిపోయింది అని తెలుసు. రామారావు అంటే ఆమెకు అంతర్గతంగా విపరీతమైన భయం ఉంది. ఆభయానికి తన ప్రవర్తనే కారణం అని ఆమె అనుకుంది గాని రామారావుపై ఆమెకెన్నడూ అనుమానం రాలేదు. ఆమె అతడి నేనాడూ నిందించలేదు. ...వాళ్ళ ఫారెన్ ప్రోగ్రాం విషయం ఏమిటి?" అడిగాడు.

"అది రామారావు ప్లాన్‌కి తుదిపలుకు. ఆ ప్రయాణం పేరుతో ఆస్తిని కాష్ చేయించాడు లలితతో ..."

"అది అంతతేలిగ్గా ఎలా జరిగింది? ఆమె తండ్రి దానిపై చాలా కట్టుదిట్టాలు చేశారు కదా. ఒకవేళ అంతతేలిగ్గా జరిగే పనయితే రామారావు లలితతో ఆపని ఏనాడో చేయించి ఉండవచ్చు కదా!"

"మీరన్నట్లు అది అంతతేలిగ్గా జరగలేదు. ఆ జడ్జిగారు కూడా రామారావు మోసాన్ని నమ్మిన తర్వాతే ఆమె ఆరోగ్యం బాగుపడటానికి డబ్బు ఆ ఆస్తిని కొంత అమ్మి ఇచ్చారు. రామారావు,లలిత ఇద్దరూ మరణించిన తర్వాత ఆ మిగిలిన ఆస్తి ఆర్ఫనేజ్‌కి పోయింది. కాని మొత్తం మీద మూడు వంతులపైగా ఆస్తిని ఈ విషయంకై అమ్మారు."

"ఆ పిక్నిక్?"

"అది కూడా ప్రీప్లాన్. ఈ వారం, రోజుల్లో లలితను దిగజార్చాల్సినంత మేరకు దిగజార్చాడు. ఆమె అలా కృశించి పోతుంటే ఆతడు ఎంత ఆనందిచేవాడను కున్నారు!! ఓహ్! ఏం పైశాచిక ఆనందం. ఆ వారంరోజులూ ఆమెను మిమ్మల్ని కలుసుకోకుండా చేయమన్నాడు నాతో..."

ప్రభాకర్ ముఖం ఎర్రబడింది. "ఎందుకలా చేశాడు?"

"లలితకు ఆత్మీయుడు మీరే. మీకు దూరంచేస్తే లలిత మానసికంగా మరీ బలహీన పడుతుంది. రామారావు ఆదే శించినట్లే లలితతో - చెప్పాను పిక్నిక్ రోజువరకు ప్రభాకర్‌ని చూడరాదని, ఇది మమ్మీ ఆజ్ఞ అని''.

"ఇది నిజంగా పైశాచిక చర్య శ్యామలా! స్త్రీలు ఎంతో కరుణామయులు, సున్నిత హృదయులు అంటారే ఇంతటి ఘోరాన్ని మీచేతులతో మీరు ఎలా చేయ గలిగారు?"

"అది నా అజ్ఞానం, బలహీనత ప్రభా కర్! రామారావు మోసంలో ఎంతగా మునిగిపోయానంటే లలితతో అలా మాట్లాడాలంటే, ప్రవర్తించాలంటే నాకు గుండె పిండి వేసినట్లుండేది. కాని రామా రావు మాట మంత్రం. దానినతిక్రమించ లేక మనస్సు చంపుకున్నాను."

"పిక్నిక్‌కి ముందు ఏం జరిగింది?"

"ఆ రోజు రాత్రి లలితవద్దకు వెళ్ళాను. ఎప్పటిలాగే రెడ్ లైట్, వైట్ డ్రెస్. 'లల్లీ' పిలిచాను. లలిత వణికిపోతూ నిద్రలేచింది. చాలా భయంగా 'మమ్మీ' అంది. 'రేపు పిక్నిక్ ఉంది. కోటకు వెళతారు. నీవు ఆకుపచ్చచీర కట్టుకో. రామారావు నీ చేయి పట్టుకునే నడుస్తాడు. ప్రభాకర్ కూడా వస్తాడు. ముగ్గురూ కోటపైకి వెళతారు. రామారావు నిన్ను తూర్పు వైపు గోడమీద కూర్చోమని చెప్పి ప్రభా కర్‌తో దక్షిణ వైపు గోడ చూద్దాం రమ్మంటాడు. అప్పుడు నీవు గోడమీద కూర్చొని లోయలోకి చూస్తావు. అంతా ఆకుపచ్చగా కన్పిస్తుంది. రామారావు పన్నెండు గంటలయిందంటాడు. మరేమీ ఆలోచించకుండా నీవు కిందకు దూకు తావు, నన్ను చేరుకుంటావు' అన్నాను..."

ప్రభాకర్ తల బరువెక్కిపోసాగింది. "ఆ రోజు లలిత చాలా మూడీగా ఉంది. నాతో ఏదో మాట్లాడాలని ప్రయత్నిం చింది. కాని ఏమీ చెప్పలేదు. మాటలురాని మూగిగా ఉండిపోయింది. నేను ఏమి అడి గినా, చెప్పినా 'ఉ, ఆ' అనడం మిన హాయించి ఏమీ అనలేదు. అంతకూ ఒక సారి ఈమధ్య కన్పించడం లేదేమీ అన్నాను. కళ్ళు విప్పార్చి నా వైపు చూసిందే గాని ఏమీ మాట్లాడలేదు. లలితను ఎన్నోసార్లు ఎందుకిలా ఉన్నావు అని ప్రశ్నించాలనుకున్నాను కాని ఏమీ అడగలేకపోయాను. మాటలు ఎందుకో నా పెదవి దాటి రాలేకపోయాయి. ఆ రోజు లలిత కళ్ళు జీవం కోల్పోయి ఉన్నాయి. కనీసం నేను లలితను గుచ్చి గుచ్చి అడిగి ఉండాల్సింది. నాకారోజు ఆ పిరికితనం లేకుండా ఉంటే ఎంత బాగుండేది! లలితలో సూయిసైడల్ ఇన్ స్టింక్ట్ ఉందని తెలుసు. ఆమె తనకు తెలి యకుండానే ఎన్నో పనులు చేస్తుందని తెలుసు. కనీసం ఆరోజు లలితను మాట్లా డించి ఉంటే ఆ ప్రమాదాన్ని ఆపగలిగే వాడినేమో, నాకు తెలియదు. ఎంతకూ లలిత ఇండియా వదలి వెళ్ళిపోవడానికి దిగులు పడుతుందనుకున్నాను గాని నా ఆలోచన ఇంత దూరం వెళ్ళలేదు. అంతకు ముందు ఒకసారి లలిత అన్నది- 'మనం మళ్ళీ కలుస్తామని నా అంతరాత్మ చెబుతోంది. కాని ఇదే మన చివరి కల యిక అని ఏదో శక్తి దాని గొంతు నొక్కుతోంది' అని. మొదట్లో రామా

రావును అనుమానించాను. కాని తర్వాత అతడిపై అనుమానం ఏ మూలో పీకుతున్నా అతడి ప్రవర్తన వలన అతడు లలితకై చాలా శ్రమపడుతున్నాడని నమ్మాను. దానికితోడు లలిత రామారావు నేనాడూ బ్లేమ్ చేయకపోవడం, పైగా చాలా గౌరవించడం. అయినా అనేక సార్లు నీవు రామూ కన్నా చాలా గొప్పవాడివి ప్రభా! అయితే ఏ విషయంలోనో నాకు తెలియడం లేదు' అనేది. అంటే లలితకు రాబోయే ఉపద్రవం, దానికి కారణం లీలగానైనా తెలిసి ఉండాలి" అన్నాడు ప్రభాకర్ చాకుతో యాపిల్ ముక్కపై నల్లగా మారిన పైభాగాన్ని తొలగిస్తూ. పరధ్యానంగా చేస్తున్నాడేమో చాకు అతడి బొటన వేలికి గాయంచేసింది. ఎర్రటి రక్తం పొంగింది.

"అయ్యయ్యో, కాటన్ ఇస్తాను" అని శ్యామల దూది తీసుక రావడానికి



వెళ్ళింది. ప్రభాకర్ నెమ్మదిగా కళ్ళెత్తి ఆమెవైపు చూశాడు. అతడి మనస్సులో ఒకనాటి సంఘటన మెదిలింది. ఆరోజూ ఇలానే యాపిల్‌ని తరుగుతూ లలిత చేయి కోసుకుంది. 'ఇంత మొద్దు నైఫ్ నీ చేతిని కోసిందంటే నీ వెంత పరధ్యానంగా ఉన్నావో, ఎంతబలంగా ఆలోచిస్తున్నావో అర్థమవుతుంది' అన్నాడు ప్రభాకర్. తప్పుచేశానన్న భావనే ఇటువంటి శిక్షలకు కారణమంది లలిత. అంటే... ఇప్పుడు తను ఆత్మశిక్షను కోరుకుంటు న్నాడా? ప్రభాకర్ చాలా కాన్షస్‌గా అనుకున్నాడు. ఆరోజు తను గనుక ధైర్యం చేయగలిగి ఉంటే లలితను రక్షించ గలిగేవాడే.

"లలిత తన ఆలోచనలను తనే అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేది" అన్నాడు.

"అవును. ఆమె తెలివిగలది. కాని రామారావులో ఒకానొక క్షణాన కన్పించిన మంచితనానికి పూర్తిగా బానిసయి పోయింది. మనిషి మంచితనం మీద మోసపోవడానికి కారణం అదే. ఎంత చెడ్డ మనిషిలోనైనా మంచితనం ఏదో కొంచెం ఉండకపోదు. ఏదో ఒక విషయంలో అతడు తన మంచితనం చూపిస్తాడు. కాదనను. కాని అంత మాత్రాన అతడి మిగతా చెడ్డతనాన్ని బలహీనతగా క్షమించి వదిలేయగూడదు. ఏవిషయంలో అతడు మంచివాడో ఆ విషయానికే అతడిపై మన జాలిని కూడా పరిమితం చేసి మిగిలిన అన్ని విషయాలలో అతడి చెడ్డతనాన్ని గుర్తించి మన జాగ్రత్తలో మనం ఉండాలి. లేకపోతే అతడి శక్తికి మనగొంతును మనమే ఇచ్చినవాళ్ళవుతాము. లలిత తెలివిగలది కాబట్టే రామారావు అర్థం చేసుకుంది. కాని అతని శాడిజాన్ని నిరపాయమని క్షమించి అతడిలో అప్పుడప్పుడు కన్పించే నిజమైన మంచి అతడిలో పూర్తిగా నిండి ఉందని నమ్మింది. ఆ బలహీన క్షణాన్నే రామారావు శక్తికి లొంగిపోయి తన మనస్సుని తన ఆలోచనా పొరపాటుకు శిక్షగా అమ్మివేసుకుంది. రామారావు ఆమె కెన్నడూ విశ్రాంతిగా ఆలోచించడానికి అవకాశమివ్వలేదు. ఆమె ఆత్మకూ, అంతరాత్మకూ అనుక్షణం సంఘర్షణ జరిగేది. ఆమెకు పిల్లలంటే ప్రాణం. కాని పిల్లలు ఆమె చేతిలో బ్రతకరనే సెంటిమెంట్ ఆమెకు కలిగించి ఆమెను మరీకృంగదీసే వాడు. ఆ సంఘర్షణలో ఆమె పూర్తిగా అలసిపోయేది. నీ సన్నిధిలోనే ఆమెకు ఓదార్పు.''

"లలిత మరణం తర్వాత ఏం జరిగింది?" ప్రభాకర్ అడిగాడు.

"అంతా అనుకున్నట్లే జరిగినందుకు రామారావు సంతోషానికి అవధులు లేకుండా పోయింది. నేను అక్కడినుండి ఇక్కడికి వచ్చేశాను. ఆ తర్వాత రామారావు నా వద్దకు వచ్చాడు. 'మనిద్దరం ఫారన్ వెళదాం' అన్నాను. దానికి సమాధానం చెప్పకుండా 'నీవు నాకు చాలా సహాయం చేశావు. థాంక్స్' అని పాతిక వేలకు చెక్కు ఇచ్చాడు. 'మనం పెళ్ళి చేసుకోమా?' అని చాలా ఆశ్చర్యపోయి అడిగాను.

'ప్రస్తుతం దానిని వాయిదా వేద్దాం శ్యామలా! వెంటనే చేసుకుంటే అనుమానాలు రావచ్చు' అన్నాడు. అతడు మొహంమీద చెప్పకపోయినా మొదటి సారిగా అతడి మనస్సులోని దౌష్ట్యాన్ని

పసిగట్టాను. నాకు అర్థమవ సాగింది మా పెళ్ళి జరగబోవడంలేదని. 'ఇంతశ్రమ కోర్చింది కేవలం నీ నుండి ఈ సమాధానం వినడానికా రామూ?' అని అడిగాను. అతడు మాట్లాడలేదు. 'నీవు మోసగాడివి' అన్నాను. అతడు అతి సామాన్యంగా, ఏ భావం వెలిబుచ్చకుండా నా వైపు చూసి 'నేను ఏం మోసం చేశాను? నిన్ను చేసుకోననలేదే. కొన్నాళ్ళాగాలన్నాను. అంతే' అన్నాడు. అదే రామారావులోని ప్రత్యేకత. ఎదుటివాళ్ళకు తనపై నేరారోపణ చేయడానికి అవకాశమివ్వడు.

అప్పుడు కలకత్తా వెళుతున్నాడు. ఫారెన్ ప్రోగ్రాం కాన్సిల్ చేసుకోలేదు. నాకు తెలియకుండానే నావద్ద వున్న టేప్సు, ఫొటోలు పట్టుకుపోయాడు. విధి అతడినెంత విచిత్రంగా శిక్షించింది? బతికి ఉంటే రాగానే నన్ను చంపి ఉండేవాడే. ఏడబ్బుకై అతడు అంత శ్రమ పడ్డాడో ఆ డబ్బు చేతికి వచ్చేసరికి అనుభవించే యోగం లేకుండా దుర్మరణం పాలయ్యాడు.

అతడి రహస్యాలన్నీ నావద్ద ఉన్నవి. అతడెప్పుడూ తన రహస్యాలు సజీవంగా ఉండటం సహించలేడు. ఒకవేళ అతడు ఫారన్ నుండి తిరిగి వచ్చినా ఆ కారణంగానైనా నేను హత్య చేయబడి వుండేదాన్నే.

శ్యామల ప్రభాకర్ చేతులు ఊపుతూ ఆవేశంగా ఏదో అంటోంది. ప్రభాకర్‌కి అవేమి వినిపించడం లేదు. కళ్ళు పెద్దవిగా చేసి ఆమెనే చూస్తున్నాడు. ఆమె రూపం అతడిమనస్సుమీద మసక మసగ్గా, వికృతంగా రూపమెత్తుతోంది. ప్రభాకర్ మళ్ళీ మళ్ళీ పరిశీలనగా ఆమెనే చూస్తున్నాడు. అదే వికృతరూపం పదేపదే దర్శన మిస్తోంది. ఆమె ఎవరు? ఆమెలో లలిత పోలికలు ఎక్కడున్నాయి? అసలు ఆమెకూ, లలితకూ పోలికే లేదు. ఈమె ఇంత భీకరంగా రాక్షసిలా ఉందేం? ఈమె మనసులోని నిర్దయ, క్రూరత్వం, స్వార్థం ఈమె కళ్ళనుండి విస్ఫులింగాలు జల్లుతున్నాయి. ఆ ఎర్రటి బుగ్గలు, పెదవులు రక్తం కారుతున్నాయి. ఆ నోరు రక్త దాహంతో తపించిపోతోంది. ఈమె స్త్రీ కాదు. మానవరూపమెత్తిన రాక్షసి, నరరూప రాక్షసి. ప్రియమైన, అమాయకురాలైన లలిత ప్రాణ హంతకి!

ఇది వాడి చేతిలోని ప్రాణమెరుగని మారణాయుధం. మరణించేటప్పుడు లలిత మనస్సు ఎంత క్షోభకు గురయిందో! ఆ సున్నిత శరీరం ముళ్ళలోపడి రాళ్ళలోపడి ఎంత దుర్భర వేదనను అనుభవించిందో! లలితనంత చిత్రహింసకు గురిచేసిన రాక్షసి ఇది. ఇది మానవి కాదు. చాలా క్రూరమైనది. నా లలిత ఆరోజు ఎంత తల్లడిల్లిపోయిందో ! దానికి కారణం ఇది కాదూ? ఇదికాదూ? లలితా, లలితా...

ప్రభాకర్‌ని చూసి శ్యామల హడలిపోయింది. అతడు నిలువెల్లా వొణికిపోతున్నాడు.ముఖంఅంతా ఎర్రబారింది. అతడి చేతిలో టీపాయ్ మీద ఉన్న చాకు బిగుసుకపోతోంది. శ్యామలకేమీ అర్థం కావడం లేదు. భయం భయంగా అతడివైపే చూస్తూ ఉండిపోయింది. ఒక్కొక్క అడుగే తన వైపు వేసుకుంటూ వస్తున్న ప్రభాకర్‌ని చూసి ఆమెలో రక్తం గడ్డకట్టుకపోయింది. పరుగెత్తడానికి కూడా శక్తి లేనట్లు కాళ్ళు నేలకు అతుక్కుపోసాగాయి. ★

# చేపల ఆసుపత్రి

అలవోకగా రెక్కల్ని కదిలిస్తూ వయ్యారంగా అటూ ఇటూ షికార్లు కొడుతూ ముచ్చటగా నోళ్ళు కదిలించే రంగురంగుల చేపలంటే ఇష్టపడనివారుండరు. పారిస్‌లో నివశించే శాస్త్రవేత్త లైన ఫిలిప్ సైమన్, జీన్ గ్రిమ అనే ప్రాణ స్నేహితులిద్దరూ చేపలంటే అమితమైన ఆసక్తి గలవారు. వీరిద్దరూ తమ ఇళ్ళల్లో రకరకాల చేపలను అల్లారు ముద్దుగా పెంచుకునేవారు. ఒక రోజు సైమన్ దృష్టి గాజు తొట్టిలోని ఒక నీలిరంగు చేపమీద పడింది. ఆ చేప తొట్టిలో ఓ మూల ఆపసోపాలు పడు



తున్నట్లనిపించింది. ఆ చేప చాలా బరువుగా వూపిరి వదుల్తోంది. సైమన్ దానికి కొద్దిగా ఆహారం వేశాడు. చేప ఆహారం వైపు కన్నెత్తయినా చూళ్ళేదు. అప్పటికి ఆ చేప అనారోగ్యంతో బాధపడుతోందని గ్రహించి వెంటనే బయటికి తీసి ఇంజక్షన్ ఇచ్చాడు. కొద్ది సేపటికి ఆ చేప హాయిగా తోకాడించుకుంటూ తిరగసాగింది. ఈ సంఘటన జరిగాక సైమన్, గ్రిమాలు చేపల కోసం ఒక ఆస్పత్రి తెరవాలని నిశ్చయించుకున్నారు. మరో రెండేళ్ళల్లో అనుకున్నట్లే పారిస్‌లో ఓ ఆస్పత్రి తెరిచారు కూడా. ఈ మత్స్య ఆస్పత్రిలో చేపలకొచ్చే రకరకాల జ్వరాలకు చికిత్స చేస్తారు. అంతేకాదు ఆపరేషన్లు చేసే సౌకర్యాలు, ఏర్పాట్లు కూడా వున్నాయి. ఈ ఆస్పత్రిలో డాక్టర్లు బయట ఎవరన్నా తమ చేపలకి అనారోగ్యంగా వుందని పిలిస్తే ఇళ్ళకి వెళ్ళి చికిత్స చేసి మందులిచ్చి వస్తారు.

## చతుర

# నలభై ఏళ్లకోసారి

తమిళనాడులో చిన్న కాంచీపురంలో మహావిష్ణువు అవతారంగా భావించే అత్తి వరదార్‌ని అయ్యంగార్ తెగవారు హెచ్చుగా పూజిస్తారు. ఈ దేవుడి విగ్రహం అత్తిచెట్టు కర్రతో చేయబడింది. ఈ విగ్రహం ఎల్లప్పుడూ పుష్కరిణిలో, నీళ్ళలో మునిగి వుంటుంది. నలభై ఏళ్ళకోసారి మాత్రమే పైకి తేబడి

పూజలకి నోచుకుంటుంది. దీనికి కారణాలు ఎన్నో వున్నాయని స్థానికులు చెప్పుకుంటుంటారు. సాధారణంగా అత్తి చెట్టు కర్రతో చేయబడ్డ విగ్రహాల్ని చల్లటి ప్రదేశంలో భద్రపర్చాలట. అందుకోసం ఇలా నీట్లో ముంచుతారని ఓ కథ.

17వ శతాబ్దంలో మంగోలియన్లు



దండయాత్ర చేసినప్పుడు వాళ్ళకి కనపడకుండా ఓ పరమ భక్తాగ్రగణ్యుడు శ్రీవారి విగ్రహాన్ని పుష్కరిణిలో దాచాడట. కాలక్రమేణా ప్రజలా సంగతి మరిచేపోయారు కానీ 40 ఏళ్ళ తర్వాత స్వామివారు ఓ భక్తుడికి కల్లో కనపడి తనని నీటి నుండి పైకి తీయించమనీ, ఒక మండపం కట్టించి 48 రోజులు ఆ మండపంలో తనని ప్రతిష్టించి పూజలు చేసేక యథావిధిగా తనని జల సమాధి చెయ్యమనీ, ఇలా ప్రతి నలభై ఏళ్ళకో సారి చెయ్యాల్సుంటుందనీ సెలవిచ్చార్ట.

క్షణాల మీద అంతా జరిగిపోయింది. మొదటిసారిగా స్వామివారు 18-6-1854 లోను, తర్వాత 13-6-1892 లోనూ, తర్వాత 12-7-1937లోనూ, ఆ తర్వాత జూలై 1979లోనూ పైకి వచ్చి భక్తుల నాశీర్వదించేరు.

# ప్రపంచం

## అస్సాం టీ

స్టైయిల్‌గా సిగరెట్ కాలుస్తూ ఇరానీ హోటల్లో కూర్చుని 'ఏక్ చాయ్ లావ్' అని దర్జాగా ఆర్డరివ్వడం ఇప్పుడు సర్వసామాన్యమైపోయింది.

టీ ఆకు 1770లో భారతదేశంలో అడుగు పెట్టింది. వ్యాపారనిమిత్తం చైనా వెళ్ళిన భూటాన్ వర్తకులు అక్కడ్నించి తేయాకు మొక్కల్ని తెచ్చి బీహార్, కూచ్‌బీహార్, భూటాన్లలో పెంచడానికి ప్రయత్నించి విఫలులయ్యారు.

మన దేశంలో వున్న లార్డ్ బెంటిక్ అనే వైస్రాయ్ 1834లో భారతదేశంలో తేయాకు తోటల్ని పెంచే అవకాశం ఏదైనా వుందేమో చూడమని ఓ కమిటీని నియమించాడు. ఈ లోపల ఏదో పనిమీద అస్సాం వెళ్ళిన కేప్టెన్ జాకిన్స్ అనే

బ్రిటిష్ ఆఫీసరు అక్కడి అడవిలో విస్తృతంగా పెరిగిన తేయాకును కని పెట్టాడు. వెంటనే వైస్రాయ్‌గారు తేయాకు తోటల పర్యవేక్షణా నిమిత్తం బ్రూస్ అనే ఓ సూపరింటెండెంట్‌ను నియమించారు.

ఒక్క అస్సాంలోనే 50 శాతం తేయాకు ఉత్పత్తి అవుతోంది. 50 టన్నుల పైన వున్న తేయాకు ఉత్పత్తులు 250 కోట్ల



విదేశీ మారకాన్ని సంపాదించి పెడుతున్నాయి. తేయాకు ఉత్పత్తుల్లో మన దేశం జపాన్‌ను తోసి రాజనేంత ఘన విజయాన్ని సాధించింది. మనకి దొరికే పేడి పానీయాల్లో టీ ధరే అన్నింటి కంటే తక్కువ. 'సో ఔర్ దో చాయ్' అనచ్చు ఈజీగా.

మేలురకం తేయాకును చైనానుంచి తెచ్చిఅస్సాం, దిబ్రూగర్‌లలో నాటించారు. ప్రస్తుతం మన దేశంలో తేయాకు వుత్పత్తికి అవే ముఖ్య కేంద్రాలు. కానీ అప్పట్లో తేయాకు తోటల్లో పనిచేయడానికి స్థానికులెవరూ ముందుకొచ్చే వారు కాదు. బ్రూస్ వాళ్ళని బతిమాలి, బామాలి ఇక లాభంలేదని దక్షిణాది నుండి కొందరు పనివారిని ప్రత్యేకంగా పిలిపించి వారికి పని నేర్పించాడు.

మొట్ట మొదటిసారిగా వుత్పత్తి అయిన అస్సాం టీ కలకత్తా రేవుద్వారా లండన్ చేరుకుంది. అక్కడ దాన్ని అధిక ధరకి వేలం వేశారుకూడా. రాను రాను పనిలో సులుపు బలువులు తెల్సుకుని స్థానికులు కూడా తేయాకుతోటల్లో పని చేయడానికి వుత్సాహం చూపి పని నేర్చుకోవడమేగాక మంచి నైపుణ్యం సంపాదించారు.

దేశం మొత్తంమీద ఇవాళ 13,000 టీ ఎస్టేట్లు వున్నాయి. ఎనిమిది లక్షల మంది పనివారిలో సగం మంది స్త్రీలే.

# ఖరీదైన వైద్యం

మనుషులకే మందులు అందుబాట్లో లేక దిక్కులేని చావులు ఛస్తున్న ఈ రోజుల్లో జంతువులకి ఖరీదైన వైద్యం జరగడం అరుదైన విషయమే. కాంచీపురం ఆలయపు ఏనుగు కామాక్షికి జబ్బు చేసింది. దానిని నయంచేసే మందు జర్మనీ నుంచి తెప్పించాలి. చాలా డబ్బు ఖర్చవుతుంది. అటువంటి సమయంలో ఇటాలియన్ ఎయిర్‌లైన్స్ వారి మద్రాసు బ్రాంచి మేనేజర్ నాగనాథ్ ఆ భారం తనపై వేసుకుని టెలెక్స్ ద్వారా పశ్చిమ జర్మనీలోని ఫ్రాంక్‌ఫర్ట్ ఆస్పత్రి అధికారులని సంప్రదించేడు. కావలిసిన రెండు మందుల్లో ఒకటి మాత్రమే దొరుకుతుందనీ, అది కూడా ద్రవ రూపంలో

వుందనీ వాళ్ళు తెలియజేసారు. మద్రాసు వెటర్నరీ హాస్పిటల్‌వారికా విషయం చెప్పి వాళ్ళు సరేననగానే మళ్ళీ ఫ్రాంక్ ఫర్టు ఆస్పత్రి అధికారులని మందులు వీలైనంత త్వరగా పంపమని చెప్పేడు. వాళ్ళు ఒప్పుకుని పంపుతామనగానే కస్టమ్స్ శాఖవారిని కలుసుకుని మందులు త్వరగా అందేటట్టు చూడమని బతిమాలుకున్నాడు.



మందులు అక్కడ్నుంచి బొంబాయి మీదుగా మద్రాసు అక్టోబర్ 3,1980 నాటికి చేరుకున్నాయి. దేవుడికో దణ్ణం పెట్టి ఆ మందులు తీసుకెళ్ళి వెటర్నరీ హాస్పటల్ వారికిచ్చాడు.

అయితే ఆ మందు ఖరీదు ఐదువేల ఏడు వందల రూపాయలు. ఫ్రాంక్‌ఫర్ట లోని ఇటాలియన్ ఎయిర్‌లైన్స్ ఆఫీసు వారు ఆ ఖరీదు చెల్లించారు కాని మన కస్టమ్సువారు దానిమీద చెల్లించాల్సిన సుంకం 89 శాతం వుంటుందని తేల్చి చెప్పేరు. నాగనాథ్ ఢిల్లీ ఆరోగ్య సంస్థ డైరెక్టరు జనరల్‌కి పరిస్థితి వివరిస్తూ ఆ సుంకం చెల్లించమని విజ్ఞప్తి చేసేరు. ఈ విషయంతో తాము చేయగలిగిందేమీ లేదనీ, మనుషుల విషయంలో తప్ప జంతువుల కేసులు తాము పరిశీలించ మనీ, కావలిస్తే వాణిజ్యశాఖ మంత్రి వర్యులకి విషయం విన్నవించమని తిరుగు జవాబు రాసేరు. పాపం నాగనాథ్ ఆ పని కూడా చేసినప్పటికీ ఇంతవరకూ అక్కడ్నుంచీ ఏ జవాబూ రాలేదని వాపోయారు.

వన్యమృగ సంరక్షణ సంవత్సరంగా ప్రకటించిన ఈ సంవత్సరంలో భారత ప్రభుత్వం ఇటువంటి వాటికి సుంకం మినహాయింపు విధిస్తే బాగుంటుందని ఆయన ఉద్దేశ్యం.

## ప్రకటన పెళ్ళిళ్ళు

రోజూ పేపర్లలో మనం పెళ్ళి ప్రకటనలు చూస్తునే వుంటాం. ఒక ప్రముఖ పత్రిక ఇటీవల ఈ విషయంలో జరిపిన సర్వేవల్ల కొన్ని వింతైన విషయాలు బయటపడ్డాయి. ఒక వారంలో అన్ని పత్రికల్లో కలిపి సుమారు 2,500 వరకూ పెళ్ళిళ్ళకు సంబంధించిన ప్రకటనలు పడుతుంటాయనీ, సుమారు ఐదు లక్షల వుత్తరాలు ఈ విషయమై బట్వాడా అవుతుంటాయనీ తేలింది. ఇలా ప్రకటనల ద్వారా పెళ్ళి చేసుకోదల్చుకున్న ఆడపిల్లల్లో 60 శాతం విద్యాధికులేననీ, ప్రతి పది ప్రకటనలలో ఆరు వరుడు కావాలన్న ప్రకటనలేననీ వీరు తెలియజేశారు



'భార్యా రూపవతీ శత్రుః' అని తెలిసినప్పటికీ ప్రతివాడూ తన పెళ్ళాం అందంగా వుండాలనే కోరుకుంటాడు. ఈ ప్రకటనల్లో కూడా అబ్బాయిలు ఎక్కువ మంది కాబోయే భార్య రంభకు కనీసం చెల్లెల్లాగన్నా వుండాలని కోరుకోడంలో తప్పలేదు. అమ్మాయిల విషయానికొస్తే ఎక్కువ మంది 'కులం'పట్ల మక్కువ చూపిస్తున్నారనీ, వరుడు తప్పనిసరిగా తమ కులంవాడే అయ్యుండాలని ఎక్కువ శాతం కోరుకుంటున్నారనీ తేలింది. అబ్బాయిలు కులానికి అంత ప్రాముఖ్యత నివ్వలేదని కూడా తెలిసింది. ముఖ్యంగా వీరు ఉద్యోగం చేస్తున్న అమ్మాయిల్నే ఎక్కువగా కోరుకుంటున్నారు. అమ్మాయిలు కూడా వీళ్ళకేం తీసిపోకుండా డాక్టర్లనీ, ఇంజనీర్లనే డిమాండ్ చేస్తున్నారట.

దక్షిణ భారతదేశంలోని అమ్మాయిలకి వీటన్నిటితో పాటు అబ్బాయిల జాతకం'పట్ల కూడా ఖచ్చితమైన నియమాలున్నాయనీ ఆ పత్రికవాళ్ళు తమ సర్వే ద్వారా తెలియజేశారు.

# ఉత్తరాలే ప్రయాణికులు

ఫ్రాన్సు దేశంతో ఉత్తరం పోస్టు-చేసిన 24 గంటల్లోపల ఆ దేశంలోని ఏ మారు మూల ప్రాంతానికైనా చేరవేయబడుతుంది. అనేక దేశాల్లోలేని ప్రత్యేకత ఫ్రాన్సులో వుండటం వల్లనే ఇది సాధ్యమవుతోంది.

ఫ్రాన్స్ పోస్టల్ డిపార్ట్‌మెంటులో ప్రత్యేకంగా వుత్తరాలని మాత్రం తీసుకువెళ్ళడానికి 15 విమానాలున్నాయి. ఇవన్నీ రాత్రిళ్ళే నడుపబడతాయి. ఆ సమయంలో వివిధ విమానాశ్రయాల్లో రద్దీ తక్కువగా ఉంటుంది. సంవత్సరానికి 120 కోట్ల ఉత్తరాలని ఆ విమానాలు ఫ్రాన్స్ దేశంలోని ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి చేర వేస్తాయి.

రాత్రిళ్ళు విమానాలని నడిపే పైలట్లని 'గుడ్లగూబలు' అని సరదాగా పిలుస్తారు. ఎలాంటి ఇబ్బందికరమయిన వాతావరణంలోనైనా సరే ఇవి తిరుగుతూనే వుంటాయి. మంచు బాగా పేరుకుని, దారి సరిగ్గా కనపడని రోజుల్లో కూడా ఏరో పోస్టల్ సర్వీస్ రద్దుకాదు. సంవత్సరానికి 16 వేల ఫ్లైట్స్ వుండే వాతావరణం

# ఆడుకునే పసి మొగుడు...!

ఆమె పద్దెనిమిదేళ్ళ యువతి. లేత గులాబి రంగు శరీరం. కాటుక దిద్దిన వారేడేసి కళ్ళు. పౌర్ణమి జాబిల్లి వంటి గుండ్రని మొహం! ఆ మొహంలో అమాయకత్వం నిక్షిప్తమై వుంది... కానీ ఆ వయసు అమ్మాయిల్లో ఉండవలసిన చురుకుదనం, చలాకీతనం మాత్రం మచ్చుకైనా లేవు ఆమెలో. మౌనంగా, విషాదంగా కూర్చునుంది.

ఆమె ప్రక్కనే పది పదకొండేళ్ళ కుర్రాడు కూర్చుని ఉన్నాడు. నోటికి విరామం ఇవ్వకుండా సదా ఏదో ఒకటి నములుతూనే ఉన్నాడు. చీటికి మాటికి అది కావాలి, ఇది కావాలి అంటూ మారాం చేస్తున్నాడు.

ఆ పసివాడు ఆ అందాలగాని భర్త..! పెద్దలందరి ఆమోదంతోనే, ఆదేశంతోనే ఆమెకు అధినాధుడుగా మారాడా కుర్రవాడు... ఐస్ క్రీం కోసం మారాం చేసే పసివాడు అతడు.

ఇదెలా సాధ్యం...? ఎంత ఆచారం, సాంప్రదాయం అయినా ఇంత విపరీతం ఉంటుందా?...

అది ఎలా జరిగిందో, దాని పరిణామా లెలాంటివో విస్తో భాషా రచయిత్రి షాజాదీ తన అపూర్వ కథానిక 'బలి'లో గుండెల్ని పిండివేసేలా వర్ణిస్తారు, 'విపుల' మే నెల సంచికలో.

ఈ కథ... ఇటువంటి మరెన్నో భాషల ఆసక్తికరమైన కథలకు వేదిక విపుల. వివిధ భాషల విశిష్ట కథల పఠనానికి ఏకైక సాధనం విపుల.

కథలతోపాటు నవ్వించే కార్టూన్లు, జోకులు, ఆశ్చర్యచకితుల్ని చేసే విచిత్ర విశ్వ విశేషాలు 'విపుల' అదనపు ఆకర్షణలు. నెల నెలా ఒకసారి భూప్రదక్షిణం చేయించే విశ్వకథా విపంచి విపుల. రంగుల ఆఫ్ సెట్ ముద్రణలో ఆకర్షణీయమైన చిత్రాలు విపుల ప్రత్యేకత.



ప్రతి నెలా
1వ తేదీకి వెలువడే
విశిష్ట కథా వేదిక

**విపుల**

132 పేజీలు
రెండు రూపాయలే!

బాగాలేక 5 లేక 10 ఫ్లైట్స్ మాత్రమే రద్దు చేస్తారు. ఇది ప్రపంచంలోనే రికార్డ్.

ఈ విమానాలు ఎప్పుడూ ఆలస్యంగా నడవ్వు. అన్నీ సమయానికి గమ్యం చేరుకుంటాయి. ఆలస్యం చేయకపోతే పైలట్లకి 'రెగ్యులారిటీ ప్రీమియం' పేరిట కొంత ఎక్కువ సొమ్ము ముట్టడమే ఇందులోని రహస్యం.

1919లో ఈ ఏరో పోస్టల్ సర్వీస్ ప్రవేశపెట్టబడింది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఇది రద్దు చేయబడి, అనంతరం ఇది నెలకొల్పబడింది. ఫ్రాన్సు లోని 8 చోట్లకి ఈ విమానాలు నడుస్తాయి. ఆదేశంలోని ఉత్తరాలలో మూడో వంతు విమానాలలోనే చేరవేయబడుతున్నాయి.

చిన్న దేశమే అయినా 20,000పైగా పోస్టాఫీసులు గల ఫ్రాన్స్‌లో 40 సెంటైమ్ (53 పైసలు) తపాలాబిళ్ళ అతికించిన ఏ ఉత్తరమయినా ఒక్క రోజులో చిరునామాకి చేరుకుంటుంది.

## సద్వినియోగం

నేరస్తులకు విధించిన మరణశిక్షలను వీలయినంత తక్కువ బాధ కలిగేలా అమలుపరిచే మార్గాలను పూర్వంనుంచీ అన్వేషిస్తూనే వున్నారు. ఎలక్ట్రిక్ కుర్చీ కూడా ఆ విధంగానే రూపొందించబడింది. 1890లో అమెరికాలోని ఆబర్న్ జైల్లో మొట్టమొదటి ఎలక్ట్రిక్ కుర్చీని స్థాపించారు. అప్పటి వార్తాపత్రికలు దీనిగురించి తెగ రాశాయి. అలా వార్తా పత్రికల్లో వచ్చిన ఓ వ్యాసాన్ని 1844 - 1913 మధ్య కాలంలో ఇథియోపియన్ చక్రవర్తిగా వున్న రెండవ మెనెలిచ్ చదవడం తటస్థించింది. రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా అని వెంటనే మూడు ఎలక్ట్రిక్ కుర్చీలకు ఆర్డరిచ్చాడు. వెంటనే ఆ కుర్చీలను తయారు చేస్తున్న న్యూయార్క్ ఫర్మ్ క్షణక్షణంబు మహరాజుల చిత్తముల్ అని తలచి మూడు కుర్చీలను ఓడలో పడేసి అడిస్అబాబాకి చేర్చేశారు. తీరా అక్కడికి చేరాకగాని ఆ కుర్చీలు విద్యుచ్ఛక్తి లేకపోతే పనిచేయవని తెలిసింది. అప్పటికింకా విద్యుచ్ఛక్తి ఇథియోపియా చేరలేదు. కుర్చీలు వెనక్కి పంపడం అవమానం గనక చక్రవర్తిగారు బుర్ర బద్దలుకొట్టుకొని ఓ తరుణోపాయం ఆలోచించారు. ఆ మూడు కుర్చీల్లోకెల్లా ఖరీదయిన, ఆధునికంగా కన్పిస్తున్న రెంటిని ఎంచుకొని తనకూ, తన భార్యకూ



సింహాసనాలుగా ఉపయోగించాలని నిర్ణ

యించుకున్నాడు. తర్వాత సతీసమేతుడై ఎలక్ట్రిక్ కుర్చీల్లో ఆసీనుడైన రాజుగారు సింహాసనాలకన్నా ఇవే చాలా సౌకర్యంగా వున్నాయని తెగమెచ్చుకున్నారట.






## అసలీ-నకిలీ

ఈరోజుల్లో నకిలీవస్తువులకు కూడా అసలు వాటి కున్నంత విలువుంది. ఫ్రాన్స్‌లోని జీన్ డి స్పెరాతి అనే మహానుభావుడు నకిలీ స్టాంపులను తయారు చేయడంలో పేరుపొందాడు. ఇతను రూపొందించిన నకిలీ స్టాంపులు బ్రిటన్‌లోని జాతీయ తపాలా బిళ్ళల ప్రదర్శనశాలలో కూడా భద్రపర్చబడ్డాయి. ఈ మ్యూజియంలోని స్పెరాతి నకిలీస్టాంపులు చూడవచ్చేవారికో ప్రత్యేక ఆకర్షణ.

ఇతను మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో నకిలీ స్టాంపుల తయారీ వృత్తి ప్రారంభించాడు. ఈకారణంగానే 1952లో అరెస్టయి జైలును సంపర్కించాడు. అయినా తిరిగే కాలూ, తిట్టేనోరూ లాగే స్పెరాతి చేతులు కూడా ఊరుకోలేదు. జైల్లో వుంటూనే డెబ్బయివేల నకిలీ స్టాంపులు సృష్టించాడు.

అరుదైన తపాలబిళ్ళ డిజైను ఉన్నదున్నట్లు కాపీకొట్టడంలో ఇతను ఘనుడు. స్పెరాతి రూపొందించిన కృత్రిమ స్టాంపులు మైక్రోస్కోపుతో చూసినా తేడా తెలీసంత పకడ్బందీగా తయారయి వుంటాయి. బ్రిటన్‌లోని జాతీయ తపాలా బిళ్ళల ప్రదర్శనశాలలోని స్పెరాతి కృత్రిమ స్టాంపుల్లో ఒక సెంట్ విలువ చేసే రెండు అరుదైన స్టాంపులున్నాయి. ఇవి 1953లో విడుదల చేయబడ్డాయి. విచిత్ర మేమిటంటే ఈ కృత్రిమ స్టాంపుల ఖరీదు అసలు స్టాంపుల విలువతో సమానంగా వుంది. ఈ కృత్రిమ స్టాంపులు రెండూ పదమూడు వేల పౌండ్ల విలువ చేస్తాయి.

## నడకానందుడు

శ్రీలంక దేశీయుడైన వివేకానంద సెల్వకుమార్ ఆనందన్ అనే ఆయనకు వున్నట్టుండి నడకలో రికార్డ్ సృష్టించేయాలని కోరిక పుట్టుకొచ్చింది. ఇంతకు మునుపాయన శ్రీలంక నుంచి పాక్ జలసంధి, అండమాన్ల మీదుగా సముద్రంలో ఈదుతూ మన దేశం వచ్చిన ఘనుడితను. భారత దేశంలో ఇతనికంటే ముందు 144 గంటలు నడిచి రికార్డు సృష్టించిన హర్బచన్‌సింగ్‌ని అధిగమించాలనే పట్టుదలతో కొలంబో క్రికెట్

గ్రౌండ్‌లో సుమారు 400 కిలో మీటర్లు 6 రోజులపాటు నడిచి అనుకున్నది సాధించాడు. ఈ ఆరు రోజుల నడకలో



అన్నీ పనులూ నడుస్తూనే చేసేవాడు. భోజనం కూడా నడుస్తూనే చేసేవాడు. ఎక్కువగా ద్రవపదార్థాలనే తీసుకునేవాడు.

బంధువులు, మిత్రులు అతనికి ఈ కార్యక్రమంలో చాలా సహకారాన్నందించారు. ఆనందన్ శ్రీలంకలో లాయరు. భార్య, ఇద్దరు కొడుకులు వున్న ఆనందన్ మళ్ళీ మరో రికార్డు సృష్టించే ప్రయత్నంలో వున్నాడిప్పుడు.

## సీతాకోక చిలుక

కోళ్ళ ఫారం, గేదెల ఫారం గురించి విన్నాం కాని సీతాకోకచిలుకలఫారం వుందని విన్లేదు. షెర్‌బార్న్‌కు నివాసి రాబర్ట్ కూటన్ అనే పెద్దమనిషి ఆ పుణ్యం కూడా కట్టుకున్నాడు.

సుమారు మూడు ఎకరాల స్థలంలో ఈ ఫారం కట్టాడీ మహానుభావుడు. దేశదేశాలు తిరిగి, కొండలు, కోనలు గాలించి రకరకాల, రంగు రంగుల సీతాకోక చిలుకల్ని సేకరిస్తూ ఇటీవలే మన దేశం కూడా వచ్చేడు.

ఈయన దగ్గర వివిధ సైజుల్లో, రంగుల్లో సీతాకోక చిలుకలు అసంఖ్యాకంగా వున్నాయట.

కానీ వీటిని పెంచడం చాలా కష్టమనీ, కొన్ని కొన్ని సీతాకోక చిలుకలు ప్రత్యేక వాతావరణంలో, నిర్దిష్టమైన కొన్ని మొక్కలమీద మాత్రమే బతుకుతాయనీ చెప్పాడీయన. అయినా పట్టు విడవకుండా ఆయా పరిస్థితులు కల్పించి మరీ పెంచుతున్నానని చెప్పేడు. ఈ విషయంలో తన భార్య రోజ్ మేరీ చాలా



సహాయపడుతోందని, తనకు రంగులంటే వున్న విపరీతమైన ఆకర్షణ, మోజే దీనికంతటికీ కారణమని రాబర్ట్ కూటన్ వినయంగా విన్నవించుకుంటున్నాడు.

## గుడ్లు

గుడ్డు సంగతి ఎరుగని వాళ్ళెవరూ వుండరు. కానీ అంత చిన్న గుడ్డు కూడా పెద్ద పెద్ద నమ్మకాలకి కారణమవుతుందంటే ఆశ్చర్యమే. గుడ్డు పగలగొట్టిన వెంటనే పైనున్న డిప్పని ముక్కలు ముక్కలు చేసి నాశనం చేసెయ్యాల్ట. మంత్రగాళ్ళు గాని ఒకవేళ ఆ డిప్పని

సంపాదిస్తే, పగలగొట్టిన వాడి పని ఖాళీ. గది మధ్యలో గుడ్డుని వేలాడదీస్తే ఆ ఇంటికి శుభాలు చేకూరుతాయనీ, పెగా పిడుగుల బారినుండి ఆ ఇంటిని రక్షిస్తుందని బ్రిటిష్ వాళ్ళ నమ్మకం.

పడవల్లో, ఓడల్లో ప్రయాణించేటప్పుడు గుడ్లు వెంటతీసికెళ్తే, దుష్టగ్రహాల ఆగ్రహానికి గురై పడవ సముద్రంలో మునిగిపోతుందని స్వీడన్ దేశస్థుల విశ్వాసం.

చీకటిపడ్డాక గుడ్డు ఇంట్లోకి తీసుకురాకూడదని ఫ్రాన్సులో ఆడవాళ్లు భయపడతారు. అలా చేస్తే ఇంటికి అరిష్టమని వాపోతారు.

ఇవన్నీ చూసి 'ఆ! గాడిదగుడ్డు' అని కొట్టిపారేసేవాళ్ళు కూడా అక్కడక్కడా వున్నారెండి.

## రికార్డ్ మోజు

పాశ్చాత్య సంగీత ప్రపంచంలో ఊరూ పేరూ లేని వాళ్ళు కేవలం ఒకే ఒక్క పాటతో రాత్రికి రాత్రి ఆకాశమంత ఎత్తుకి ఎదిగిపోయిన సంఘటనలు అడపా దడపా కనిపిస్తూనే వుంటాయి. మనీలాకి చెందిన ఫ్రెడ్డి ఆగిలర్ పాడిన ఒక పాట రికార్డులు ఆసియాలోనే 45 లక్షలు అమ్ముడుపోవడంతో రెండేళ్ళ క్రితం ప్రఖ్యాత గాయకుల లిస్టులోకి చేరిపోయాడు. ఫిలిప్పైన్స్ భాషలో వున్న ఆ పాట మలయా, జపనీస్, ఇంగ్లీషు, స్పానిష్, ఇటాలియన్, కొరియన్ భాషల్లోకి తర్జుమా చేయబడింది.

దాంతో ఫ్రెడ్డీకి యూరప్, ఇటలీ, జర్మనీ, జపాన్, హాంగ్ కాంగ్ ల టి. వి. లలో పాల్గొనే అవకాశాలు కుప్పలు తెప్పలుగా వచ్చి పడ్డాయి. 27 ఏళ్ళ ఫ్రెడ్డీ అందగాడేం కాదు. భుజాల మీదుగా ముందుకి పడుతున్న పొడవైన జుత్తు, తలమీద టోపీ, నాలుగంగుళాల ఎత్తున్న చెప్పులతో, గిటార్‌ను గుండెకు దగ్గరగా అదుముకొని తాదాత్మ్యతతో గుండె లోతుల్లోంచి తన భావాలను వెలికి తీసి ప్రేక్షకులకు వినిపిస్తుంటాడు. అతని పాటల్లోని ఆ ఆర్ద్రత ప్రేక్షకులను వెంటాడుతుంది.



ఇతనికి సంగీతంలో ఎలాంటి శిక్షణా లేదు. సంగీత ప్రపంచంలోని నియమ నిబంధనల నధిగమించి తన స్వంత నియమాలతో హృద ... ాకట్టుకొనే పాటల స్వరకల్పనే ... శయం. సంగీతం అతని ప్రాణ

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasund... ...ns.
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Te
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD /402